# జాతక నారాయణీయం-2 సంపత్ కుమార్ మేడవరపు

## యోగావళి

అంకితము

నా ఇష్టదైవములగు

శ్రీ పార్వతీ పరమేశ్వరులకు

ఈ పుస్తకమును

అంకిత మొనర్చుచున్నాను

ఇట్లు

వాడ్రేవు సూర్యనారాయణమూర్తి

# పీ ఠి క

సంస్కృతాంధ్రములలో గల జ్యోతిషగ్రంథములలో యోగ విషయమున "పూర్వపరాశరి" కి మించినది మఱొక్కటిలేదు. ఇది జాతకచంద్రిక యని సామాన్యముగా వ్యవహరింపబడుచున్నది. వాస్తవమునకు దీనియందలి ముప్పదియేడు శ్లోకములు మాత్రమే పరాశరప్రోక్తములు. శ్రీ వేంకటేశ్వర దైవజ్ఞుడు మొదట మూడు శ్లోకములను చివర నలువది శ్లోకములను చేర్చి మొత్తము ఎనుబది శ్లోకములకు "జాతక చంద్రిక" యని పేరిడెను. ఈజాతకచంద్రికను ఎఱుగని జ్యోతిష్కులుండరు. ఈ గ్రంథ ప్రాశస్త్యమునకు కారణ మేమన గ్రంథకర్తయగు పరాశరమహర్షి తన యనుభవమును నొకచో జేర్చి రత్నములవంటి ముప్పదియేడుశ్లోకములను లోకమునకు ప్రసాదించుటయే. ఈ ముప్పది యేడు శ్లోకములు నతిక్లుప్తములుగ నుండి భావవిషయమున మాత్రము నతిగంభీరములై యోగవిషయమున శాస్త్రసార గర్భితములుగా నున్నవి.

ఈ గ్రంథముయొక్క యుత్కృష్టతను గుర్తించియే గాబోలు "సర్వక్రతువు, వేంకటేశ్వర దైవజ్ఞుడు, ఆలూరి యేకామ్రదైవజ్ఞుడు" మొదలగువారిరువది మందికిపైగా దీనికి వ్యాఖ్యానములను వ్రాసియుండిరి. ఇందలి విషయములు (యోగవిషయమున) అనుభవమునకు తూచా సరిపోవుచున్నవి. అందువలననే వేంకటేశ్వర దైవజ్ఞుడు క్రింది శ్లోకమును పూర్వపరాశరిని ప్రశంసించు సందర్భమున వ్రాసికొనెను.

శ్లో॥ కళాపారాశరీహోరా ప్రత్యక్ష ఫలదర్శని।
తదుక్తరీత్యానుమేయం జన్మకాల శుభాశుభమ్॥

గ్రహములకు ఆధిపత్యముచేతను నైసర్గికముచేతను బలాబలములను నిర్ణయించుటకు ఈ గ్రంథ మొక్కటియే యాధారము.

కాని ఈ గ్రంథము (పూర్వపారాశరి)న నున్న పెద్దలోటు ఏమన, నైసర్గికముచేతను ఆధిపత్యముచేతను నిర్ణయించిన గ్రహబలములు తిరిగి స్థితిచేతను సంబంధముచేతను ఎట్లుమారి యోగావయోగముల నిచ్చుచున్నవో యను విషయమును గ్రంథకర్త వ్రాయప్రయత్నించియుండక పోవుటయే. సర్వక్రతువు మొదలగు వ్యాఖ్యాతలైనను పై లోపమును పూర్తిచేసియుండలేదు. వారి వ్యాఖ్యానములైనను సాంప్రదాయానుసారముగను అనుభవమునకు సరిపడునట్లుగను లేవు. గ్రంథకర్త యగు పరాశరుని యభిప్రాయమునుగూడ తేట తెల్లముగ విశదీకరించియుండలేదు. వీరి యభిప్రాయములుకూడ నిర్ణీతములగు ప్రమాణసూత్రములుగ వచ్చియుండలేదు. మావంశ పరంపరగా వచ్చు సాంప్రదాయములను ఈ శాస్త్రమునకు సంపుటి చేసి అనుభవములో వేలకొలది జాతకములను పరీక్షించి పై లోపమును పూర్తిచేసితిని. నేనీ గ్రంథమును అనుభవమునకు సరిపడునట్లుగాను సాంప్రదాయ యుక్తముగాను అనేకములగు ఉదాహరణములు ద్వాదశలగ్నముల క్రింద చెప్పినాను. పూర్వపారాశరి యందలి మూలశ్లోకములను ఎక్కడికక్కడ విమర్శించి అనుభవమునకు సరిపెట్టుట కష్టసాధ్యమగుటచే సుమారు పది సంవత్సరములకు పైగాపట్టినది.

ఈ పుస్తకమును నాలుగు ఖండములుగ విడదీసినాను. (1 యోగావళీఖండము 2 బాలారిష్టఖండము 3 ఆయుర్దాయఖండము 4 మిశ్రఫలఖండము.) ఇట్లు చేయుటకు కారణము : పరాశరుడు చెప్పిన ముప్పదియేడు శ్లోకములలోను ఆరు శ్లోకములు మాత్రము ఆయుర్విషయమున చెప్పబడియున్నవి. ఈ ఆరుశ్లోకములను యోగ భాగమునుండి విడదీసి ఆయుర్దాయఖండమున వివరించితిని. ఆయుర్దాయమునుగూర్చి వ్రాయుటకు ముందు బాలారిష్టములను వ్రాసిన గాని సాంప్రదాయముగాదను నాశయముచే బాలారిష్టఖండమును

గూడ ప్రత్యేకముగ వ్రాసితిని. ఈ బాలారిష్టాధ్యాయమున మహర్షుల యొక్కయు వరాహమిహిరాదుల యొక్కయు మతములను మాత్రమే వ్రాసియున్నాను. జాతక నారాయణీయపు మొదటిభాగములోని బాలారిష్టాధ్యాయమున చెప్పబడిన యోగములే గాక అనేకములగు విశేషాంశములిందు పొందుపరచబడినవి. ఆయుర్దాయమునగూడ నిట్లే నూతన విషయములనేకములిందు వివరింపబడినవి. జాతకచంద్రికయందు వేంకటేశ్వర దైవజ్ఞునిచే కలుపబడిన నలుబది శ్లోకముల యందలి కొన్ని యంశములు గ్రాహ్యములగుటచే నా శ్లోకములను గూడ విమర్శించి ప్రత్యేకముగా మిశ్రఫల ఖండముగ వ్రాసియున్నాను.

ఈ గ్రంథమును పాఠకులు చదివి వారి యనుభవమునకు తెచ్చుకొని దీనియందలి మంచి మాత్రమే గ్రహింతురుగాక! జాతక నారాయణీయ ప్రథమ భాగమును నాకు తండ్రియును, గురువును నైన శ్రీ వేంకటరాజుగారికి అంకితమిచ్చినాను. పరాశర ప్రోక్తమగు నీ గ్రంథమునకు వ్యాఖ్యానమును వ్రాసి నాయిష్టదైవములగు శ్రీ పార్వతీ పరమేశ్వరులకు అంకితమిచ్చుట నా పూర్వజన్మసుకృతముగా భావించుచున్నాను.

ఆంధ్రదేశమున విద్యాధికులును జ్యోతిషమునందే గాక సంగీత సాహిత్యాద్యనేక విద్యలయందు ప్రజ్ఞావంతులును, ఆంధ్రవిశ్వవిద్యాలయ కళాశాలాధ్యక్షులునునగు విద్వాన్ అప్పారావుపంతులు, ఎమ్. ఎ; యల్. టి. యమ్. ఇ. యస్ గారు ఈ శాస్త్రమునందు గల అభిమానముతో దీనికి దయతో తొలిపలుకు వ్రాసినందులకు వారికి నా కృతజ్ఞతానేకాభివందనములు.

రాజమండ్రి
19-6-1948

విబుధజన విధేయుడు,
వాడ్రేవు సూర్యనారాయణమూర్తి.

సంపత్ కుమార్ మేడవరపు

# గ్రంథప్రశంస

(బ్రహ్మశ్రీ కోన రాఘవయ్యగారు, పెంటపాడు)

శా॥ శ్రీమౌద్గల్యసగోత్ర శీతకరా! వాడ్రేవు ప్రభాభాస్కరా!
సోమామాత్య నిజాభిజాత్యనయ! నిస్తుల్య ప్రభావోదయా!
రామస్వామి సుధీంద్ర పౌత్రసుచరిత్ర వ్యక్తధీరవ్రతా!
ధీమద్వేంకటరాజపుణ్యసుత! జ్యోతిశ్శాస్త్ర పారంగతా!

క. జ్యోతిశ్శాస్త్రాబ్ధికి మీ
రేతంబెత్తి రచియింప నిలువరుసై మీ
తాతలతండ్రుల కృషియై
జాతక నారాయణీయ సత్కృతి పొడలెన్

శా॥ ఏవో లెక్కలు వేసి రాసి గతులో యేతారలో గాములో
భావాభావవిభేదముల్ తెలియు కే వాదంబులో సేయు నే
లా? విద్వాంసులు మెత్తురే? భళిర! నీ వ్రాతల్ జగద్గీతలా
లే! వాడ్రేవు పవిత్రవంశ గుణపూర్ణా! సూర్యనారాయణా!

మ॥ అసమాన ప్రతిభాధురంధరుడు తానై యెత్తుపై నెత్తు నే
ర్చు సమర్థుండయి ముందువెన్కలను నల్పొప్పుల్ గను
గొంచు నే
దెస నేదెటు తానో రాసులను బండ్రెంటన్ గ్రహంబుల్, నవై
క సమీకన్ జదరంగమాడినవలె దత్కాలజ్ఞు డత్యంతమున్.

మ॥ అవినాభావ వివేకమూని యటులన్యో యర్థసామగ్రి సూ
క్ష్మవిధానంబున దేల్చి శాస్త్రవిధికిన్ మర్యాదవోకుండమా
ర్దవమై పండిత పామరాది జనవేద్యంబై త్రికాలాన లో
క విశేషంబులు వన్నె గాంచుగద! నీ గ్రంథంబు
సామాన్యమే!

# తొలిపలుకు

ఈ గ్రంథకర్తగారగు శ్రీవాడ్రేవు సూర్యనారాయణమూర్తిగారు నాకు చిరపరిచితులు. వీరికి జ్యోతిషము ఉగ్గుపాలతో వచ్చిన విద్య. తండ్రిగారు, మేనమామగారు సంప్రదాయమెఱిగిన జ్యోతిష్కులు. అభిమానముగా నేర్చిన విద్యలలో నొకటి. అందుచేత సూర్యనారాయణమూర్తిగారు పెద్దలు సంపాదించిన గ్రంథములన్నింటిని జదివి, అంతతో బోక చెన్నపట్టణమున చదువుకొన్న రోజులలో ప్రాచ్య లిఖిత పుస్తకాలయమున జ్యోతిషగ్రంథములను విమర్శనాదృష్టితో జదివియున్నారు. 1933లో జాతకనారాయణీయమను గ్రంథమును ప్రచురించిరి. అందు అనేక ఋషులయభిప్రాయములు క్రోడీకరించి ద్వాదశభావములకు జెందిన విషయములను ప్రథమ ఖండమందున, జైమినీజాతక ఫలాధ్యాయములోని 257 సూత్రములకు అర్థమును రెండవ ఖండమందు సంగ్రహముగ వ్రాసియున్నారు.

జ్యోతిషమీయనకు వృత్తిగాక అభిమానవిద్యయౌటచేత, తీరిక యున్నపుడెల్లను శాస్త్రపరిశ్రమచేయుచుండిరి. అనేకులకు జాతకములను చూచిపెట్టుట ముహూర్తములనుబెట్టి యిచ్చుట ఈయన ఇంటి వద్ద నిత్యముచేయుపని. అందుచేత వేలకొలది జాతకములను వీరు చూచుట తటస్థించినది. ఆ యనుభవమును విభజించి, పరిశీలించి, సూత్రప్రాయములుగా భావించుకొని, శాస్త్రగ్రంథములకు సమన్వయించుకొనుచు వచ్చినారు. అన్ని ఫల గ్రంథములలోను విఖ్యాతిగాంచిన జాతకచంద్రిక యను నామాంతరముగల పూర్వ పారాశరికి ఉన్న అనేక ప్రసిద్ధ వ్యాఖ్యానములుకూడ జ్యోతిష్కులకు ఫలముచెప్పుటలో అనుభవమునకు సరిపోకుండుటను గుర్తించి, గతిం

చిన 10-12 పండ్లనుండి గ్రహించిన విషయములను జొప్పించి ఒక వ్యాఖ్యానము వ్రాయనిశ్చయించుకొన్నారు. తత్ఫలమే ఈ గ్రంథము. ఇది బాగుగా చదివినచో గ్రంథకర్త పడ్డ శ్రమ, వారి పరిశీలనా సామర్థ్యము వ్యక్తము కాగలదు.

ఈ యోగావళీ ఖండమనబడు పూర్వపారాశరి వ్యాఖ్యానమందలి విశేషమేమనగా: నైసర్గికాధి పత్యము వలన నిర్ణయించిన గ్రహబలములు స్థితిసంబంధములవలన ఎట్లు మారుచున్నది, అనుభవమునకు సరిపడునట్లు ఇచ్చియుండుటయే. ఈ వివరములు మూలసూత్రములోని స్థూలాభిప్రాయములను ఎట్లు మార్చుకొని అనుభవములో అన్వయించుచవలెనో స్పష్టముగా వీరు వ్రాసియున్నారు. మరియు సందర్భమును బట్టి సాంప్రదాయముగావచ్చుచున్న అనేకవిషయములనుకూడ వాఖ్యానమునచేర్చియున్నారు. నాల్గవ శ్లోకములో జాతకచంద్రిక కర్త చెప్పిన దృష్టులగురించేకాక విశేషములగు గ్రహదృష్టులనుగురించి విపులముగా చేర్చిరి. 'సర్వేత్రికోణ నేతారో' అను 5-వ శ్లోకమునకు సాధారణముగా చెప్పుపద్ధతికి భేదముగా వ్యాఖ్యానము, సహేతుకముగ, విపులముగా ఇచ్చియున్నారు. ఈ భేదాభిప్రాయమే పరాశరి కర్తయొక్క నిజాభిప్రాయమని తరువాతి శ్లోక వివరణలో నిరూపించినారు.

గ్రహములు నైసర్గికముగా శుభులని, పాపులని, ద్వివిధములని, అట్టి స్వభావగుణము ఆధిపత్యముచేత మారునని, అదికూడ స్థితివలన ఇతరగ్రహసంబంధమువలన మారునని, ఈమార్పులన్నిటిని గుర్తించిగాని ఏగ్రహము ఏఫలమిచ్చునో చెప్పవీలులేదని స్పష్టపరచి అనేక ఉదాహరణములను అనుభవమునుండి యిచ్చియున్నారు. ఇదే ఈగ్రంథకర్తయొక్క వ్యాఖ్యానమందలి విశిష్టత. ఇక్లైరాసుల

విషయముకూడ విపులీకరించినారు. ఈ 5, 6, శ్లోకములకు చాలా విపులముగ వ్యాఖ్యానము వ్రాసి సరియైన మార్గమును చూపించి యున్నారు. ఇట్లే తక్కిన శ్లోకముల కుచితరీతిని వ్యాఖ్యానము వ్రాసి ఎచ్చట మూలశ్లోకము అనుభవమునకు సరిపోవుట లేదో ఉదాహరణ పూర్వకముగా స్పష్టపరచిరి.

ఈ గ్రంథము యోగావళి, బాలారిష్టము, ఆయుర్భాగము, మిశ్రఫలము, అని నాల్గు భాగములుగానున్నది. అందులో మొదటి యధ్యాయము విపులముగా నున్నది.

పాశ్చాత్యవిజ్ఞాన సంబంధముచేత ప్రాత విద్యలయందు, అందు ముఖ్యముగా జ్యోతిష ఫలభాగమందు నమ్మకము పోయి యున్నరోజులివి. విద్యాధికులకు, ఈ విద్యయందు గౌరవము లేద నియే చెప్పవలసియున్నది. పరాశర, జైమిని, శ్రీపత్యాదుల మార్గ ములను సంప్రదాయసిద్ధముగా చదివి తెలిసికొనక, ఏదో కొంత సగము సగము తెలిసికొని, సూక్ష్మాసూక్ష్మములను గుర్తించక, విశృంఖలముగా ఫలాపేక్షతో ఇచ్చకములుజెప్పు జ్యోతిష్కులు ఈ శాస్త్రమందు మరింత అగౌరవమును అపనమ్మకమును పుట్టించు చున్నారు. మరియు ఇంకొకవిషయము ముఖ్యమైనదున్నది. జాతక చక్రములు సరిగాయుండినగదా! జాతకఫలము సరిగాజెప్పుట కాధార మేర్పడును. జననకాలమందు గల గ్రహస్థితి నెరుగుట పంచాంగ ములమీద యాధారపడియున్నది. పూర్వము పెద్దలు శ్రద్ధాభక్తు లతో న్యాయముగురీతిని కష్టించి పంచాంగముల గుణించుచుండెడి వారు. నేడు అందరూ పంచాంగకర్తలే. ఒకదానికిఇంకొకదానికి, తిథి నక్షత్ర, గ్రహప్రవేశాదులలో అంతా వ్యత్యాసమే. ఇట్టి స్థితిలో సరియైన పంచాంగము నాధారము చేసికొనుట యెట్లో తెలియవలెను,

దృక్సిద్ధరీత్యా జాగ్రత్తగా గుణించిన పంచాంగములను మాత్రమే ప్రమాణముగా నిత్యకృత్యములకు, జాతకచక్రములను వ్రాయుటకు వాడవలసియున్నది. ఈ విషయముయొక్క ప్రాముఖ్యము గుర్తింపనిచో-ఎంత శ్రమ తీసికొని ఫలములు చెప్పగలిగినా, ప్రయోజనముండదు.

అట్లు సరియైన మార్గములననుసరించి, ఈ గ్రంథకర్తగారు పడ్డ శ్రమను సార్థకము చేయగలరని జ్యోతిష్కులకు, జ్యోతిషాభిమానులకు మనవిచేయుచున్నాను.

శ్రీ వాడ్రేవు సూర్యనారాయణమూర్తిగారు అనేక సంవత్సరములనాటి వారి అమూల్యమైన అనుభవ జ్ఞానమును పుస్తకరూపమున జ్యోతిషలోకమున కందించినందులకు మిక్కిలి వందనీయులు. వీరు శ్రమపడి త్రొక్కిన విమర్శనామార్గమును జ్యోతిషాభిమానులు ఇంక నెందరో త్రొక్కి జ్యోతిషశాస్త్రమం దభిమానముచూపి దాని గౌరవమును పెంపొందించగలరని నమ్ముచున్నాను. ఈ గ్రంథము చదువరులకత్యంతోపయోగముగానుండి వారి యాదరాభిమానములకు పాత్రమగునని నమ్ముచున్నాను.

రాయ[illegible]
మద్రా[illegible]
10-5-[illegible]

వి స్సా అ ప్పా రా వు,
యమ్. ఏ. ఎల్. టి., యెమ్. ఇ. యస్. (రిటైర్డు)

సంపత్ కుమార్ మేడవరపు

ఓమ్

శ్రీ పార్వతీపరమేశ్వరాభ్యాంనమః

# జాతక నారాయణీయము



## (ద్వితీయ భాగము)

## పూర్వపారాశరి అను యోగావళీ ఖండము



### — ఇష్టదైవ ప్రార్థన —

శ్లో॥ యోగిధ్యేయం విమలవిశదప్రస్ఫురద్రమ్యకాన్తిం
శాన్తం బుద్ధం సురపరివృఢై రాసతై రర్చ్యమానమ్ ।
కారుణ్యార్ద్రం హసిత సుషమా మోహితాశేషవిశ్వం
సాక్షాత్తత్త్వ ప్రకృతి ముమాసంయుతం నౌమిశమ్భుమ్॥

### — గ్రహదృష్టులు —

శ్లో॥ పశ్యంతి సప్తమాన్సర్వే శని జీవకుజాః పునః ।
విశేషతశ్చ త్రిదశ త్రికోణ చతురశ్రగాన్॥

(పాఠాంతరము, చతురష్టగాన్)

సర్వే – సమస్తగ్రహములు, అనగా సూర్యాది సప్తగ్రహములు, సప్తమాన్ – తామున్నరాశి కేడవరాసులను, పశ్యంతి–చూచుచున్నారు, శని జీవ కుజాః–శని గురు కుజులు, పునః–ఇంకను,

విశేషతః-విశేషదృష్టికలవాడై, (క్రమముగా) త్రిదశ త్రికోణ చతురశ్రగాన్-మూడు పది స్థానములను, పంచమ నవమ స్థానములను, నాలుగు యెనిమిది స్థానములను, పశ్యంతి-చూచుచున్నాడు.

ఇచ్చట ''క్రమశః'' ''విశేషతః'' అను శబ్దములు వాడుటలో యాశని గురు కుజులు సప్తమదృష్టితో పాటు యీ విశేషదృష్టులు కూడా కలవని యభిప్రాయము ఈశ్లోకమున పరాశరుడు సామాన్యముగా జాతుకలోనున్న గ్రహదృష్టులను మాత్రమే చెప్పుచున్నాడు. ఈశ్లోకములో ''చతురశ్రగాన్'' అని కొన్ని ప్రతులలో గలదు. కాని యీ పాఠము తప్పని తోచుచున్నది. 'అశ్ర' శబ్దము నుపయోగించిన యెడల అక్షరసంజ్ఞ ప్రకారము అర్థము చెప్పుకొన్నగాని ఎనిమిది రాదు. ఈ శాస్త్రమున పరాశరమహర్షి అక్షరసంజ్ఞ నుపయోగించవలెనని యెచ్చటను చెప్పియుండలేదు. త్రిదశ, త్రికోణ, చతుర్ శబ్దముల నుపయోగించి 'అశ్ర' శబ్దము మాత్రము అక్షర సంజ్ఞచే నిర్ణయించుటకుగాను వ్రాసియున్నాడని చెప్పుట చాలశోచనీయము. సాంప్రదాయముకూడ కాదు. కాబట్టి ''చతురష్టగాన్'' అను పాఠమే సరియైనది. పైన చెప్పిన ప్రకారము గ్రంథకర్త చెప్పిన దృష్టివిశేషములు కాక అనేక విశేషాంశములెందు చెప్పుచున్నాను. ప్రతిగ్రహమున్ను తానున్న రాశి మొదలు 3-10 స్థానములను పాద దృష్టిచే చూచును. 5-9 రాసులను అర్థదృష్టిచే చూచును. 4-8 స్థానములను త్రిపాదదృష్టిచేచూచును. అనగా 2, 6, 11, 12 స్థానములను చూడనేచూడదు. అట్లే అన్నిగ్రహములు సప్తమమును పూర్ణదృష్టిచే చూచెదరు. ఇందుకు లఘుజాతకమున శ్లో॥ దశమ తృతీయే నవమ పంచమ చతురష్టమాన్ కళత్రంచ। పశ్యంతి పాద దృష్ట్యా వృధ్యాఫలాని చైవం ప్రయచ్ఛంతి॥ అని చెప్పబడినది. అట్లే సారావళియందు శ్లో॥సవ్యం పశ్యంతి సదాగ్రహాశ్చరణ

వృద్ధిః స్వర్వే త్రిదశ త్రికోణ చతురష్ట సప్తమ గతానుఫలం క్రమేణైవ॥ అని చెప్పబడియున్నది. ఇందుకు బాదరాయణాచార్యులుకూడా శ్లో॥ సౌరి స్తృతీయదశమో గురుస్త్రికోణం కుజస్తు చతురష్టమం। పశ్యతి సమగ్రమిత రేచరణ వివృధ్యాథ సప్తమం సర్వే॥ అని చెప్పినాడు. యవనాచార్యుడుకూడా శ్లో॥ ద్వౌ పశ్యమాష్టమ తద్ద్వితీయం సంస్థానగా శేః పరిహృత్య విశేషాః గ్రహాః। పశ్యంతి సర్వకాలమేష్వేషు బైస్థోహితాదృష్టా॥ శ్లో। జామిత్రభే దృష్టిఫలం సమగ్రం స్వపాద హీనం చతురశ్రయోశ్చ। త్రికోణయోః ఫలార్థమా మదనిశ్చక్య సంజ్ఞే దశమేచ నాదం॥ అని చెప్పినాడు. అనగా విశేషదృష్టిగల గ్రహములకు విశేషదృష్టి పూర్ణదృష్టికంటె బలము. ఇందుకు నారావళియందు శ్లో॥ పూర్ణం పశ్యతి రవిజ తృతీయదశమే త్రికోణమపి జీవః। చతురశ్రం భూమిసుతః సితార్క బుధహిమకరాః కళత్రంచ॥ అని చెప్పబడినది. ఇందుకు గర్గి శ్లో॥ దశ్చిక్య స్వగతాన్ సౌరి స్త్రికోణస్థాన్ బృహస్పతిః। చతురష్టమగాన్ భౌమ శ్శేషాః సప్తమ సంస్థితాన్ భవంతి వీక్షణే నిత్యముక్తాధిక ఫలాగ్రహాః॥

ఇందుకు అర్థమేమనగా పైన చెప్పినప్రకారము విశేషదృష్టిగల గురుశని కుజులు విశేషదృష్టిలో ప్రబలురనియును పూర్ణదృష్టి విశేష దృష్టికంటె తక్కువయనియును తెలియుచున్నది. ఇది త్రిమతముల వారును (పరాశర, జైమిని, వరాహమిహిర) అంగీకరించినవిషయము. కాని కొందరు గ్రహముల గమనమునుబట్టి దృష్టిని విడదీసినట్లు కనుపించుచున్నది. అదెట్లనగా-శని, దృష్టివలన పాదఫలము మాత్రమే యిచ్చుననియును, బృహస్పతి అర్థఫలము నిచ్చుననియును, కుజుడు త్రిపాదఫలము నిచ్చుననియును, రవి చంద్ర బుధ శుక్రులు పూర్ణఫలము నిచ్చువారనియును చెప్పుచున్నారు. ఈ మతమనుభవమునకు వ్యతిరిక్తము. ఇంకను కొందరు శని, స్థితికంటె

దృష్టివలన నెక్కువ బలవంతుడని చెప్పుచున్నారు. అనగా శని యేస్థానమందైన నుండుటకంటె యాస్థానమునుచూచుటయే నెక్కువ బలమని వీరి యభిప్రాయము. ఇదియును సమంజసముకాదు. కొన్ని గ్రహముల కాచ్ఛాదన కలదు. ఆచ్ఛాదన యనగా గ్రహముల తేజస్సు వారున్న రాశియేగాక యితర రాసులనుగూడ కప్పుట యని భావము. ఇదియును దృష్టివంటిదే. ఈయాచ్ఛాదన, పూర్ణ చంద్ర, గురు శని కేతువులకు కలదు. వీరిలో చంద్ర శని కేతువులు తామున్న రాశినిగాక ద్వితీయమును ద్వాదశమునుకూడ నాచ్ఛాదన చేయుదురు. గురుడు నైసర్గిక శుభులతో గలసినప్పుడుగాని, ఒంటరిగా యుండినగాని ద్విద్వాదశముల నాచ్ఛాదించును. నైసర్గిక పాపులతో గలసినప్పుడు ద్వితీయమును ఆచ్ఛాదింపడు. ద్వాదశమును మాత్రము నాచ్ఛాదించును. రవితో గలసిన యేగ్రహమైనను పైని చెప్పబడిన యాచ్ఛాదశక్తిని కోల్పోవును. ఎందువల్లననగా యాగ్రహమునకు నస్తంగతత్వము పట్టును. పూర్ణచంద్రుడుమాత్రమే యాచ్ఛాదించునని యిదివరలో చెప్పియున్నాను. పూర్ణచంద్రుడనగా శుద్ధపంచమి మొదలు బహుళ దశమి వరకును, ఇతర తిథులలో చంద్రునకు నాచ్ఛాదనశక్తి లేదని యర్థము. ఈ దృష్టులుగాక జైమినీ దృష్టులు వేరుగా కలవు, వీటికి రాశిదృష్టులని పేరు. ఒకరాశి నింకొకరాశి చూచుచుండును. అట్లే ఆయారాసులయందున్న గ్రహములుకూడా చూచుకొనుచుండును. ఈ దృష్టులనుగూర్చి నేను వ్రాసిన జాతకనారాయణీయమందు ప్రథమభాగమున చెప్పబడినది.

శ్లో॥ సర్వే త్రికోణనేతారో గ్రహాః శుభఫలప్రదాః।
పతయస్త్రిషడాయానాం యది పాపఫలప్రదాః॥

త్రికోణనేతారః - లగ్న పంచమ నవమాధిపతులైన, సర్వేగ్రహాః - అన్నిగ్రహములు, శుభఫలప్రదాః - మంచిఫలమునిచ్చెదరు,

త్రిషడాయాధిపా యోగోయది - లగ్నమునకు మూడు, ఆరు, పదకొండు స్థానముల కధిపతులైనచో, పాపఫలప్రదాః-అనయోగము నిచ్చెదరు. ఈ విషయము అనుభవమునకు విరుద్ధము. పరాశరోక్త పాఠము పరంపరచే భ్రష్టమై యుండనోపును. ఈ క్రిందివిధముగా చెప్పినగాని యనుభవమునకు సరిపడదు.

త్రికోణపేశాశ్చైవ-"లగ్నాత్తుపంచమ నవమాధిపత్యములు పట్టినప్పుడు సమస్తమైన సూర్యాది పాపగ్రహములు పాపఫలమునే యిచ్చును." అని చెప్పినచో అనుభవమునకు సరిపోవుచున్నది.

ఇచ్చట నేను పాపగ్రహములుఅనిమాత్రమే చెప్పుటకుతరువాతి శ్లోకములలో శుభగ్రహములకు అధిపత్యదోషము ప్రత్యేకముగా గ్రంథకర్త నిర్ణయించియున్నాడు. అదియునుగాక సాంప్రదాయమునుబట్టి చూచినచో సూర్యుడు గ్రహరాజుగనుక ముందుసూర్యునితో ప్రారంభించుట శాస్త్రసమ్మతము. ఈకారణమునవలన గ్రంథకర్త పాపగ్రహములగు రవి కుజ శనులకు మాత్రమే పైశ్లోకమున నాధిపత్యదోషమును నిర్ణయించినాడు. ఇదివరలో వ్రాసినవారు "సర్వేగ్రహాః" అనుమాటకు శుభపాపగ్రహములని చెప్పుచున్నారు. ఇది యనుభవమునకు వ్యతిరిక్తము. కేంద్రాధిపత్యము శుభగ్రహములకు దోషమని గ్రంథకర్త చెప్పినపుడు కోణాధిపత్యము నైసర్గికపాపులకు దోషమని వేరుగా చెప్పనక్కఅలేదు. ఇది గురుపరంపరయా వచ్చు సాంప్రదాయము. ఈ సాంప్రదాయము తెలియక పైశ్లోకమున కర్థము చెప్పినచో ననుభవమునకు నెక్కడను సరిపడదు.

ఉదాహరణ:—ధనుర్లగ్నమునకు కుజునకు పంచమాధిపత్యము పట్టుగాన్, రవికి నవమ కోణాధిపత్యము పట్టును. అప్పుడా నవమ పంచమాధిపత్యములు పట్టిన రవి కుజులు నవమ పంచమములలో

నెక్కడనున్నను పాపఫలమునే యిత్తురు. వీరికవి స్వక్షేత్రములైన నత్యంత పాపఫలము నిత్తురు. శనికి ఉచ్ఛపట్టినయెడల మిక్కిలి పాపఫలమునిచ్చునని చెప్పవలెను. వీరిద్దరును కలసి పంచమ నవమముల యందెచ్చట నున్నను పాపఫలమునే యిత్తురు. వీరు లగ్న చతుర్థ సప్తమ దశమములందెక్కడనున్నను పైని చెప్పినంత (అనగా కోణస్థితియంత) లేకపోయినను చాలవరకు పాపఫలితమునే యిచ్చెదరు. ఈకోణాధిపత్యదోషము గ్రహములకుత్తరోత్తర మనగా కోణాధిపత్యదోషము-లో పంచమకోణమునకు గల దోషము కంటె నవమకోణమునకు యెక్కువ పాపత్వము చెప్పవలెను. పైన చెప్పినప్రకారముశనికన్నను కుజునకంటె రవికికోణాధిపత్యదోషము ప్రబలము. ఇట్టి కోణాధిపత్యమువలన కలిగిన, దోషమునకు తిరిగి కోణస్థితి కల్గిన యెడల మొదటి కోణాధిపత్యదోషమునకు మరింత బలముకల్గి ప్రబలమైన పాపఫలము నిచ్చును. వీరి కా కోణములందు పరివర్తన కల్గినను పైవిధముగానే చూచుకొనవలెను. నైసర్గిక ముగకూడ రవ్యంగారక శనులకు నైసర్గిక పాపత్వ ముత్తరోత్తరం. అనగా రవి అర్థపాపి. కుజుడు ముప్పాతిక పాపి. శని పూర్ణపాపి. ఈ కారణమువలన కోణాధిపత్యము రవి కుజ శనులకు పట్టినప్పుడు రవికంటె కుజుని కెక్కువ, కుజునికన్న శని కెక్కువ యని గ్రహించవలెను.

2. ఉదాహరణ :— తులాలగ్నమునకు శనికి వాహనపంచ మాధిపత్యములు కలవు. కాబట్టి కోణాధిపత్యదోషము పట్టును. ఇట్టి శని తిరిగి పంచమ నవమములందున్న యెడల యోగము నివ్వడు. పంచమము స్వక్షేత్రము గనుక యోగవిషయమునకు మిక్కిలి పాపి. అట్లే మేషలగ్నమునకు పంచమాధిపత్యము పట్టిన రవి పంచమమందుగాని కేంద్రములయందుగాని యున్న దోషయు యశుభఫలముల నిచ్చును. మీనలగ్నమునకు భాగ్యాధిపత్యము

పట్టిన కుజుడు కేంద్ర కోణస్థితులవలన పాపఫలము నిచ్చును. కర్కాటకలగ్నమునకు పంచమాధిపత్యము పట్టిన కుజుడు కోణములందుండినను పంచమమునకు స్వక్షేత్రమునందుండినను పాపఫలము నిచ్చును. ఇచ్చట నొక సాంప్రదాయము కలదు. ఒక గ్రహమునకు రెండాధిపత్యము లున్నపుడు రవికి తప్ప కుజ శనులకు రెండాధిపత్యములు వచ్చును. మొదటిది కోణాధిపత్యమై రెండవది కేంద్రాధిపత్యమైనయెడల పట్టియెడ నుత్తరోత్తరముచే వచ్చిన కేంద్రాధిపత్యము బలమై కేంద్రస్థితి వలన రాజయోగము నిచ్చును. కాని అప్పుడుకూడా కోణస్థితి కలిగినయెడల కోణాధిపత్యదోషము రెట్టించి ప్రబలమై కేంద్రాధిపత్య శుభత్వము నివ్వక పాపఫలితమును మాత్రమే యిచ్చును.

3. ఉదాహరణ :—కర్కాటకలగ్నమునకు ముందు కోణాధిపత్యదోషమును తరువాత కేంద్రాధిపత్య శుభమును కుజునకు గలుగును. అప్పుడు కుజుడు లగ్నమందుగాని, చతుర్థమందుగాని, దశమమందుగాని యోగించును. ఇచ్చట సప్తమ కేంద్రమగు మకరము వదలివేయుటలో నొక సాంప్రదాయము కలదు. శ్లో॥ పాపాఃసీచ గతాః శుభైర్బలయుతాః" అని కాళిదాసు వ్రాసినాడు. ఇది యనుభవములో సరిగా సరిపోవుచున్నది. ఉచ్ఛ యెల్లప్పుడును నైసర్గిక పాపులకు అశుభము. ఈ కారణమువలన మకరమందున్న కుజుడు కేంద్రస్థితియైనను యోగించడు. ఇందులో నుత్తరోత్తరము గనుక మేషమున మిక్కిలి యోగము చేయును. కర్కాటకమున మిక్కిలి యోగమునిచ్చును. తుల సామాన్య యోగము. మకరము అశుభము. ఇదే ప్రకారము చతుర్థ నవమ కోణాధిపత్యములు పట్టిన కుజుడు త్తరోత్తరముచే కోణాధిపత్యదోషములో ప్రబలుడై ధనుస్సునందుగాని మేషమందుగాని వున్నయెడల యోగము నివ్వడు. వృషభలగ్నమునకు శనికి ముందు కోణాధిపత్యము తరువాత కేం

ద్రాధిపత్యము పట్టును. పై సాంప్రదాయప్రకారము శని మకర మందుగాని, కన్యయందుగాని శుభము నివ్వడు. ఈ శని సింహ మందుగాని, కుంభమందుగాని యున్న యెడల ప్రబలరాజయోగము నిచ్చును ఇచ్చట సాంప్రదాయమేమనగా నైసర్గిక పాపులగు కుజ శనులకు ముందు కేంద్రాధిపత్యము తరువాత కోణాధిపత్యము వచ్చుట మిక్కిలి దోషము కోణాధిపత్యము పట్టిన కుజ శనుల విషయములో యీ క్రింద వ్రాసిన యారు సాంప్రదాయములు ముఖ్యములు.

(1) నైసర్గిక పాపులకు కోణాధిపత్యము పాపము.

(2) ఇట్టికోణాధిపత్యదోషము గల్గి కేంద్రకోణస్థితి వీరికి పాపత్వ మునకు మిక్కిలి వృద్ధి.

(3) వీరికి వృచ్ఛ యెల్లప్పుడు పాపము.

(4) కోణాధిపత్యదోషము వీరికి రెండువిధములు.

(5) ముందు కోణాధిపత్యదోషము పట్టి తరువాత కేంద్రాధి పత్యము పట్టుట.

(6) ముందు కేంద్రాధిపత్యముపట్టి పిమ్మట కోణాధిపత్యముపట్టుటా

పై ప్రకారము కోణాధిపత్యము పట్టిన నైసర్గికపాపులు స్థితిచేన వలన యితర గ్రహసంబంధములవలన యోగము నివ్వగలరు కోణాధిపత్యదోషము గల రవి కుజ శనులకు పాపస్థితిగాని పాపాధి పతుల సంబంధముగాని కలిగిన రాజయోగము. పాపాధిపతుల సంబంధముకంటె పాపస్థానములందుండుట ప్రబల రాజయోగము అనగా తృతీయ షష్ఠాష్టమ వ్యయస్థితులయందీ యధిపతుల సం బంధమువలన కోణాధిపత్యదోషము పోయి శుభఫలము నిచ్చెదరు.

ఉదాహరణ:—మేషమునకు రవి పంచమకోణాధిపతియగును. ఇట్టి రవి తృతీయమందుగాని వ్యయమందుగాని మిక్కిలి రాజయోగ మునిచ్చును. షష్ఠాష్టమలందు సామాన్యయోగము. ఇవి పా

నిచ్చును. ఈ కేంద్రములలో లగ్నసప్తమములందు మిక్కిలియోగ మెక్కువ. వృశ్చికమందు అంతకన్న తక్కువ. వృషభమందు అంతకన్న తక్కువ. ఈశని కోణములందున్నను రాజయోగము నిచ్చును. గాని ఈయోగము కేంద్రములం దున్నప్పుడుకంటె తక్కువ. ద్వితీయ ఏకాదశములందు సామాన్యయోగము. ఏకాదశముకంటె ద్వితీయము తక్కువ. పాపస్థానములం దవయోగము. అందు షష్ఠమునయెక్కువ. కన్యాలగ్నమునకు కోణాధిపత్యము పట్టి, షష్ఠాధిపత్యముపట్టును గాన కోణములందుగాని పాపస్థానములందుగాని శని యోగమునివ్వడు. కేంద్రము లందుండిన కొంత వరకు రాజయోగము నిచ్చును. లగ్నకేంద్రమగు కన్యయందుండిన అతిస్వల్పయోగము. దశమకేంద్రమగు మిథునమందు ఎక్కువ యోగము. వృశ్చికలగ్నమునకు శనికి తృతీయ చతుర్థాధి పత్యములు వచ్చును, గాన కేంద్రకోణములయందుండుట మంచిది. ఈ కేంద్రములలో (వృశ్చికమునకు) 4-10ల యందు ఎక్కువయోగము. ఇట్టి శనికి రవి సంబంధము కలిగిన యెడల చక్కని రాజయోగము నిచ్చును. కుజుడు కలిసినను మంచియోగము నిచ్చును. కుజుడు కలియుట కంటె రవి శనులు కలిసి దశమమునందుండిన అత్యంత రాజయోగము. ఈలగ్నమునకు శని పాపస్థానము లందుండిన రాజయోగము నివ్వడు. అందు తృతీయము మరింతపాపము. ధనుర్లగ్నమునకు ద్వితీయ తృతీయాధిపత్యము పట్టిన శని కేంద్ర కోణములందుండిన మంచిది. పాపస్థానములందుండిన యోగము నివ్వడు. ఏకాదశమందుండి రవితోకలసిన యోగము నిచ్చును. కుంభలగ్నమునకు లగ్నవ్యయాధిపత్యము గలశని కేంద్రములందు మిక్కిలి మంచివాడు. కోణములందు కొంత తక్కువ. ఈ కేంద్రములలో లగ్న సప్తమ దశమ కేంద్రములందు మిక్కిలి ప్రశస్తము,

3-6-8-11 లందు యోగమునివ్వడు. పాపస్థానమైనను ద్వాదశమందు యోగము నిచ్చును. ద్వితీయమందు సామాన్యయోగము. ఈ శనికి భాగ్యకోణము ఉచ్చ గనుక పంచమకోణమందుండుటకంటె తక్కువయోగము నిచ్చును. మీనలగ్నమునకు లాభవ్యయాధిపత్యము పట్టిన శని కేంద్రకోణములందుండుట మంచిది. అందు లగ్న కేంద్రమునందు బహుసామాన్యము పాపస్థానములందు యోగము నివ్వడు. ద్వితీయ ఏకాదశములందుకూడా యోగమునకు మంచిదికాదు. కాని ధనభావమునకు కొంతమంచిది.

శ్లో॥ నదిశంతి శుభం నృణాం సౌమ్యాః కేంద్రాధిపాయది,
క్రూరాశ్చే దశుభం త్వేతే ప్రబలా ఉత్తరోత్తరం॥

నైసర్గికశుభులగు గురు శుక్ర బుధ పూర్ణ చంద్రులు, కేంద్రాధిపతులైనయెడల శుభఫలమును ఇవ్వరు. రవికుజశనులకు కేంద్రాధిపత్యము పట్టుటవలన పాపఫలమును, ఇవ్వరు. అనగా శుభఫలమే నిత్తురు. ఈనైసర్గికశుభులును పాపులును, ఈ కేంద్రములలో నుత్తరోత్తర బలముచేత ననగా లగ్నముకంటె చతుర్థము చతుర్థముకంటె సప్తమము సప్తమముకంటె దశమమును నైసర్గికశుభులే అవయోగమునకు బలవంతులుగాను నైసర్గికపాపులు యోగమునకు బలవంతులుగాను అగుదురు.

గ్రంథకర్త ఈశ్లోకమున నైసర్గికశుభులగు గురు శుక్ర బుధ పూర్ణ చంద్రులకు ఆధిపత్యదోష నిరూపణ చేసియున్నాడు. కేంద్రాధిపత్యము నైసర్గికశుభులకుదోషముగ నిర్ణయించుటచేత నైసర్గికపాపులకు కోణాధిపత్యము దోషమని వేరుగా చెప్పనక్కరలేదు. జ్యోతిష సాంప్రదాయికులకు ఇది చెప్పనక్కరలేదు. ఈ కారణమువలన నేను

ఇదివరలో కోణాధిపత్యము నైసర్గికపాపులకు దోషమని నిర్ణయించి నాను ఇదియే ఈగ్రంథకర్తయొక్క అభిప్రాయము. అనుభవసిద్ధము.

సామాన్యముగా గ్రహములు శుభగ్రహములనియు పాపగ్రహ ములనియును వాడబడుచున్నవి. కాని ఇదిపొరపాటు. గ్రహములను నైసర్గికశుభులనియును నైసర్గికపాపులనియును వాడవలయును. ఈ పదమువాడినగాని గ్రహములయొక్క స్వభావగుణములు తెలియవు. ఇట్టి స్వభావగుణము ఆధిపత్యస్థితి సంబంధములవలన యేవిధముగా మార్పుజెంది ఆయాగ్రహములకు శుభాశుభములుకలిగించి యోగా వయోగముల నిచ్చుచున్నదో తెలుపబడును. అనగా స్వతస్సిద్ధ మగు నైసర్గికగుణముఆధిపత్యముచేమారును. ఇట్లు ఆధిపత్యముచే మారినగుణము తిరిగి స్థితివలనను ఇతర గ్రహసంబంధమువలనను మార్పుజెందును. అట్టిమార్పుజెందిన గ్రహముమాత్రమే శుభుడు డగుగాని పాపిగాని యై శుభాశుభఫలములనిచ్చును. ఈ మార్పు లెట్లు కెంతవరకు కలుగుచున్నవో తెలియుటకు కొన్ని ఉదాహరణలను వ్రాయు చున్నాను. ఈ గ్రంథమున ముఖ్యమైనలోటు యేమనగా గ్రంథ కర్త నైసర్గికగుణము ఆధిపత్యముచేత యెట్లుమారుచున్నదో వ్రాసి నాడు కాని అట్లుమారిన గుణము స్థితికలియకలవలన మారి యెట్లు యోగ అవయోగముల నిచ్చుచున్నదో వ్రాయలేదు. ఈ లోటు నేను పూర్తిచేయుచున్నాను. గ్రహములకువలెనే రాసులకుకూడ నైసర్గికగుణము యేర్పాటు చేయబడినది. శుభరాసులు కేంద్రకోణ ములు 1-4-5-7-9-10లు వీటికి వ్యతిరిక్తములగు రాసులు 6న్ను 2-3-6-8-11న్ను యివి పాపరాసులు. ఈ రాసులకును గ్రహము లకును ఉన్నసంబంధమే శుభాశుభయోగములకు కారణము. ఇచ్చట నైసర్గికపాపరాసులు వేరు, భావములు వేరు. పా రాసులు అనగా సహజముగా నైసర్గికపాపులయొక్క

అర్థము. అట్లే శుభరాసులనగా నైసర్గిక శుభులయొక్క రాసులని అర్థము. పైగ్రహములకువలెనే రాసులకుకూడా ఈవిధముగా నైసర్గికము నిర్ణయింపబడినది. ఇట్టి నైసర్గిక రాసులును శుభరాసులున్ను లగ్నమునుబట్టి భావములుగా నేర్పడి శుభాశుభములుగా మారును. అనగా మేష, సింహ, వృశ్చిక, మకర, కుంభములు 5 రాసులున్ను నైసర్గికపాపరాసులైనను కేంద్రకోణములైనయెడల శుభరాసులుగామారును. ఇతర రాసులు అనగా 2-3-6-8-11-12 నైసర్గిక శుభరాసులైనను భావమువలన పాపరాసులగును. దీనిని బట్టి గ్రహించునదియేమనగా గ్రహములకు నైసర్గికగుణము కేంద్ర కోణాధిపత్యమువలన శుభాశుభములక్రింద నెట్లు మారుచున్నదో అట్లే రాసులకుకూడా నైసర్గికగుణము లగ్నమునుబట్టి, తన్వాది ద్వాదశభావకల్పనవల్లను, మార్పునెందుచున్నది. ఈ గ్రంధమునందు కేంద్రాధిపత్యము నైసర్గికపాపులకు శుభమనియును నైసర్గికశుభులకు పాపమనియును వ్రాయుటవలన కోణాధిపత్యము నైసర్గికశుభులకు మంచిదని వేరుగా వ్రాయనక్కరలేదు. అట్లే కేంద్రవ్యతిరిక్తమైన స్థానములు నైసర్గికశుభులకు ఆధిపత్యవిషయమై శుభరాసులగును. ఈ కారణమువలన నైసర్గికపాపులకు కోణవ్యతిరిక్తరాసులు ఆధిపత్యవిషయమై శుభరాసులగును. 2-3-6-8-11-12 రాసులకు పాప స్థానములని వచ్చుటకు కారణము కేంద్రాధిపత్యము శుభులకు, కోణాధిపత్యము పాపులకును పాపమగుటకును, మిగిలిన ఆరు పాప రాసులు శుభపాపగ్రహములకుసమానముగా పాపఫలములిచ్చునవి గాన, పాపరాసులని యేర్పరుపబడినవి. ఉదాహరణములు ఇచ్చుటకు ముందు ఒకవిషయము జెప్పుచున్నాను. నైసర్గికశుభులనగా గురు శుక్ర పూర్ణచంద్ర బుధులని చెప్పినాను. నైసర్గికమునుబట్టి పాపులను, అర్థపాపి, 3/4 పాపి, పూర్ణపాపి అని చెప్పినట్లుగానే నైసర్గికశుభులకుగూడ నిర్ణయింపబడినది. అది యెట్లనగా నైసర్గికమున గురుడు, పూర్ణచంద్రుడు, పూర్ణశుభులు, శుక్రుడు ముప్పా

స్భుడు. ఈబుధుడు పాపులతో కలసిన
కలసినయెడల రవితో కలియుటకంటె
లసినయెడల పాతికపాలు శుభుడగును.
క్షపాపియగును. అప్పుడు నైసర్గికశుభు
రితోనైన కూడా కలసినయెడల పాతిక
చంద్రుడు శుద్ధసప్తమి మొదలు బహుళ
గురునితో సమానబలము కలిగియుం
శుద్ధషష్ఠి వెళ్లువరకును, బహుళ అష్టమి
తిగ మొదలు దశమి వెళ్లువరకును, సమానబలము కలిగియుండును. శుద్ధ
విదియ 30 ఘ. మొదలు శుద్ధచవితి వెళ్ళువరకును బహుళ ఏకా
దశి మొదలు త్రయోదశి వెళ్ళువరకును బుధునితో సమానమైన
బలము కలిగియుండును. బహుళ చతుర్దశి మొదలు విదియ
30 ఘ. వరకు రవితో సమానమైన పాపత్వము కలవా
డగును. కాబట్టి ఈ నైసర్గికశుభత్వగుణము ఆయా గ్రహముల
కెంతవరకు కలదో అంతవరకు సరిపడిన కేంద్రాధిపత్యదోషము
మాత్రమే వారికి ఆధిపత్యములవల్ల కలుగును. అట్టిదోషమునకు
తగినంతమార్పు మాత్రమే వారికి స్థితివలన కావలసివచ్చును.
కేంద్రాధిపత్యము నైసర్గికశుభులకు నాల్గువిధములుగా మారును.

| | |
|---|---|
| 1. ద్వితీయ కేంద్రాధిపత్యము<br>2. ధనసప్తమాధిపత్యము<br>3. పాప కేంద్రాధిపత్యము<br>4. కేంద్రకోణాధిపత్యము<br>5. ఉభయ కేంద్రాధిపత్యము | మొదటి నాల్గు రకములు శుక్రునికి వచ్చును 5వ రకము గురు బుధులకు మాత్రము వచ్చును. చంద్రునికి ఒకే ఆధిపత్యముగనుక గురుబుధుల |

వలెనే చూచుకొనవలెను. కేంద్రాధిపత్యదోషము నిర్ణయించు
టలో గురు బుధ పూర్ణచంద్రులకంటె శుక్రునకు ఎక్కువకష్టము.
ఈ కారణమువలన ముందు శుక్రుని విషయము చెప్పి ఇతర

గ్రహములగు గురుబుధుల విషయము ప్రత్యేకముగా చెప్పదలచి, నాను. మేషలగ్నమునకు శుక్రునికి ద్వితీయ సప్తమాధిపత్యము పట్టునుగాన కేంద్రాధిపత్యదోషము యెక్కువగా కలవాడగును. ద్వితీయముతోకూడిన కేంద్రాధిపత్యముతోగలుపక ప్రత్యేకముగా చెప్పుటకు కారణమేమనగా, ద్వితీయ మితర పాపరాసులలో గలి యక మిశ్రరాశిగా పరిగణింపబడుచున్నది. అందువలన ఏగ్రహము నకైనను ద్వితీయాధిపత్యము పట్టి ఇంకొక ఆధిపత్యమువచ్చినప్పుడు ని ఆరెండవ ఆధిపత్యశుభాశుభములను వృద్ధిచేయుటకు పనికివచ్చును. తాను స్వతంత్రముగా ద్వితీయాధిపత్యసంబంధమగు యోగ అవ యోగములనివ్వడు. ఈకారణమువలన శుక్రుని ద్వితీయాధిపత్యము వలన సప్తమ కేంద్రాధిపత్యదోషము ప్రబలమగును. వృషభ లగ్నమునకు లగ్నషష్టాధిపత్యము పట్టును. మిధునమునకు, కన్యకు ధనస్సునకు, మీనమునకు, గురు బుధులకు ఉభయ కేంద్రాధిపత్య దోషము కలుగును. కర్కాటకమునకు శుక్రుడు వాహనలాభాధిపతి యగుటచేత కేంద్రాధిపత్యదోషము పట్టినది. సింహలగ్నమునకు శుక్రునికి తృతీయ దశమాధిపత్యములు పట్టును. తులకు లగ్నాష్ట మాధిపత్యములు పట్టును. వృశ్చికమునకు సప్తమవ్యయాధిపత్యము లును, మకరమునకు పంచమ రాజ్యాధిపత్యములును కుంభమునకు చతుర్థ నవమాధిపత్యములును పట్టును. ఆధిపత్యదోషము నిర్ణయిం చుటలో పాపగ్రహములకువలెనే శుభగ్రహములకుకూడా ఉత్తరో త్తరమును బట్టియే నిర్ణయించవలెను. అనగా లగ్నముకంటె చతు ర్థము చతుర్థముకంటె సప్తమము సప్తముకంటెదశమము ఉత్తరో త్తరబలము కలవి. మేషమునకు చంద్రునకును శుక్రునకును కేంద్రాధి పత్యదోషము కలుగును. ఈలగ్నమునకు చంద్రుడు పూర్ణుడైన యెడల 3-6-8-12 స్థానములందుండుట మంచిది. అందు 3-12 స్థానములందెక్కువయోగము. కారణమేమనగా చతుర్థ కేంద్రాధి

పత్యదోషము 7-10 స్థానములకంటె తక్కువగనుక ఆదోషమునకు తగిన పాపరాసులలో నుండినగాని ఆ గ్రహము మంచిరాజయోగము నివ్వడు. 6-8-లు పాపరాసులైనను 3-12 స్థానములకంటె నెక్కువ పాపరాసులు గనుక ఆ గ్రహమునకు కావలసిన దోష పరిహారముకంటె నెక్కువయగును. అందువలన యోగము తగ్గును. ఈకారణమువలన 3-12 స్థానములకంటె చంద్రుడు 6వ స్థానమున తక్కువయోగముచేయును. 8వ స్థానమున అంతకంటెను తక్కువ. తృతీయలాభస్థానమందున్నప్పుడు 3-12 స్థానములకంటె యోగము తగ్గును. 5-9 స్థానములందు యోగమునివ్వడు. 1-4-7-10 స్థానములందుండిన అవయోగము. ఈఅవయోగములోకూడా ఉత్తరోత్తర బలముచే లగ్నముకంటె చతుర్థము చతుర్థముకంటె సప్తమము సప్తమముకంటె దశమము ఎక్కువ అవయోగము. శుక్రుడు నైసర్గిక శుభులలో ముఖ్యతిక శుభుడు గనుక, కేంద్రాధిపత్యదోషము లగ్నచతుర్థముకంటె సప్తమమెక్కువ దోషముగనుకను, మేషమునకు ప్రబల పాపియగును. ఇట్టి శుక్రుడు 6-8-12 స్థానములందుండిన ఎక్కువ రాజయోగము నిచ్చును. తృతీయ ఏకాదశమములందు సామాన్యము. ఇట్టి శుక్రునకు కుజసంబంధము కలిగినయెడల యోగభంగము కలుగును. ఈశుక్రుడు 1-2-4-5-7-9-10 స్థానములందు యోగమునివ్వడు. ఈ శుక్రునకు కేంద్రకోణములందు కుజ సంబంధము మంచిది. ఈయోగము కర్కాటకమైన ఎక్కువ.

పూర్ణశుభుడైన చంద్రుడు మేషలగ్నమునకు కేంద్రకోణములందుండిన యెడల యోగించడని పైన వ్రాసియున్నాను. చంద్రుడొక్కడే యున్నయెడల యోగించడు. ఇతర గ్రహముల కలయికవలన యోగమునిచ్చుచున్నాడు. ఈ చంద్రుడు మేషలగ్నమునకు భాగ్యవ్యయాధిపత్యములు పట్టిన బృహస్పతితో కలిసి లగ్నకేంద్రమందుండిన మంచివాడు. చతుర్థ కేంద్రమున నంతయోగము

నివ్వడు. పంచమ, నవమ, కోణములందు సామాన్యయోగము. 7-10 స్థానములందు యోగమునివ్వడు. 3-10-11 స్థానములందు యోగమునిచ్చును. షష్టాష్టమములంతంత యోగములేదు. ధన సప్తమాధిపత్యములు పట్టిన శుక్రునితో కలిసి కేంద్రకోణములలో నెక్కడనున్నను ఎక్కువ అవయోగముచేయును. పాపస్థానములగు 3-6-8-12 లందు మంచిది. ఏకాదశమందు సామాన్యము. ఈ చంద్రుడు తృతీయ షష్ఠాధిపత్యము పట్టిన బుధునితో కలసి కేంద్రకోణములందుండిన మంచిది. అందు కేంద్రములకన్న కోణములు మంచివి. పాపస్థానములందు మంచిదికాదు. ఈ చంద్రుడు నైసర్గిక అర్థపాపియగు రవితో కలసి కేంద్రకోణములలో నెక్కడనున్నను యోగము నివ్వడు. అందు మేషమున మిక్కిలి అవయోగము. ఇందుకు కారణము రవికి ఉచ్చమంచిదికాదు. ఇచ్చట రవితో కలసినచో అస్తంగత్వదోషము పట్టును గనుక చంద్రుని నైసర్గికపాపిగా నెంచుకొనవలెను. ఇట్టి చంద్రునకు కేంద్రాధిపత్య దోషములేదు. కాని రవి మేషలగ్నముకు కోణాధిపతియై పాపి యగుట గాన వీని సంబంధము చంద్రునకు కూడా మంచిదికాదు. అప్పుడు ఈ రవిచంద్రులు కేంద్రములకంటె కోణస్థితివలన మిక్కిలి అవయోగము చేయుదురు. ఈ రవి చంద్రులు పాపస్థానములందుండిన రవిమాత్రము యోగముచేసి చంద్రుడు అవయోగము చేయును. లేదా సామాన్యముగా నుండును. మేషమునకు లగ్నాష్ట మాధిపత్యములుపట్టి పూర్ణపాపియై నైసర్గికముచేత కూడ ముప్పాతిక పాపియైన కుజునితో చంద్రుడు కలిసి కేంద్రకోణములందుండిన చంద్రకుజులిద్దరును శుభులై యోగమునిచ్చెదరు. పాపస్థానములగు 3-6-8-11-12 లందు యోగము నివ్వరు. ద్వితీయమున సామాన్యము ఈ చంద్రుడు. మేషలగ్నమునకు రాజ్యాధిపత్యములు

పట్టిన శనితో కలసి పాపస్థానములందుండిన శని యోగము నివ్వక చంద్రుడుమాత్రము యోగము చేయును. కేంద్రములందంత యోగ మునివ్వడు. మేషమునందు మాత్రము కొంతమంచిది. కాని శని మాత్రము యోగము చేయును. తులయందు శని బహుసామాన్య ముగా యోగించును. ఈ శని చంద్రులు 2-11 స్థానములందు కల సిన కొంతవరకు మంచియోగము చేయుదురు. చంద్ర కేతువులు 3-6-8-11-12 స్థానములందు యోగము చేయుదురు. అష్టమ మందు కలసిన యోగము నివ్వరు. కేంద్రమందుగాని కోణమందు గాని కలసిన, కేతువుమాత్రము యోగించి చంద్రుడు యోగము నివ్వడు. ద్వితీయమందు సామాన్యము. చంద్రరాహువులు 3-6-8-11-12 స్థానములందు కలసిన వేరువేరు ఫలముల నిచ్చుచున్నారు. అనగా తృతీయమందు కలసిన సామాన్య యోగమునిచ్చును. షష్ఠమమందు కలసిన చంద్రుడు సామాన్యయోగమునిచ్చి రాహువు యోగము నివ్వడు. అష్టమమందుకలసిన రాహువు మాత్రము యోగించి చంద్రుడుమాత్రము యోగించడు. ఏకాదశమందు కల సిన ఇద్దరును యోగించెదరు. ద్వాదశమందు చంద్రుడు మాత్రము యోగించి, రాహువు సామాన్యయోగము నిచ్చును. కేంద్రకోణ ములందెక్కడ కలసినను రాహువు మంచియోగము నిచ్చి చంద్రుడు మాత్రము యోగమునివ్వడు. ఈ లగ్నమునకు శుక్రుడు కూడా ఇట్లే ఇతర గ్రహ సంబంధములవలన కేంద్రాధిపత్య దోషము మారి ఏవిధముగా శుభాశుభ ఫలముల నిచ్చుచున్నాడో తెలిసికొనవలెను.

మేషలగ్నమునకు కేంద్రాధిపత్యముపట్టిన శుక్రుడు కేంద్రాధి పత్యముపట్టిన చంద్రునితో కలసి కేంద్రకోణములలో నెచ్చట నున్నను యోగము నివ్వడు. అవయోగము కూడా చేయును.

3.6-8-11-12 లలో నెక్కడ నున్నను యోగము చేయును. అందు 6-8-12 స్థానములం దెక్కువ యోగము. 2-3-11 లందు సామాన్య యోగము. ఈ శుక్రుడు కోణాధిపత్యము పట్టిన రవితో కలసి ఎక్కడనున్నను రాజయోగమునివ్వడు. పాపస్థానములందుం డీన యోగించును. తృతీయ షష్ఠాధిపత్యములు పట్టిన బుధునితో కలసి కేంద్రకోణములలో నెక్కడనున్నను సామాన్యయోగము. 2-3-6-11-2 స్థానములందు మంచియోగము.

8-వ స్థానమందంత యోగము చెప్పకూడదు. భాగ్యవ్యయాధిపత్యములు పట్టిన గురునితో కలసి కేంద్రకోణములందుండిన సామాన్య యోగము. గురుడు శుక్రునికన్న అధిక యోగము చేయును. కోణములందు కలసినయెడల శుక్రుడు యోగించక గురుడుమాత్రము యోగించును. పాపస్థానములందు కలసిన గురుడు యోగించక శుక్రుడు యోగించును. ద్వితీయ లాభములందు కలసినయెడల గురుశుక్రు లిద్దరును యోగించెదరు. లగ్నాష్టమాధిపత్యములుపట్టిన కుజునితో కలసినప్పుడు కేంద్రకోణములలో నెక్కడనున్నను యోగించును. తులయందు మాత్రము శుక్రుడు యోగించక కుజుడు యోగించును. దశమ కేంద్రమందు కుజునికి ఉచ్చగాన కుజశుక్రులు యిద్దరు యోగించరు. ద్వితీయ లాభములందు శుక్రునికి సామాన్యము. కుజుడు యోగించడు. పాపస్థానములగు 3-6-8-12 లందు కుజుడు యోగించక శుక్రుడు బహుసామాన్యముగా నుండును. ఈశుక్రుడు శనితో కలసినప్పుడు కేంద్రకోణములలోనున్న యెడల శనిమాత్రము యోగించి శుక్రుడు యోగించడు. లాభమందున్న యెడల శని శుక్రు లిద్దరును యోగించెదరు. కేంద్రములయందు కలసిన శనిమాత్రము మంచియోగము నిచ్చును. శుక్రుడు యోగించడు. అందు తులలో శనికూడా అంతమంచియోగము నీయజాలకున్నాడు. పాపస్థానము

లగు 2-6-8-12 లందు శని యోగించక శుక్రుడు యోగించును. ద్వాదశమందున్న శని శుక్రు లిద్దరు మంచివారు. పాపస్థానము లన్నిటిలో ద్వాదశమున మిక్కిలి శుభము. ఏ లగ్నమునకైనను శుక్ర కేతువుల సంబంధము కొంతయోగమును పీఠికమీద తగ్గించును. అందు పాపస్థానములందు గలసిన మిక్కిలి అవయోగము.

వృషభలగ్నమునకు ఒక్క శుక్రునికి మాత్రమే లగ్న కేంద్రాధిపత్యముపట్టును. మరి ఏ ఇతర నైసర్గికశుభగ్రహములకు కేంద్రాధిపత్యదోషము కలుగదు. అట్లే నైసర్గిక పాపులకుకూడా కోణాధిపత్య దోషములేక, కేంద్రాధిపత్య శుభమునూత్రమేకలుగును. ఈ కారణమువలన వృషభలగ్నము ద్వాదశ లగ్నములలోను అత్యంత శుభలగ్నముగా పరిగణింపబడుచున్నది. ఈలగ్నమునకు మంచి రాజయోగములు పట్టుట కవకాశమున్నది. ఈ అభిప్రాయమునే జైమినిమహర్షి సూ॥ నా॥ "వృషభే త్యేన్యేకే" అని చెప్పినాడు. అనగా అన్ని లగ్నములవలెగాక ప్రత్యేకముగా వృషభలగ్నముకు వేరుగా ఫలములు చూడవలెనని చెప్పినాడు. ఈ లగ్నమునకు శుక్రుడు తృతీయమందుండినను, ఇతర కేంద్రములందుండినను, ద్వాదశమందుండినను, యోగించును. ఇందుకు కారణము శుక్రునకు లగ్న కేంద్రాధిపత్యదోషము బహుస్వల్పము. అందుకు సరియైన బలము 3-12 స్థానములందుండినప్పుడు మాత్రమే కలుగును. షష్టాష్టమములు 3-12 ల కంటె పాపత్వమున బలమైనవి. లగ్న కేంద్రాధిపత్యదోషము వీనిపాపత్వమునకు చాలదు. కాబట్టి 6-8 లలో శుక్రుడు యోగించడు. ఇదియే ఈలగ్నమునకు అనుభవములో విశేషముగా కనుపించు ముఖ్యవిషయము. ద్వాదశమునందుకంటె ద్వితీయమందెక్కువ యోగము నిచ్చుచున్నాడు. ఈ శుక్రుడు తృతీయాధిపత్యముపట్టిన చంద్రునితో కలసి కేంద్రకోణములలో

నుండుట మంచిది, కాని లగ్న కేంద్రము అంత మంచిది కాదు. చతుర్థ సప్తమ దశమ కేంద్రములయందు మిక్కిలి శుభమునిచ్చు చున్నాడు. ఈ శుక్ర చంద్రులు కేంద్రములందు రవికుజ శనులతో గలియుట అత్యంత రాజయోగము. ఈ శుక్రుడు 5-9 లలో బహు సామాన్యయోగము నిచ్చును. అందు కన్యకంటె మకరమునం దెక్కువ యోగము. ఈ శుక్రుడు 2-6-8-11 స్థానములందున్న యోగించడు. వీనికి అష్టమ లాభాధిపత్యములు పట్టిన గురుసంబంధము పాపస్థానములందు మరింత అవయోగము. శుక్రుడు లగ్న కేంద్రమునందు గురునితో కలసిన అంతయోగము నివ్వజాలడు. గురుమాత్రము కొంతవరకు యోగము నిచ్చుచున్నాడు. ఈ గురు శుక్రులు ఇతర కేంద్రములగు 4-7-10 స్థానములందు కలి యుట మంచిది. కాని గురుసంబంధమువలన శుక్రుడు తక్కువ యోగమునిచ్చును. ఈ శుక్ర గురుల రవి శని కుజులసంబంధము అత్యంత శుభము. శుక్రుడు ద్వితీయమున గురునితో కలసిన యోగించడు. ఈ ద్వితీయమున బుధ శుక్రులు కలసినయెడల శుక్రుడు యోగించక బుధుడు కొంతవరకు యోగించును. శుక్రుడు చంద్రుడు ద్వితీయమున కలసిన అంతయోగము చెప్పకూడదు. ఏకాదశమం దు ఈ శుక్రుడు నైసర్గిక శుభులతోగాని పాపులతోగాని కలిసిన ఆయుర్దాయము నిచ్చును. చంద్ర గురులు ఏకాదశమున కలసినను ఆయుర్దాయమునకు మంచిది. యోగమునివ్వరు. ఈ శుక్రుడు నైస ర్గిక పాపులగు రవి, కుజ, శని, రాహు, కేతువులలో నెవరితో కల సినను పాపస్థానములగు 2-3-6-8-11 లందెక్కడ నున్నను రాజ యోగ భంగమగును. ఈ శుక్రునకు పాపస్థానములందు అత్యంత అవయోగము. అవి తులయైనయెడల ఇంకను హెచ్చు. ఈ శుక్రుడు అష్టమమందు నైసర్గిక పాపులతో కలసిన యోగించడు. వారిలో

రవికంటె శని కుజ కేతువుల సంబంధము మరింత ఎక్కువ అవయోగము. ఈ లగ్నమునకు శని అష్టమమందుండిన మంచివాడు. శుక్ర చంద్రులుగాని, అష్టమమందు కలసినయెడల అవయోగము.

మిథున లగ్నమునకు గురుబుధులకు మాత్రము ఉభయ కేంద్రాధిపత్యములు వచ్చును. ఇరువురు ఆధిపత్యములవలన పాపులగుదురు. బుధునకు 1-4 కేంద్రములకు ఆధిపత్యము వచ్చును. గురునకు 7-10 స్థానములకు ఆధిపత్యమువచ్చును. బుధునకు నైసర్గికశుభము గురుని కంటె చాల తక్కువ. కాబట్టి ఉత్తరోత్తర ప్రకారము కేంద్రాధిపత్యదోషము బుధునికంటె గురునికెక్కువ. ఈ దోషము నైసర్గికము చేతను ఉత్తరోత్తరముచేతనుకూడా బుధునికంటె గురునకు కేంద్రాధిపత్యదోషము అనేకరెట్లు యెక్కువ అని గ్రహించవలెను. సామాన్యముగా పైకి గురు బుధులకు ఉభయకేంద్రాధిపత్యము వలన గలిగిన దోషము సమానముగా నున్నట్లు కనుపించినను వీరిద్దరికిని భేదముకలదు. ఈ భేదముండుటవలన వీరిద్దరకు స్థితి, కలియకల వలన ఎవరికి ఎంతమార్పు కావలెనో, అంతమార్పు కలిగినప్పుడే యోగము నిచ్చెదరు. ఒకప్పుడు ఈ దోషము బలవత్తరమై అవయోగము చేయుదురు. అదెట్లనగా, ఈ గురు బుధులు కలసిగాని విడిగాగాని లగ్నకేంద్రమునందుగాని మరి యే ఇతర కేంద్రములందుగాని ఉన్నయెడల అవయోగమునిచ్చెదరు. అందు లగ్నముకంటె చతుర్థము, చతుర్థముకంటె సప్తమము, సప్తమముకంటె దశమము, అవయోగమునకు బలవత్తరములు. ఇందులో స్వక్షేత్రమందున్న గ్రహము మరింత అవయోగము చేయును. ఈ బుధ గురులు 3-6-8-12 స్థానములందు సుయోగించెదరు. అందు బుధునకు తృతీయము ద్వాదశమము మరింతయోగమునకు మంచిది. గురునకు 6-8 స్థానములందు మిక్కిలిబలము. బుధుడు 8- యందుండిన తక్కువయోగమునిచ్చును. గురుడు 8- దింట

ఎక్కువయోగమునిచ్చును. గురు బుధులిద్దరును ద్వాదశమునందు మంచియోగము నిచ్చెదరు. ఈ గు॥ బుధులు ఏకాదశమందున్నను యోగమునిచ్చుచున్నారు. వీరిద్దరును కలియకుండా ఒకడు 11డింట ఒకడు 12-న ఉండినప్పుడు మరింత ఎక్కువయోగము. ఈ లగ్నమునకు గురునకు అష్టమమునందు నీచవచ్చినను యోగమునిచ్చును. ఈ గురు బుధులిద్దరును ద్వితీయ స్థానమందున్న యెడల స్వల్ప యోగము చెప్పవలయును. ఈ గురు బుధులకు అష్టమమందు కుజ సంబంధము కలిగినయెడల అవయోగము. ఈ బుధుడు లగ్న కేంద్రముననుండినను రవితో కలసినయెడల యోగించును. ఏకాదశ మందున్నను, ఎవ్వరితో కలియక యున్నను, యోగించును.

ఏకాదశమమునందు కుజ బుధులిద్దరు కలసినను యోగించెదరు. ఈ లగ్నమునకు బుధుడు 12- డింట గురుడు 8- దింట ఎవరితోను కలియక యుండినచో మంచి రాజయోగమునిచ్చెదరు. పాపస్థానములగు 3-6-8-12 లందు గురు బుధులుండి తిరిగి ఆపాపస్థానాధిపతులతో కలసినయెడల చాలవరకు యోగముతగ్గును. కేంద్రములందు గురున కీ 3-6-8-12 స్థానాధిపతులలో 6-8 స్థానాధిపతుల సంబంధము వలన యెక్కువయోగము చేయుచున్నాడు. కలసియుండుట కంటె దృష్టియోగసంబంధముతక్కువబలము. అనుభవమునుబట్టి చూడగా గురుడు 8-12 డింట మంచి రాజయోగమునిచ్చుచున్నాడు. బుధుడుకూడా 12-న మంచి రాజయోగమునిచ్చుచున్నాడు. గురుడు కేంద్రములందుండి అవి వానికి స్వక్షేత్రము లైనయెడల 6-8 స్థానాధిపతులలో నెంత ఎక్కువమంది కలసిన అంత రాజయోగమునిచ్చును ఈ కేంద్రము స్వక్షేత్రము కానియెడల ఈ షష్టాష్టమ వ్యయాధిపతులలో నెవరో ఒక్కరుమాత్రమే కలసిన, కేంద్రాధిపత్య దోషముపోయి రాజయోగమునిచ్చును. ఇదేవిధముగా బుధునకు కూడా చూచుకొనవలెను. ఈమిథునలగ్నమునకు బుధుడుగాని

గురుడుగాని 5-9ట గాని వున్నయెడల యోగమునివ్వరు. వీరిద్దరును కలసి కోణములందుండిన అవయోగము మరింత యెక్కువ. వీరు కోణములందు, విడిగాగాని, కలసిగాని వుండి 6-8-12 స్థానాధిపతుల సంబంధముండిన యోగమునిచ్చెదరు. వీరిద్దరు విడిగావున్నప్పుడుకంటె కలసినప్పుడు పాపస్థానాధిపుల సంబంధము హెచ్చుగా నుండుటమంచిది. విడిగా నున్నప్పుడుకూడా కొంత తగ్గినయోగము నిత్తురు. ఈగురు బుధులకు కోణస్థితులలో 5-కంటె 9- ఉత్తరోత్తరముచే నెక్కువ పాపము గనుక పాపస్థానాధిపత్యసంబంధము హెచ్చుగానుండుట చాలమంచిది. అందు బుధునికంటె గురునకు హెచ్చుకావలయును. అప్పుడే మంచిరాజయోగము చెప్పవలెను. వీరికి ద్వితీయలాభస్థితులలో పాపస్థానాధిపతుల సంబంధము కొంతవరకుమాత్రము మంచిది. వీరిలో కలసి పాపస్థానములగు 3-6-8-12 లందున్నప్పుడు ధనలాభాధిపతులు కొంతవరకు యోగముచేసి ధనభావమునుమాత్రము పాడుచేయుదురు. ఒకప్పుడు ఈధనభావము సామాన్యముగా నుండును. ఈగురు బుధులు పాపులతో కలసి పాపస్థానములందుండుట తక్కువయోగము. పాపులతో కలియకయే పాపస్థానములందుండుట యెక్కువయోగము. అప్పుడు పాపగ్రహములు యోగించక కేంద్రాధిపత్యము పట్టిన గురుబుధులుమాత్రము యోగము నిచ్చెదరు. ఈ గురు బుధులు కేంద్రములందుండి 6-8-12 స్థానాధిపతులతో కలసినప్పు డిచ్చు రాజయోగముకంటె వారిద్దరు యే పాపస్థానాధిపతులతో కలియక పాపస్థానము లందుండినప్పుడిచ్చు రాజయోగము మిక్కిలి ఎక్కువ.

కర్కటక లగ్నముకు లగ్నాధిపత్యము పట్టిన చంద్రుడు పూర్ణుడై నయెడల పాపస్థానములందుండుట యోగము. అనగా 3-6-8-11-12 స్థానములందుండుట మంచిది. ద్వితీయమున సామాన్యము. ఈ

పాపస్థానములలో 3-6-12 లు మిక్కిలిమంచివి. ఈచంద్రుడు శుభత్వములో ననేక విధములుగా నుండును. అందువలన శుద్ధపంచమి లోపునను బహుళశుద్ధ దశమి మొదలు 13 లోపునను ఉండి 3-12 స్థానములందున్నప్పుడు యోగించును. ఈ చంద్రుడు బ॥ చతుర్దశి మొదలు శుద్ధ విదియ వరకు కేంద్రాధిదోషము లేదు గాన నైసర్గిక పాపిగా ఎంచుకొనవలెను. ఇట్టి చంద్రుడు పాపస్థానములందు యోగించక కేంద్రకోణములందు మాత్రమే యోగించును. శుద్ధ 8- మొదలు శుద్ధ 5- వరకును, ద్వితీయ తృతీయ ఏకాదశములం దెక్కడనున్నను యోగించును. ఈ లగ్నమునకు గురుడుమష్టభాగ్యాధిపతియును, బుధుడుతృతీయవ్యయాధిపతియును, అగుటచే శుభులుగా నెంచబడుచున్నారు. ఇందుకు కారణము వీరికి కేంద్రాధిపత్యదోషము లేకపోవుటయే. ఈ లగ్నమునకు శుక్రుడు వాహన లాభాధిపతి యగుటచే కేంద్రాధిపత్యదోషము కలవాడగుచున్నాడు. లాభ వ్యయాధిపత్యములు స్వతంత్రాధిపత్యములు కావని సర్వ ఋషిమతము. అనగా ఏ గ్రహమునకైనను రెండాధిపత్యములు వచ్చినప్పుడు అందులో నొకటి లాభాధిపత్యమైన యెడల ఈ లాభాధిపత్యము రెండవ అధిపత్య సంబంధమగు శుభాశుభములకు మరింత బలము. ఈ కారణమువలన 4-కేంద్రాధిపత్య దోషము పట్టిన శుక్రునకు లాభాధిపత్యము వలన ఈ దోషము మరింత ప్రబలమగుచున్నది ఈ శుక్రుడు 3-6-8-11-12 స్థానములందు మంచివాడు. అష్టమమందు మిక్కిలి శుభమునిచ్చును. ద్వాదశమందును కొంతవరకు మంచివాడు. 3-6 స్థానములందు అంత యెక్కువ యోగము చెప్పకూడదు. 2-లో సామాన్యము.

ఈ శుక్రుడు 5-వ కోణమునందుండుట కొంతవరకు మంచిది. వీడు 9-దింట యోగమునివ్వడు. వీనికి శని సంబంధము అవయోగము.

రవిసంబంధము ధనలాభము లందెక్కడనైనను ధనయోగమునకు మంచిది. రవి శుక్రులు కలసి నవమకోణమునందుండినను ధనయోగమునకు మంచిది. ఈలగ్నమునకు రవి బుధ శుక్రులు ముగ్గురును గలియుట వలన పీఠికమీద కొంత యోగము తగ్గును. బుధ శుక్రులు తులకుంభము తక్క ఇతర కేంద్రములలో నెక్కడ కలసియున్నను యోగమిత్తురు. వారికి రవి సంబంధము కొంత యోగమును తగ్గించును. ఈశుక్రునకు పాపస్థానములందు బుధ శని సంబంధము యోగమునకు అంత మంచిదికాదు. ఈలగ్నమునకు గురు బుధులు మాత్రము యోగించిశుక్రుడుమాత్రము సామాన్యముగానుండును. వీరు ముగ్గురు పాపస్థానములోనుండిన గురుబుధులు యోగము నియ్యరు. శుక్రుడుమాత్రము కొంత యోగించును. ఈలగ్నమునకు శుక్ర చంద్రులు (పూర్ణ శుభుడైన చంద్రుడు) అష్టమమందుండుట అత్యంత రాజయోగము. బుధుడు కేంద్రములందుండి రవితో కలియునియెడల పీఠికమీద ఈలగ్నమునకు రాజయోగము చెప్పవలెను. పూర్ణ చంద్ర శుక్రులు ఇతర పాపస్థానములందు కలసినచో రాజయోగము నిచ్చెదరు. వానిలో ద్వాదశమము మరింతమంచిది. పూర్ణశుభుడగు చంద్ర సంబంధమువలన గురుబుధులు యోగమిచ్చుచున్నారు. కాని చంద్రుడు మాత్రము వారి సంబంధము వలన సామాన్యముగా యోగించును. పూర్ణ చంద్రుడు గురుబుధులతో కలసి పాపస్థానములందుండిన గురుబుధులు యోగముచేయక చంద్రుడుమాత్రము యోగించును. ఇచ్చట రవిసంబంధము మంచిదికాదు. వారిరువు రేగాక రవిగూడ యోగముచేయడు. ఈగురు బుధులతో కేంద్రములందు వానిలో ముఖ్యముగా మేషమున రవి కలియుటఅత్యంత రాజయోగము. ఈరవిబుధగురులకుచంద్రసంబంధమువలన యోగభంగముకాదు. గురు బుధులకు కేంద్రములందు

శని సంబంధము సామాన్యయోగము. శని చంద్రులు పాపస్థానము లందుండినచో శని యోగించక చంద్రుడు మాత్రము సామాన్య యోగమునిచ్చును. శని చంద్రులు కేంద్రములందు కలసినప్పుడు అనగా కర్కాటకమున మంచియోగమును, తుల మకరములందు సామాన్యయోగమును, మేషమునందు అధిక యోగమును, ఇచ్చుచున్నారు. వీరికి అట్టి స్థానములందు కుజసంబంధము మరింత మంచిది. రవితో కలియని గురు బుధుల సంబంధముకూడా చాల మంచిది. ఈలగ్నమునకు చంద్ర కుజులు కేంద్రములందు కలయుట మంచిది. కర్కాటమున సామాన్యము. తులయందెక్కువయోగము మకరమున యోగములేదు. అవయోగమునుగూడ చెప్పవలెను. వీరికి పాపస్థితి మంచిదికాదు. చంద్రుడు మాత్రము కొంతవరకు యోగము చేయును. వీరికి శని సంబంధము అవయోగము. శని కుజ చంద్రులు మకరమున కలసినచో కుజసంబంధమువలన శని చంద్రులుకూడ యోగమునివ్వరు. ఈ లగ్నమునకు రవి శని కుజులు పాపస్థానములందు విడిగాగాని కలిసిగాని వుండుట మంచిదికాదు. కోణములందు అత్యంత అవయోగమునిత్తురు. రవి ఒక్కడేవున్నచో కొంతవరకు యోగించును. ఈలగ్నమునకు రవికుజులు కేంద్రములందు (మేష మకరములందు తక్క) వున్నచో మంచిది. వీరు కేంద్రములందు శనితో కలసి యుండుట మంచిది. అప్పుడు వీరికి నైసర్గిక శుభులగు గురు బుధుల సంబంధము మంచిది. రవి కుజ శనులు విడిగాగాని, కలసిగాని, పాపస్థానము లందుండుటయున్నా, శని తులయందు కుజుడు మకరమందు రవి మేషమందు వుండుట యున్నా, అవయోగము, వీరికి యితర కేంద్రస్థితులు మంచివి.

ఈ ముగ్గురకు ఒకేజాతకమున ఉచ్చపట్టినయెడల ఆ జాతకునకు రాజయోగము పట్టుట దుర్లభము. ఇతర గ్రహములెంత

బాగున్నను యోగము పట్టను. రవి గురులుగాని, రవి, గురు, కుజులుగాని కలసి లాభములందుండుట ధనయోగమునకు మిక్కిలి మంచిది. ధనస్థానమునకంటె ఏకాదశమున కలియుటవలన ధన యోగమే కాక ఆయుర్లాభముకూడా కలుగును. వీనికి బుధశుక్రుల సంబంధమువలన ధనయోగము కొంతవరకు తగ్గును. ఒక్క శుక్ర సంబంధము ధనయోగమునకు మంచిది. లగ్నాధిపత్యము పట్టిన చంద్రుడు ద్వితీయమున సామాన్య యోగమునిచ్చును. కాని లాభ స్థానమందు ఆయుర్దాయ విషయమున మిక్కిలి మంచివాడు.

సింహలగ్నము మంచిలగ్నములలో నొకటి. దీనికి సహజముగా కొంత శుభముకలదు. దీనికి లగ్నాధిపత్యము శనికి సప్తమాధి పత్యము కుజునకు వాహనాధిపత్యము వచ్చుటయు నైసర్గిక శుభు లలో నొక్క శుక్రునికి తప్ప ఇతర చంద్ర బుధ గురులకు కేంద్రాధి పత్యదోషము లేకపోవుటయే దాని శుభత్వమునకు కారణము.

ఈ లగ్నమునకు పూర్ణచంద్ర గురుబుధులు కేంద్రకోణము లలో నెక్కడనున్నను రాజయోగమునిచ్చెదరు. వీరందరు కలసి గాని, విడివిడిగాగాని, వీరిలో కొందరుమాత్రమే కలసిగాని యున్న యెడల రాజయోగము చెప్పవలెను. వీరు పైవిధముగా విడివిడిగా గాని కలసిగాని పాపస్థానములందుండుట అశుభము. కాని గురుడు మాత్రము ఎవ్వరితో కలియక అష్టమ ద్వాదశము లందుండి నచో అవయోగము నివ్వక శుభమునే చేయును. వీడు భావ సంబం ధమయిన అవయోగము అనగా శరీర అనారోగ్యము, పితృమార కము మొదలగునవి చేయవచ్చును గాని యోగభంగముచేయక యోగము నిచ్చును, శుక్రునకు మాత్రము ఈ విధముగా చెప్ప కూడదు. ఈ శుక్రుడు ఎంత అధిక పాపస్థానమున నుండిన అంత యోగము నిచ్చువాడగును. ఈ శుక్రుడు అష్టమ ద్వాదశమము

లందుండిన యోగ విషయమున మంచివాడై నను కళత్ర విషయమున జబ్బువాడగును. ఈ శుక్రుడు కేంద్రకోణములలో నెక్కడ నున్నను యోగమునివ్వడు. అందు దశమ కేంద్రమున అత్యంత అవయోగము. పాపస్థానమయినను 3 డింట యోగమునివ్వడు. వానికి షష్ఠాష్టమ వ్యయాధిపతుల సంబంధము కేంద్రకోణములందు మంచిది. ఈ లగ్నమునకు గొప్ప విశేషమేమనగా నైసర్గిక పాపులగు రవి, కుజ, శనులకు, వారివారి నైసర్గిక పాపత్వములకు సరిపడు బలముకల కేంద్రాధిపత్య శుభత్వము కలుగుటయే. (అనగా అర్థపాపియగు రవికి లగ్న కేంద్రాధిపత్యము, ముప్పాతిక పాపియగు కుజునకు చతుర్థ కేంద్రాధిపత్యము, పూర్ణపాపియగు శనికి సప్తమ కేంద్రాధిపత్యము వచ్చును.) ఇట్టి రవి కుజ శనులు పూర్ణచంద్ర గురు బుధులతో కలసి కేంద్రములందుండుట అత్యంత రాజయోగము. ఈ కేంద్రములందు నైసర్గిక పాపులకు స్వక్షేత్రములయినయెడల మరింత రాజయోగము. రవి శనులు సింహమందుండి కుజుడు కుంభమందుండుట కూడ మంచి యోగము. ఈలగ్నమునకు శుభగ్రహములుకాని పాపగ్రహములుగాని ద్వితీయమందుండిన సామాన్యయోగము.

కన్యాలగ్నమునకు సహజముగ గ్రహములు ఎంతో బాగుపడినగాని యోగము చెయ్యరు. ఈలగ్నమునకు ఆధిపత్యముచేత గురుబుధులు కేంద్రాధిపతులై పాపులగుదురు. రవి కుజులు కేవలము పాపాధిపతులగుదురు. శనికి పంచమకోణాధిపత్యము కల్గును. ఇది కాక షష్ఠాధిపతికూడనగును. రవి కుజ శనులు 3-6-8-12 స్థానాధిపతులై, గురు బుధులు ఉభయ కేంద్రాధిపత్యదోషు లగుటచేత శుక్ర చంద్రులు తప్ప అన్ని గ్రహములును ఆధిపత్యముచేత అశుభులగుదురు. ఈ కారణమువలన నీ లగ్నమునకు గురుబుధులు పాపస్థానములందుండి మంచి రాజయోగము నిచ్చెదరు. నైసర్గిక పాపులు కేంద్రములందు యోగము నిచ్చెదరు. బుధుడు అష్టమ

మందుకంటె యితర పాపస్థానములందు ఎక్కువయోగమునిచ్చును గురుడు తృతీయమునకంటె ఇతర పాపస్థానములలో నెక్కడ నున్నను మంచియోగము. ఈబుధునకు రవి సంబంధము లేకుం డుట చాల మంచిది. ఈలగ్నమునకు లగ్న కేంద్రమునందు గురుడు చంద్రునితో కలసియు రవితో కలియని బుధుడు పాపస్థానములం దుండియు, శుక్రుడు కేంద్రకోణములలో నెక్కడయున్నను అత్యంత రాజయోగము. గురుబుధులు రవితో కలియక సప్తమ కేంద్రమం దుండినచో యోగము నిత్తురు. పాపస్థానాధిపతులతో కలియని బుధగురులు కేంద్రకోణములలో నెక్కడనున్నను అవయోగము. కేం[illegible]ములలో మరింత అవయోగము. ఆ కేంద్రములు స్వక్షేత్రము [illegible] మిక్కిలి అవయోగము. ఈలగ్నమునకు శుక్రచంద్రులు కేంద్రకోణములలో నెక్కడనున్నను మంచియోగము నిచ్చెదరు. అందు కోణములందుండిన ధనయోగమునకు ఎక్కువమంచిది. ద్వితీయమందు కలసినను ఈయోగము అధికమైనదని చెప్పవలెను. కోణములలో పంచమమందుకంటె నవమమందెక్కువ. ఈలగ్నము నకు, శుక్రుడుగాని, రాహువుగాని, ద్వాదశమందుండినను యోగము నిచ్చెదరు. రవి శుక్రుల పరివర్తనముగూడ యోగమునిచ్చును. ఇవియే ఈ లగ్నమునకుగల విశేష విషయములు. ఈలగ్నమునకు శుక్ర చంద్రులు యోగమునివ్వరు. కేంద్రములలోగూడ వీరిరువురు గురుబుధులతో కలసినయెడల యోగమునివ్వరు. లాభాధిపత్యము పట్టిన చంద్రుడు శనితోకలసి పాపస్థానములందుండిన అవయో గము. ఈశని కోణములందుయోగించడు. మకరము కోణమైనచో మరింత అవయోగము. వీనికి రవిసంబంధము అవయోగ ప్రదమగును. రవి, శని, కుజులు నవమకోణమున కలసిన యోగమునివ్వరు. ముఖ్యముగా ధనయోగమును పాడుచేయుదురు. ఈలగ్నమునకు గురుడు ఏకాదశమందు ఉచ్ఛస్థుడై యున్నను యోగభంగము

కలుగును. అతను లగ్న కేంద్రమున శుక్ర చంద్రులతో కలసియున్న యెడల యోగము నిచ్చును. నైసర్గిక పాపులగు రవికుజులు పాప స్థానములందుండుటకంటె కేంద్రకోణములందుండుట మంచిది. ఇతర పాపస్థానములందుకంటె శని, కుజులు ద్వాదశమందుండిన మంచి వారగుదురు.

తులాలగ్నమునకు ఒక శుక్రునికి తప్ప ఇతర నైసర్గిక శుభులకు కేంద్రాధిపత్యదోషము లేదు. ఇట్లే రవి, కుజులకు కోణాధిపత్య దోషము లేదు. శనికిమాత్రము కోణాధిపత్యదోషముకలదు. ఈ లగ్నమునకు గురుబుధులు బలవంతులై కేంద్రములందు మంచి రాజయోగము నిచ్చెదరు. ఇచ్చటగురునకు ఉచ్చనీచలతో నిమిత్తము లేదు. గురుబుధులు పాపస్థానములందుయోగమునివ్వరు. వీరికికోణస్థి తులుకూడ మంచివి. ఏకాదశస్థితి సామాన్యము గురుడు ఒక్కడే ద్వితీయమునందుండుట మంచిది. వీరికిరవి కుజుల సంబంధము కేం ద్రకోణములందు మంచిది. ఈలగ్నమునకు కేంద్రకోణములందుండు పాపులు, శుభులుకూడా యోగము సేకాక ఆయుర్దాయమునుగూడ నిచ్చెదరు. ఈలగ్నమునకు శుక్రుడులగ్న కేంద్రమునకు యోగమునివ్వ డు. ద్వితీయ పంచమములయందు సామాన్యయోగము. ఇతర కేం ద్రములయందు మంచి రాజయోగమునిచ్చును. ఈలగ్నమునకు కేం ద్రాధిపత్యదోషము శుక్రునికన్న చంద్రునకెక్కువ. ఈశుక్రునకు లగ్న అష్టమాధిపత్యముపట్టునుగాన కేంద్రాధిపత్యదోషము బహు స్వల్పము. ఈలగ్నమునకు చంద్రుడు కేవలపాపస్థానము లందుండిన గాని యోగమునివ్వడు. కోణములందు కేంద్రములందు యోగము నివ్వడు. తులా లగ్నమునకు శుక్రుడు ద్వాదశమందు నీచనుపొంది యున్నను యోగమునిచ్చును. ద్వాదశమందుండిన మంచియోగము. వీనికి కేతుసంబంధము మరింత మంచిది.

వృశ్చికలగ్నముకూడ వృషభ, సింహ, కుంభలగ్నములవలెనే యోగవిషయమున చాల మంచిది. ద్వాదశ లగ్నములలో శ్రేష్ఠత విషయమున మొదట వృషభలగ్నమును, తరువాత సింహము, వృశ్చికము, కుంభము, వరుసగా వచ్చును. ఈలగ్నమునకు ఆధిపత్యములచేత యోగముచేయుటకు ఎక్కువ అవకాశము కలదు. వృశ్చికమునకు ఒక శుక్రునికితప్ప ఇతర నైసర్గిక శుభులకు కేంద్రాధిపత్యదోషము కలుగదు. పాపులు కేంద్రాధిపత్య శుభులగుదురు. శుక్రుడీ లగ్నమునకు అత్యంతపాపి. వీడు కేంద్రకోణములలో నెచ్చటనైనను యోగమునివ్వడు. వీనికి ఈ కేంద్రకోణములందు బుధసంబంధమువలన కొంతయోగము కల్గును. బుధుడు మంచియోగము నిచ్చును. శుక్రుడు ద్వాదశమందుతప్ప ఇతర పాపస్థానములందెక్కడనున్నను. మంచియోగమునిచ్చును. వీనికి కేతుసంబంధము పాపస్థానములందు అత్యంత అవయోగము. ఒకప్పుడు ఇతర గ్రహయోగములకుకూడా యోగభంగముచేయును. ఈశుక్రుడునైసర్గిక పాపులతో కలసి పాపస్థానములలో నెక్కడనున్నను ఒక శుక్రుడుతప్పఇతర గ్రహములెవ్వరును యోగమునివ్వరు. కేంద్రకోణములందుకూడా ఇతర గ్రహములు ఈ శుక్రునితో కలియకుండుట మంచిది. ఈ లగ్నమునకు గురుకేతువులు ద్వితీయమందుండుటవలన మంచి ధనయోగము.

ధనుర్మీన లగ్నములకు :-ఈ రెండు లగ్నములకు మిధున కన్యా లగ్నములకువలె గురుబుధుల కుభయ కేంద్రాధిపత్యము కలుగును. ఈ కేంద్రాధిపత్యదోషము నాలుగు రకములు. ...సహాదాదుల

రు కుంభ నవాంశ

1. లగ్న పాతాళాధిపత్యము. అను చెప్పుదురు.
2. లగ్న రాజ్యాధిపత్యము,

3. వాహన సప్తమాధిపత్యము.

4 సప్తమ రాజ్యాధిపత్యము.

మొదటిదానికంటె మూడవది యెక్కువబలము. అంతకంటె 2-4 లు మరింత యెక్కువ. ఇట్టి కేంద్రాధిపత్యము పట్టిన గురు బుధులు పాపస్థానములందుండుట అత్యంత శుభము. వీరు కేంద్రము లందుపాపస్థానాధి పతులతో కలియుట కొంతవరకురాజయోగము. వీరు పాపస్థానాధిపతులతో కలియక, కేంద్రకోణములలో నెక్కడ నున్నను మిక్కిలి అవయోగము. యోగభంగము చేయుదురు. ధనుర్మీనములకు కూడ భాగ్యరాజ్యాధిపతులు కేంద్రకోణములం దెక్కడ కలసినను అవయోగము. వీరు ఎంతపాపులైన అంతయోగము. వీరు 6-8 లలో కలియుట మంచిది. ధనుర్లగ్నమునకు భాగ్యరాజ్యాధిపతులైన రవి, బుధులు భాగ్యరాజ్యములందెక్కడ కలసినను కొంతయోగము తగ్గిపోవును. వీరు విడిపోయి చెడిపోవుట మంచిది. ఈరవిబుధులకు కేంద్రకోణములందు పంచమాధిపత్యము పట్టిన కుజుడు కలసినయెడల మరింత అవయోగము. ఇవి వీరికి స్వక్షేత్రములుగాని, పరివర్తనముగాని, కాకూడదు. ఇట్లే మీన లగ్నమునకుకూడా చూచుకొనవలెను. ధనుర్లగ్నమునకు గురుడు అష్టమ ద్వాదశమము లందున్నప్పుడు మంచి రాజయోగము నిచ్చును. షష్ఠమందుండిన ఇంతకన్నను హెచ్చు యోగమునిచ్చుచున్నాడు. కొందరు కేంద్రాధిపత్యము నైసర్గిక శుభులకు మారకత్వస్వ కే కాని, యోగవిషయమున కాదని చెప్పుచున్నారు. కాని గాని యోగమయని చకు వ్యతిరిక్తము. వీరు ఒకప్పుడు మారకము నివ్వడు. తులా లగ్న మము వీరికి ఇతరమారకత్వలక్షణములు కలుయున్నను యోగము చాధిపత్యదోషమువలనగాదు. ధనుర్లగ్నము పీఁసికి కేతుసంబంధము గ్నమందుండిన యోగముచేయుచున్నారు.

మకరలగ్నమునకు శుక్రచంద్రులకు కేంద్రాధిపత్యదోషములు కలుగును. ఈచంద్రుడు పూర్ణుడైనయెడల షష్ఠాష్టమ వ్యయముల యందు యోగమిచ్చుచున్నాడు. ఈచంద్రుడు పూర్ణుడు కానప్పుడు ద్వితీయ తృతీయములందు యోగమునిచ్చును. ద్వితీయ, ఏకాదశములకంటె తృతీయమందెక్కువ యోగము. ఈచంద్రుడు గురుబుధులలో నొకరితోగాని యిద్దరితోగాని కర్కాటకమునందు తప్ప ఇతర కేంద్రకోణములలో నెక్కడనున్నను యోగమునిచ్చును. ఈ చంద్రుడు శుక్రునితో కలిసి కేంద్రకోణములలో నెక్కడనున్నను అవయోగము. ఈ లగ్నమునకు శుక్రునకు కేవల కేంద్రాధిపత్య దోషమేగాక కోణాధిపత్య శుభముకూడాకలదు. ఇట్టి శుక్రుడు పంచమ కోణమందు యోగమునిచ్చుచున్నాడు. నవమ కోణమందు గాని ఇతర కేంద్రములందుగాని యోగించడు. 3-6-8-12 స్థానములందు మంచివాడు. అందు అష్టమమున నెక్కువ మంచివాడు. ద్వితీయ ఏకాదశములందు స్వల్పయోగమునిచ్చును. ఈ శుక్రుడు నైసర్గిక పాపులగు కుజశనులతో కలియక పాపస్థానములందుండుట మంచిది. అట్లు కలిసినయెడల శనికుజులు యోగమివ్వక శుక్రుడు మాత్రము యోగమునిచ్చును ఈలగ్నమునకు కుజ, రాహువులు గాని, శుక్ర కుజరాహువులుగాని, అష్టమమందున్నయెడల కుజసంబంధమువలన శుక్ర రాహువులిద్దరును మంచియోగము నిచ్చువారగుదురు. ఈయోగము భీమకవిగారుగూడ జ్యోతిషామృతసారములో వ్రాసియున్నారు. ఇది అనుభవములో సరిగానున్నది.

కుంభలగ్న విషయములో నొక ముఖ్యాంశముకలదు. ఈ లగ్నము ద్వాదశ లగ్నములలో అధమమని వరాహమిహిరాదుల మతము. ఇందున మతభేదములు కలవు. కొందరు కుంభ నవాంశమనియును, కొందరు కుంభద్వాదశాంశమనియును చెప్పుదురు.

కుంభ లగ్న జాతకము

శ్లో॥ న కుంభలగ్నం శుభమాహ సత్యో నభాగభేదాద్యవనా వదంతి
కస్యాంశభేదేన తథాస్తి రాశే రతిప్రసంగ స్త్వితి విష్ణుగుప్తః॥

ఈ ప్రకారము సత్యాచార్యులు కుంభలగ్నమే మంచిది కాదని చెప్పుచున్నారు.

శ్లో॥ జన్మని చంద్రశ్చైత్రిష్టః ప్రవదేద్ద్రోహారిసధనవర్జ్యస్స్యాత్
హేలారాచ భవేదిష్టా ద్విపదేష్వేహా కుంభవర్జ్యంహి
కుంభవిలగ్నే జాతో భవతి నరో దుఃఖ శోక సంతప్తః

అని సత్యాచార్యవాక్యము. యవనాచార్యుడు కుంభనవాంశ అశుభమని చెప్పినాడు. అనగా ఏలగ్నమున పుట్టినను కుంభ నవాంశమున పుట్టినయెడల అశుభమని యభిప్రాయము.

ఈయభిప్రాయమునే బలపరచుచు శ్రుతకీర్తి ఇట్లు చెప్పినాడు.

శ్లో॥ పరస్మిన్ లగ్నగతే కుంభద్వాదశాంశకోయదాభవతి॥
రాశౌ నతదాసుఖితః పరాన్నభోజీ పురుషః॥

అని చెప్పినాడు. ఈ అభిప్రాయమును విష్ణుగుప్తుడు అనగా చాణుక్యుడు అంగీకరించియుండలేదు. కుంభనవాంశ ద్వాదశాంశ ములందు జననము అశుభమని చెప్పుట అతిప్రసంగమని చెప్పినాడు. ఇందుకు

శ్లో॥ కుంభద్వాదశ భాగోలగ్నగతోన ప్రశస్య తేయవనైః
యద్యేవం సర్వేషాం లగ్నగతానా మిష్టఫలం నస్యాత్॥
ఘటయోగాద్రాశీనాం నహ్యేతశ్చాత్ర కారాణాం
తస్మాత్కుంభ విలగ్నం జన్మన్యశుభం నతద్భాగః॥

అని చెప్పినాడు కుంభలగ్నము అశుభమని చెప్పుటలో, కారణము కాన్పించదు. సత్యాచార్యుడు మొదలగువారుకూడా కుంభ

లగ్నమును మంచిదిగా కాదని చెప్పుటకు ఆధారము లేకయే అనేకాభిప్రాయములు పొందెను. జైమిని మహర్షి ప్రకారము కుంభలగ్నము కూడా మంచిలగ్నముగాను భావింపబడెను. ఈ యభిప్రాయము అనుభవములో సరిగానున్నది. ఈలగ్నమునకు శుక్రునకుమాత్రము కేంద్రాధిపత్యదోషము పట్టును. ఈశుక్రుడు భాగ్యాధిపతి అగుట చేత భాగ్యకోణమందు కొంత యోగము నిచ్చుచున్నాడు. ఈ శుక్రుడు భాగ్యమందుండుట ధనయోగమునకును చాలా మంచిది. వీనికి గురుసంబంధము, పై యోగమునకు మంచిది. ఈ శుక్రుడు పంచమమందును, ఇతర కేంద్రములందును యోగమునివ్వడు. వీడు పాపస్థానములందున్న యెడల యోగమునకు మంచిది. ధనయోగమునకు మంచిది కాదు. వీనికి కేంద్రములందు చంద్రబుధుల సంబంధము యోగమునకు మంచిది. ఈలగ్నమునకు నైసర్గికపాపులగు, రవి, కుజ, శనులు ఎవరితోను కలియక కేంద్రకోణములందెక్కడనున్నను రాజయోగము. వీరికి చంద్ర బుధుల సంబంధమువలన కొంత యోగము తగ్గును. శుక్రసంబంధమువలన శుక్రుడు యోగము నివ్వక పాపగ్రహములు మాత్రము యోగము నిచ్చెదరు. వీరికి గురుసంబంధము కేంద్రకోణములందుమంచిది. పాపస్థానములందైన యెడల అందరును అవయోగము నిచ్చెదరు. ఈలగ్నమునకు ధనలాభాధిపత్యము పట్టిన గురుడు ఏకాదశమందుకంటె ద్వితీయమున మంచివాడు. ఈ లగ్నమునకు రవి, శని, బుధులు కలిసినయెడల కొంతవరకు యోగభంగము కలుగును. శని ఈ లగ్నమునకు ద్విద్వాదశములలో నెక్కడనున్నను యోగమునిచ్చుచున్నాడు.

పారాశర్యమతమునను, వరహామిహిరాదుల మతమునను గూడ జాతకాంశమునకు అవస్థలు, చేష్టలు, సమయములు చెప్పినారు. వీటివలన యోగనిర్ణయము చేయుటవలన ఫలితములు సరిగానుండుట

లేదు. వీనియుపయోగము ఏమియు లేదని అనుభవమువలన తెలియు చున్నది. వీనికంటె కాళిదాసు చెప్పినప్రకారము ప్రతిగ్రహము నకును; బాలత్వ, వృద్ధత్వ, క్షీణత్వ అస్తంగత్వములను చూచు కొనుట ఆవశ్యకమని తెలుచున్నది. ఇందుకు కాళిదాసు శ్లో॥ ''బాలోవృద్ధఖగస్థ కోపి పశ్యన్న పశ్యతి'' అని చెప్పియున్నాడు. ఏగ్రహమైనను సూర్యుని తేజస్సులోబడి బలహీనమగుట అస్తంగ త్వము. దీనినే గ్రహమౌఢ్యమని పిలుచుచున్నారు. అస్తంగత్వము నకు ముందు 3-రోజులు వృద్ధావస్థ అస్తంగత్వమునుండి బయల్వ పడిన తరువాత 3- రోజులు బాల్యావస్థ చంద్రుడు బహుళ 1 మొదలు 14 వరకు క్షీణుడును బహుళ 14 మొదలు శుద్ధ విదియ ఘు॥ 30 ల వరకు అస్తంగతుడును, అప్పటినుంచి శుద్ధ 5-వరకు బాలుడుగాను ఎంచబడుచున్నాడు. కాళిదాసు ''పశ్యన్న పశ్యతి'' అని చెప్పుటలో వీరు చూచుచున్నను చూడనివారిలోనే లెక్క అగుచున్నారు. అనగా బలహీనులని అర్థము. కాని ఈ కాళిదాసు (మూఢస్థోపి భృగుర్బలవాన్) మౌఢ్యమందున్నను శుక్రుడు బలవం తుడని చెప్పుటలో పైనిచెప్పినప్రకారం బాలత్వ, వృద్ధత్వ, అస్తంగ త్వములు శుక్రునికి వర్తించవని తెలియుచున్నది.

## —* ద్వితీయ వ్యయాధిపతుల బలనిర్ణయము *—

శ్లో॥ లగ్నాద్వ్యయద్వితీయేశౌ పరేషాం సాహచర్యతః
స్థానాంతరాను గుణ్యేనభవతః ఫలదాయకౌ''

ద్వితీయ వ్యయాధిపతులు ఇతర గ్రహముల కలయిక వలనను, వారుండుస్థానానుగుణ్యముగను ఫలితములనిచ్చుచున్నారని భావము

ఇచ్చట గ్రంథకర్త ధన వ్యయాధిపతులు స్వతంత్రులు కారనియును, ఛాయాగ్రహముల వలెనే ఇతర గ్రహముల కలయిక వలనను, ఇతర రాశి స్థితులవలనను, యోగావయోగముల నిచ్చుచున్నారనియు సూచించియున్నారు. ఈఅభిప్రాయము కాళిదాసాదులకు వ్యతిరిక్తము. ఉత్తర కాలామృతమున ద్వితీయము మిశ్ర రాశిగా చెప్పబడినది. అనగా ద్వితీయాధిపతి మిశ్రఫలితమిచ్చునని అర్థము.

మిశ్రఫలమనగా కొంత తృతీయాధిపతి ఫలమును కొంత లగ్నాధిపతి ఫలమును అని గ్రహించవలెను. కాబట్టి ద్వితీయ ద్వాదశాధిపతులు అస్వతంత్రులనుటకంటె లాభ వ్యయాధిపతు లస్వతంత్రులనుట సమంజసము. అనుభవమునకు సరిపోవును. ఈ అభిప్రాయము సర్వఋషి సమ్మతము.

లాభాధిపతికి, వ్యయాధిపతికి రెండవ ఆధిపత్యము వచ్చినప్పుడు ఆ రెండవ ఆధిపత్యసంబంధమగు శుభాశుభములను మాత్రమే వారు ఇచ్చెదరు. ఈకారణమువలన తులా లగ్నమునకు భాగ్యవ్యయాధిపత్యము పట్టిన బుధునకు వ్యయాధిపత్యము లేదని చెప్పిరి. అట్లే మేష లగ్నమునకు భాగ్య వ్యయాధిపత్యము పట్టిన గురునకు వ్యయాధిపత్య దోషము లేదు. మిథునలగ్నమునకు పంచమ వ్యయాధిపత్యము కలిగిన శుక్రునకు వ్యయాధిపత్య దోషము లేదు. ఇదేవిధముగ మేషలగ్నమునకు రాజ్యలాభాధిపత్యము పట్టిన శని లాభమందున్నను యోగము నిచ్చుచున్నాడు. రాజ్యమందున్నను యోగమునిచ్చుచున్నాడు. అట్లే మిథునలగ్నమునకు షష్ఠలాభాధిపత్యముపట్టిన కుజుడు కేంద్రాధిపతులతో కలసి లాభమందుండెనేని వారిసంబంధముచేత యోగమునిచ్చుచున్నాడు. మకరలగ్నమునకు వాహన లాభాధిపత్యము పట్టిన కుజుడు కేంద్రకోణములందు నుండి రాజయోగము నిచ్చుచున్నాడు.

ద్వితీయము మిశ్రితాశ్రితమని చెప్పుటలో పైన చెప్పిన లాభ వ్యయాధిపత్యములవలె ద్వితీయాధిపతి అస్వతంత్రుడని చెప్పుట కాదు. మిశ్రఫలమనగా పైన చెప్పిన ప్రకారము ఆ రాసికి వెనుక ముందు రాసుల బలము కలిగి ద్విస్వభావము కలదగునని అర్థము. ద్వితీయమునకు పూర్వోత్తరముగు రాసులు లగ్నమును తృతీయమును, అందుచేత ద్వితీయాధిపతికి యోగవిషయమున తనకున్న ధనస్థాన లక్షణములనేగాక లగ్నాధిపత్య తృతీయాధిపత్య లక్షణములుగూడ కలిగియుండును. ద్వితీయాధిపతియొక్క యోగమును నిర్ణయించునప్పుడు వానికి లగ్నాధిపత్యసంబంధమగు లక్షణములను తృతీయాధిపతి లక్షణములనుగూడ మనస్సులో బెట్టుకొని యోగావయోగములను నిర్ణయించుకొనవలెను. ఇక లగ్నాధిపత్యసంబంధమగు లక్షణము లేవియన కేంద్రాధిపత్యదోషము శుభులకు అని, కేంద్రాధిపత్యశుభము పాపగ్రహములకు అని గ్రహించవలెను. ఇచ్చట కేంద్రాధిపత్యము మాత్రమే లగ్నమునకు తీసికొనవలెను. లగ్నములో కోణాధిపత్యముగూడ కలదు. కాని ఆ లక్షణములు మనకవసరము లేదు. ఇది సాంప్రదాయము.

మేషలగ్నమునకు ధనసప్తమాధిపత్యముపట్టిన శుక్రుడు కేంద్రాధిపత్యసంబంధమగు లగ్నాధిపత్య దోషముకలిగి సప్తమాధిపత్య సంబంధమగు కేంద్రాధిపత్య దోషమును ప్రబలము చేయుచున్నాడు.

ఇచ్చట శుక్రునికి ఉభయ కేంద్రాధిపత్యముపట్టిన గురుబుధులకువలె యోగము నిర్ణయించవలెను. మేషలగ్నమునకు శుక్రుడు స్వక్షేత్రమగు తులయందుండిన మరింత అవయోగము. ద్వితీయమందుండినను అంత అవయోగమునిచ్చుటలేదు. ఎందువల్లననగా ద్వితీయమునకు కేంద్రాధిపత్య సంబంధమగు దోషముకలదు. గాన అచ్చట ఉండుటలగ్నమునందుండుట(కేంద్రమునందుండుటవంటిదే)

వంటివాడేగాని యోగమునిచ్చువాడు కాడు. ఈ ద్వితీయాధిపత్యమున్నైసర్గిక పాపులకు వచ్చినప్పుడు కేంద్రాధిపత్యము కారణముకై శుభముగనుక యోగము నిచ్చుచున్నాడు. మకర లగ్నమునకు శని లగ్న ద్వితీయములలో గాని, ఇతర కేంద్రములందుగాని యోగము నిచ్చుచున్నాడు. తులాలగ్నమునకు కుజుడు ద్వితీయ సప్తమాధిపత్యము చేత పూర్ణశుభుడై లగ్న సప్తమ దశమ కేంద్రములందు అత్యంత రాజయోగము ఉత్తరోత్తరము చేత నిచ్చుచున్నాడు. ద్వితీయమందున మంచివాడు. మేషలగ్నమునకు నైసర్గిక శుభుడగుటవలన శుక్రుని కేంద్రములనుండి ఎంత అవయోగము నిచ్చుచున్నాడో, తులా లగ్నమునకు నైసర్గిక పాపియగుటవలన కుజుడు కేంద్రములందుండి ఎంత చక్కని రాజయోగము నిచ్చుచున్నాడు. మేషమునకు శుక్రుని తులకు కుజుని తీసికొన్నయెడల పై యోగము చక్కగా అర్థము కాగలదు. కాని ఇచ్చట ఒక విశేషము కలదు. మీన కన్యాలగ్నములకు మాత్రము మేష, తులా, మకర లగ్నములకు చెప్పినట్లు చెప్పకూడదు. కన్యాలగ్నమునకు ద్వితీయాధిపత్యము పట్టిన శుక్రునకు ఉత్తరోత్తరాధిపత్యము చేత భాగ్యకోణాధిపత్యము పట్టును. గాన అప్పుడు లగ్నాధిపత్యములోని కేంద్రాధిపత్య సంబంధమగు దోషముగాక కోణాధిపత్య సంబంధమగు శుభమును మాత్రమే లగ్నాధిపత్యమున తీసికొనును. అప్పుడు ద్వితీయమందుండి అత్యంత శుభమును రాజయోగమును ఇచ్చును. మీనలగ్నమునకు కుజునికికూడా అట్లే చూచుకొనవలెను. మీనలగ్నమునకు ద్వితీయమందును, కేంద్రకోణములందును రాజయోగము నిచ్చుట లేదు. అందు ముఖ్యముగా ద్వితీయ, పంచమ, నవమములలో అత్యంత పాపయోగము నిచ్చును.

వృషభ లగ్నమునకు ధనపంచమాధిపత్యము పట్టిన బుధుడు లగ్నాధిపత్యసంబంధమగు కోణాధిపత్య లక్షణముల చేత పంచమాధిపత్యసంబంధమగు శుభమునకు బలవంతుడై యోగమునిచ్చును.

వృషభలగ్నమునకు బుధుడిచ్చునట్లే వృశ్చికమునకు గురుడిచ్చును.

రవిచంద్రులకు ఒకే ఆధిపత్యము గనుక వీరి బలము నిర్ణయించుటలో అంత కష్టము లేదు. వీరిచ్చు యోగమునుగాని అపయోగమునుగాని నిర్ణయించుటకు రెండవ ఆధిపత్యము లేకపోవుటచేతను స్థితివలనను, సంబంధమువలనను, యోగము నిర్ణయించవలెను. అది ఎట్లనగా కర్కాటక లగ్నమునకు రవి ద్వితీయాధిపతి అగును. ఈరవికి లగ్నాధిపత్య సంబంధమగు కేంద్రాధిపత్య సంబంధము తనిలో కలదు. గనుక కేంద్రములందెక్కడనున్నను కేంద్రాధిపతులతో సంబంధము కలిగినను యోగము నిచ్చుచున్నాడు. ఈరవికి ద్వితీయాధిపత్య సంబంధమగు పాపాధిపత్య లక్షణములు కలవు. గనుక పాపస్థానాధిపతులతో కలిసినగాని, ఏడిగాగాని, పాపస్థానములందున్నప్పుడు పాపఫలమునే ఇచ్చును. ఇట్లే మిథున లగ్నమునకు చంద్రునికికూడా చూచుకొనవలెను. ఈ రెండురకములుగాక మూడవ పద్ధతియు కలదు. అది సింహ ధనుః కుంభలగ్నములకు మాత్రమే కలుగును.

సింహలగ్నమునకును, కుంభలగ్నమునకును బుధగురులు క్రమముగా ధనలాభాధిపతులగుదురు. ఇచ్చట లాభాధిపత్యము అస్వతంత్రము గనుక లాభాధిపతి స్వయముగా యోగము చేయడు. తనతో కలిసినవారికి యోగమునిచ్చునని అందరు ఋషులును జెప్పియున్నారు. ద్వితీయాధిపతి సంబంధమగు మిశ్రమ ఫలమును మాత్రమే ఈ గురు బుధులు ఇచ్చెదరు. అనగా స్థితి ఇతర గ్రహ సంబంధముల మాత్రముననే యోగము నిర్ణయించవలెను. వీరికి కేంద్ర కోణాధిపతుల సంబంధము కలిగి కేంద్రకోణములం దెక్కడ నున్నను తాము స్వయముగా యోగమునిచ్చుటయే గాక వీరితో కలిసిన వారిచేతకూడా యోగమునిప్పించెదరు. వీరు ఇతర గ్రహ

ములతో కలియక ద్వితీయమున మాత్రమే ఉన్నయెడల లగ్నాధిపత్యసంబంధమగు కొంత శుభమును తృతీయాధిపత్య సంబంధమగు కొంత అవయోగమునుకూడా కలపి మిశ్రఫలమునిచ్చెదరు. వీరికి ద్వితీయమున కేంద్రాధిపత్యదోషముకలిగిన నైసర్గిక శుభుల సంబంధము కలిగినప్పుడు వీరిదోషము కొంత తగ్గింపబడుచున్నది. ఇట్లే కోణాధిపత్యదోషము కలిగిన నైసర్గిక పాపులకును చూచుకొనవలెను. కేంద్రాధిపత్య శుభముకలసిన నైసర్గిక పాపుల సంబంధము కలిగినప్పుడు వీరి శుభము కొంత తగ్గింపబడుచున్నది. పాపాధిపత్యముపట్టిన నైసర్గిక శుభులుగాని, పాపులుకలిసినప్పుడు వీరిపాపత్వమును మరింతవృద్ధి చేయుచున్నారు. ధనుర్లగ్నమునకు మాత్రము పైవిధముగా చూచుకొనగూడదు. ఈలగ్నమునకు శనికి ద్వితీయ తృతీయాధిపత్యము పట్టుటచేత తృతీయాధిపత్య సంబంధమగు పాపాధిపత్యమునకే ప్రబలుడై పూర్ణపాపియగును. ఇదివరలో మీనలగ్నమునకు కుజునికిద్వితీయ భాగ్యాధిపత్యములుపట్టి యోగించిన విషయమును మేష తులా లగ్నములకు శుక్రకుజులకును ద్వితీయ కేంద్రకోణాధిపత్యములు పట్టి తిరిగి స్థితులవలన యోగించిన విధమును చెప్పియున్నాను. అందువలన ఈలగ్నములను మాత్రము వదిలివేసి ,తక్కిన లగ్నమునకు ద్వితీయాధిపత్యము పట్టిన గ్రహములు స్థితులవలనను సంబంధమువలనను, ఎట్లు యోగావయోగము నిచ్చుచున్నారో చెప్పబడుచున్నది. వృషభలగ్నమునకు ధన పంచమాధిపత్యము పట్టిన బుధుడు కేంద్రకోణములలో నెచ్చటనున్నను మంచియోగము నిచ్చుచున్నాడు. వీడు పాపస్థానములందుండిన అవయోగము. పాపులతో కలసినను యోగమునివ్వడు. ఈలగ్నమునకు తృతీయ మందుండినప్పుడు మాత్రము యోగము నిచ్చుచున్నాడు. వీనికి షష్ఠాధిపత్యము పట్టిన

శుక్రసంబంధము కలిగినను వీరిద్దరును యోగమునిచ్చుచున్నారు. ఇది ఈలగ్నమునకు విశేషము. ఇచ్చట వీరికి రవిసంబంధము వున్న యెడల ఈ రెండు గ్రహములు అవయోగము నిచ్చెదరు. మిధున లగ్నమునకు ద్వితీయాధిపత్యము పట్టిన చంద్రుడు కేంద్రకోణము లలో మంచివాడు. పాపస్థానములందు యోగమునివ్వడు. ధన భాగ్య లాభములం దుండిన యెడల మంచి రాజయోగము. ఇచ్చట శని, గురు, కుజుల సంబంధముకూడా మంచి ధనయోగము. వీరు లాభస్థానమున కలసిన మరింత మంచిది. ఇది ఈ లగ్నమునకు విశేష విషయము. కర్కాటక లగ్నమునకు ద్వితీయాధిపత్యము పట్టిన రవి కేంద్రములందు మాత్రము మంచివాడై కోణములందు యోగము నిచ్చుటలేదు. ఈ రవి పాపస్థానములంగుండిన అవయోగము. ఈలగ్నమునకు రవి షష్ఠమందు పడి షష్ఠాధిపత్యము పట్టిన గురుడు ద్వితీయమందుండిన యెడల అనగా రవి గురులకు పరివర్తన కలిగినయెడల యోగము నిచ్చుచున్నారు. ఇది ఈలగ్నమునకు విశేషము. సింహాలగ్నమునకు ధనలాభాధిపత్యములు పట్టిన బుధుడు కేంద్రకోణములందు మంచివాడు. పాపస్థానములందు యోగము నివ్వడు. ఈ బుధుడు తృతీయాధిపత్యము పట్టిన శుక్రునితో కలసి ద్వితీయమునందుండిన యెడల యోగము నిచ్చుచున్నాడు. ఇది ఈలగ్నమునకు విశేషము. కన్యాలగ్నమునకు ధన భాగ్యాధి పత్యము పట్టిన శుక్రుడు కేంద్రకోణములందు మాత్రము మంచి వాడు. ఈశుక్రుడు పాపస్థానములందు పాపఫలము నిచ్చును. ఈలగ్నమునకు శుక్రుడు ఇతర గ్రహములతో కలియక కేంద్రకోణ ములందుండుట మంచిది. ఈ శుక్రుడు ద్వితీయమందు మంచివాడు ఈ శుక్రునకు కేంద్ర కోణములందును, ద్వితీయమునందును చంద్రు నితో కలియుట మంచిది. ఈ శుక్రునకు, వ్యయాధి పత్యదోషము

కలిగిన రవి ద్వితీయమున కలసినప్పుడు రవిశుక్రు లిద్దరును యోగము నిచ్చుచున్నారు. ఈ లగ్నమునకు ధనాధిపతియగు శుక్రుడు వ్యయమందును, వ్యయాధిపత్యము పట్టిన రవి ధనమందును వుండిన యోగమునిచ్చును. ఇది ఈ లగ్నమునకు విశేషము. వృశ్చికలగ్నమునకు ధనపంచమాధి పత్యములు పట్టిన గురుడు ద్వితీయమందు మంచి ధనయోగము నిచ్చుచున్నాడు. వీనికి ఇచ్చట కేతు సంబంధము కలిగినయెడల మంచి ధనయోగమిచ్చుటయే గాక అకస్మాత్తుగా ద్రవ్యలాభము చేయుచున్నాడు. ఈ గురుడు కేంద్రకోణాధిపతులతో కలసిగాని కలియకగాని కేంద్రకోణములం దెక్కడ నున్నను మంచియోగమునిచ్చును. శుక్రసంబంధము మంచిది కాదు. పాపస్థానము లందుండినను పాపస్థానాధిపతులతో కలసినను యోగమునివ్వడు. ఈగురుడు వ్యయమందున్నప్పుడు అక్కడక్కడ యోగము చేయుచున్నాడు. ధనుర్లగ్నమునకు, శని కేంద్రకోణములందు మంచివాడు. కోణములకంటె కేంద్రములందు ఎక్కువ యోగము. ఇచ్చట వీనికి గురుబుధుల సంబంధము కలిగినప్పుడు మాత్రము యోగమునిచ్చుటలేదు. ఈశని పాపస్థానములందెక్కడ నున్నను యోగమునివ్వడు. ఈ లగ్నమునకు గురుబుధులు పాపస్థానములందు పడి యోగము నిచ్చువారైనయెడల వీరి దశాద్వయ మధ్యగతమగు శనిదశలో, ఈశని 3-6-8-12 ల॥ నుండినను, మంచి యోగము నిచ్చుచున్నాడు. మకరలగ్నమునకు శని కేంద్రకోణములందు మంచివాడు. కోణములలో నవమకోణమందు రాజయోగముకంటె ధనయోగమునకు ఎక్కువ మంచివాడు. కేంద్రములలో దశమ కేంద్రమందు అపయోగమునిచ్చును. కాని ఈశనికీర్తి శక్తి సామర్థ్యముల నిచ్చుటలో మంచివాడు. పాపస్థానములందుండిన శని యోగమునివ్వడు. ఈ శనికి భాగ్యకోణమున బుధసంబంధము

అత్యంత శుభము. ఈశనిబుధులు కేంద్రములందుగాని, (తులగాక) పంచమమందుగాని, ద్వితీయమందుగాని, కలసిన మంచి యోగము నిచ్చెదరు. శనిశుక్రుల సంబంధము కేంద్రములందంత మంచిది కాదు. శనికుజుల సంబంధము కేంద్రకోణములందెక్కడ నయినను శుభము. గురు శనులు కేంద్రములందు కలియుట మంచిది. వీరు పాపస్థానములందు కలసినయెడల ఇద్దరును అవయోగము నిచ్చెదరు.

కుంభలగ్నమునకు ధనలాభాధిపత్యములు పట్టిన గురుడు కేంద్ర కోణములం దెక్కడనున్నను, మంచి యోగమునిచ్చును. పాప స్థానములందు యోగమునిచ్చుటలేదు. ఈగురునకు నైసర్గిక పాపు లగు రవి కుజ శనుల సంబంధము కేంద్రకోణములందు మంచిది. అప్పుడు ఈగురుడు తాను స్వయముగా యోగమునిచ్చుటయే గాక ఈరవి శనులయొక్క యోగమునుకూడా వృద్ధిచేయును. ఈశ్లోక మున గ్రంథకర్త ద్వితీయ వ్యయాధిపతులు స్వతంత్రము లేకపోవుటలో సమానబలము కలవారని చెప్పియున్నాడు, కాని ద్వితీయ వ్యయాధిపతులు సమాన బలము కలవారు కారనియు చెప్పియున్నారు. ఈ కారణమువలన ద్వితీయాధిపతియొక్క బలము వేరుగా చెప్పియున్నాను; ద్వితీయ ద్వాదశాధిపతులకంటె లాభ వ్యయాధిపతులు సమాన బలవంతులనికూడా ఇదివరలో చెప్పి యున్నాను. ఇకవీరు ఆధిపత్యస్థితి సంబంధమువలననెట్లు యోగము నిచ్చు చున్నారో చెప్పబడును. వీరు నాలుగు రకములుగా మారుదురు.

1. కేంద్రవ్యయాధిపత్యము.
2. కోణవ్యయాధిపత్యము.
3. లాభవ్యయాధిపత్యము.
4. పాపవ్యయాధిపత్యము.

వీటిలో కేంద్ర స్థానాధిపత్యమును గురించి, అనగా మేష, తులా కుంభలగ్నములకు ఇదివరలో చెప్పియున్నాను. ధనలాభాధిపతుల విషయమై కూడా ఇదివరలో చెప్పబడియున్నది.

వృషభలగ్నమునకు గురుడు అష్టమ లాభాధిపతియగును. ఇట్టి గురుడు కేంద్రకోణములలో నెచ్చటనున్నను మంచియోగము నిచ్చుచున్నాడు. వీనికి చంద్రసంబంధము కూడా మంచిది. అనగా ఇద్దరును యోగమునిచ్చెదరు. ఈ చంద్రగురులుగాని, గురుడు ఒక్కడుగాని, పాపస్థానములందుండిన యోగమునివ్వడు. వీరికి స్వక్షేత్రమైన మరింత అవయోగము. ఈ పాపస్థానములయందు ఇతర గ్రహములు ఎవ్వరు కలసినను, వారుకూడా అవయోగము నిచ్చెదరు. ఈ గురుడు శుక్రుడుతప్ప మరి ఏ యితర గ్రహములతో కలసినను మంచియోగము నిచ్చును. మిథున లగ్నమునకు శుక్రునకు పంచమ వ్యయాధిపత్యమును, కుజునకు షష్టలాభాధిపత్యమును కలుగును. ఈ శుక్రునకు వ్యయాధిపత్యము అస్వతంత్రము గనుక వ్యయాధిపత్య దోషము లేదు. కాబట్టి వీనికి పంచమాధిపత్యము పట్టిన శుభము మాత్రమే మిగులును. ఇట్టి శుక్రుడు కేంద్రకోణములలో నెక్కడనున్నను మంచివాడు. వీడు ధన, పంచమ, నవమ లాభములయందున్నప్పుడు ధనయోగమునకు యెక్కువమంచివాడు. వీడు పాపస్థానములందుండిన యోగమునివ్వడు. వీరికి గురుబుధుల సంబంధము కేంద్రకోణములలో నెక్కడకలిగినను ఈముగ్గురుకూడా అవయోగమునిచ్చెదరు. ఈ లగ్నమునకు శుక్రశనుల సంబంధము కేంద్రములందుకంటె కోణములందెక్కువ మంచిది. వీరికి నైసర్గిక పాపులతో కలయిక ఎక్కడవున్నను శుక్రునికి యోగము కొంతవఱకు తగ్గిపోవును. పాపస్థానములో కలసిన పూర్తిగా అవయోగము. ఈలగ్నమునకు కుజుడు కేంద్రములందుండిన మంచివాడు. కోణము

లందుకన్న తక్కువ. పాపస్థానములందు యోగమునివ్వడు. వీనికి గురుబుధులసంబంధము కేంద్రస్థానములందు మంచిది. ఈ కుజునకు శుక్ర చంద్రుల సంబంధము ద్వితీయ నవమ లాభములయందు ధన విషయమున మిక్కిలి మంచిది. వీనికి నైసర్గిక పాపుల సంబంధము కేంద్రములందు మంచిది. కోణములం దవయోగము. పాపస్థానము లందు మరింత యెక్కువ అవయోగము. కర్కాటక లగ్నమునకు బుధునకు తృతీయ వ్యయాధిపత్యమును, శుక్రునకు వాహనలాభాధి పత్యమును కలుగును. వాహన లాభాధిపతియైన శుక్రుని విషయమై ఇదివరలో చెప్పబడినది. ఈ లగ్నమునకు బుధునికి కేంద్రాధిపత్య దోషము లేకపోవుట చేత పూర్ణ శుభుడుగా నెంచబడుచున్నాడు. ఇట్లే మకరలగ్నమునకు గురునకుకూడా చెప్పబడినది. కాని కర్కా టకలగ్నమందు బుధునికంటె మకరలగ్నమునకు గురుడు యెక్కువ శుభుడు. ఇట్టి గురుబుధులు కేంద్రకోణములందు ఎవ్వరితోను కలి యక ఉండినచో మంచిశుభ ఫలము నిచ్చుచున్నారు. కోణములందు కంటె కేంద్రములందు ఈ యోగము యెక్కువ. మకరలగ్నమునకు మాత్రము గురుడు నవమకోణమందంత యోగము నిచ్చుటలేదు. ఈ గురు బుధులు పాపస్థానములందుండినను యోగము నిచ్చెదరని చెప్పినారు. వీరికి స్వక్షేత్రములైన మరింత హెచ్చుయోగము నిత్తు రని వీరి అభిప్రాయము. ఇది అనుభవములో సరిగా నుండుటలేదు. ఈ లగ్నమునకు వాహన లాభాధిపత్యము పట్టిన కుజుని విషయము ఇదివరలో చెప్పివుండుటచేత ఇప్పుడు వేరుగా చెప్పనక్కర లేదు. సింహాలగ్నమునకు చంద్రుడు వ్యయాధిపతి యగును. బుధుడు ద్వితీయ లాభాధిపతియగును. ఈ చంద్రుడు కేంద్ర కోణములలో నెక్కడనున్నను మంచియోగము నిచ్చుచున్నాడు. ఈ చంద్రుడు పూర్ణబలవంతుడైన మరింత యెక్కువయోగము.

ఈ చంద్రుడు పాపస్థానములందుండిన యోగమునివ్వడు. వీనికి ఒక్క శుక్రుడు తప్ప మరి యెవ్వరితోనైనను కలసి ఎక్కడవున్నను మంచి రాజయోగము నిచ్చును. వీనికి చంద్ర కుజుల సంబంధము మాత్రము కోణములందు కుజునకు మంచిది కాదు. వీరు పాపస్థానములందు కలసినమాత్రమున చంద్రుడు యోగము నివ్వక కుజుడు మాత్రము యోగమునిచ్చును బుధునిగురించి ఇదివరలో చెప్పుటచే ఇక్కడ వేరే వ్రాయలేదు. కన్యాలగ్నమునకు రవి వ్యయాధిపతి యును, చంద్రుడు లాభాధిపతియును అగుదురు. ఈరవి చంద్రులు కేంద్రములందు శుభులు. కాని వీరిద్దరును కలసి కేంద్రములందుం డుట మంచిది కాదు. వీరు పాపస్థానములందుకలసిన అత్యంత అవ యోగము. వీరి సంబంధము గురు బుధులకు కొంత మంచిది. పాపులగు శని కుజులసంబంధము మంచిది కాదు. తులా లగ్నమునకు భాగ్యవ్యయాధిపత్యముపట్టిన బుధునకువ్యయాధిపత్యదోషము లేదు. ఇట్టిబుధుడు కేంద్రకోణములలో నెచ్చటనున్నను మంచియోగము నిచ్చుచున్నాడు. ధనవ్యయమునుకూడా నిచ్చుచున్నాడు. ఈబుధునకు రవిసంబంధమంతమంచిది కాదు. వీనికి శుక్రసంబంధము కూడా ధనయోగమునకు అంతమంచిది కాదు. ఈబుధుడు పాపస్థానములందుండిన యోగమునివ్వడు ఈ లగ్నమునకు రవిభాగ్యమందెక్కువ మంచివాడు. ధనలాభస్థానములందు సామాన్యము. వీనికి గురు శుక్రుల సంబంధమంత మంచిది కాదు. ఈ రవికి కుజసంబంధము మేషమందు తప్ప ఇతర కేంద్రకోణములందెక్కడనున్నను మంచి యోగము.

వృశ్చికలగ్నమునకు బుధుడు అష్టమ లాభాధిపతి యగును. ఈబుధునకు వృషభలగ్నమునకు గురునివలెనే చూచుకొనవలెను. ఈలగ్నమునకు సప్తమ వ్యయాధిపత్యములుపట్టిన శుక్రునకు ఇది వరలో చెప్పివుండుటచే తిరిగివ్రాయలేదు.

ధనుర్లగ్నమునకు, కుజుడు పంచమవ్యయాధిపతియును శుక్రుడు షష్ఠలాభాధిపతియును అగును. ఈ కుజుడు కేంద్ర కోణములందు గాని, వ్యయమందుగాని, యోగమునివ్వడు. ఇతర పాపస్థానము లందుండిన యోగమునిచ్చును. వీరికి ఈ పాపస్థానములందు రవి కుజులసంబంధము మంచిది. వీనికి శనిసంబంధము మాత్రము పాప స్థానములందు యోగమునివ్వదు.

ఈలగ్నమునకుశు క్రుడు కేంద్రకోణములందు యోగమునిచ్చును. అందు కేంద్రములందెక్కువ. వీడు పాపస్థానములందు యోగము నివ్వడు. వీనికి కేంద్రకోణములందు గురుబుధుల, రవికుజుల సంబంధములవలన శుక్రుడుమాత్రము యోగమునిచ్చి ఇతరులు యోగము నివ్వరు. ఈ శుక్రునకు శనిసంబంధము మంచిదికాదు. ఇది పాప స్థానములందైన మరింత అవయోగము.

కుంభలగ్నమునకు ధనలాభాధిపత్యములు పట్టిన గురుని విషయ ములో ఇదివరలో చెప్పియున్నాను. లగ్న వ్యయాధిపత్యములు పట్టిన విషయంకూడా చెప్పబడినది.

మీనలగ్నమునకు లాభవ్యయాధిపత్యములు రెండును ఒకశనికి మాత్రమే కలుగును. ఇట్టిశని కేంద్రకోణములం దొక్కడే ఉండుట మంచిది. పాపస్థానములందు యోగమునివ్వడు. ధన లాభస్థానము లందు మాత్రము శనికుజుల సంబంధము మంచిది. ఈ శనికి గురు బుధుల సంబంధము కేంద్రకోణములందు మంచిది. గురు బుధులకు మాత్రము అంతమంచిదికాదు. ఈ శనికి చంద్రసంబంధము కేంద్ర కోణములందు మంచిది.

## —♦ అష్టమాధిపతియొక్క బలనిర్ణయము ♦—

శ్లో॥ "భాగ్యవ్యయాధి పత్యేనరంధ్రేశో న శుభప్రదః
నవివశుభ సంధాతా లగ్నాధీ శోపి చేత్స్వయం"

లగ్నము మొదలు భాగ్యస్థానమునకు వ్యయస్థానము అష్టమ మగును. ఈ అష్టమాధిపతి యోగము నిచ్చుటలేదు. ఎందువల్ల ననగా అష్టమము భాగ్యమునకు వ్యయస్థానమగుటవలన, కాని ఈ అష్టమాధిపతి లగ్నమునకుగూడ అనైపతియైనచో శుభమునిచ్చు చున్నాడని గ్రంథకర్త యుద్దేశము.

కాని ఇతర వ్యాఖ్యాతలు ఈ క్రింది విధముగా నిశ్చయించిరి. భాగ్యస్థానమునకును, దానికి వ్యయస్థానమగు అష్టమమునకు అధిపతియైన గ్రహము యోగము నిచ్చుటలేదని చెప్పిరి.

గ్రంథకర్తయొక్క అభిప్రాయమునుబట్టి అష్టమాధిపతి పాపి యని వ్యక్తమగుచున్నది. ఇతరుల అభిప్రాయము ఒక్క మిథున లగ్న విషయముననే ఒప్పుచున్నది. మిథునలగ్నమునకు భాగ్య అష్టమాధిపత్యములు శనికి పట్టును. ఇతడు పూర్ణ పాపియై ఈలగ్న జాతకునకు యోగమునిచ్చుటలేదు. కోణమునందును, పాపస్థానము లందును యోగమునివ్వడు. కేంద్రములందు కొలదిగ యోగించును.

అనుభవములో చూడగా అష్టమాధిపత్యముపట్టిన నైసర్గిక శుభులకంటె నైసర్గిక పాపులు ఎక్కువ దోషకముకలవారై యున్నారు. నైసర్గిక శుభులకు కేంద్రాధిపత్యము మాత్రమే దోష మనియు, పాపస్థానాధిపత్యము శుభమనియు కొందరు భావించు చున్నారు. ఈ అభిప్రాయము సింహాలగ్నమునకు గురుని విషయ ములో సరిపోవుచున్నది.

సింహాలగ్నమునకు అష్టమాధిపత్యముపట్టిన గురుడు అష్టమ వ్యయములలో నెచ్చటనున్నను యోగమునిచ్చుచున్నాడని చెప్పు చున్నారు. ఇది గురుని విషయములో సరిపోవుచున్నది. కాని ఇతర

న్నై సర్గిక శుభుల విషయములో సరిపడుట లేదు. పైశ్లోకమున గ్రంథ కర్త గ్రహములకు అష్టమాధిపత్యమే పాపమని చెప్పినాడు కాని తిరిగి వారు స్థితులవలన అష్టమాధిపత్యదోషము మారి ఎట్లు శుభమునిచ్చుచున్నారో చెప్పియుండలేదు. స్థితి, ఇతర గ్రహముల సంబంధమువలన అష్టమాధిపతి ఎట్లు యోగావయోగముల నిచ్చుచున్నారో ఈ క్రింద చెప్పబడుచున్నది.

ధనుర్మకరములకు చంద్రసూర్యులు క్రమమున అష్టమాధిపతులగుచున్నారు. వీరిరువురకు ఇతర ఆధిపత్యములు లేవు. ఇతర లగ్నముల విషయములో అష్టమాధిపతులకు మరొక్క యాధిపత్యము గూడ నుండును. చంద్రసూర్యులకు అష్టమాధిపత్యదోషము లేదని కొందరి యభిప్రాయము. కాని ఇది అనుభవములో సరిగా నుండుట లేదు. గ్రంథకర్తకూడా పై శ్లోకమున ఈ అభిప్రాయము నొప్పుకొనియుండలేదు. ఈ రెండు లగ్నములకు రవిచంద్రులు కేంద్ర కోణము లందుండిన గాని యోగించుటలేదు. ధనుర్లగ్నమునకు మాత్రము అష్టమాధిపత్యముపట్టిన చంద్రుడు ద్వాదశమందున్నను యోగమునిచ్చుచున్నాడు. ఇది ఈ లగ్నమునకు విశేషము. ఇతర పాపస్థానములందు యోగమునివ్వడు. వృషభ లగ్నమునకు, వృశ్చికలగ్నమునకును; అష్టమ లాభాధిపత్యములు పట్టిన బుధ గురులు పాపస్థానములందెచ్చటనున్నను యోగమునిచ్చుట లేదు. సింహలగ్నమునకు మాత్రమట్లు కాదు. ఈ లగ్నమునకు అష్టమాధిపత్యము పట్టిన గురుడు కేంద్రకోణములందేగాక అష్టమ ద్వాదశముల మాత్రమే యోగమునిచ్చుచున్నాడు. కర్కాటకలగ్నమునకు సప్తమాష్టమాధిపత్యములు పట్టిన శని, కేంద్రములందు మంచియోగమును, కోణములందు సామాన్యఫలమును నిచ్చుచున్నాడు. పాపస్థానములందు కేవలము అవయోగము నిచ్చుచు

... ఈ అవయోగము తృతీయాష్టమములయందు మరింత ఎక్కువ. మిథునలగ్నమునకు శని పాపస్థానములలో తృతీయమందు మాత్రము యోగమునిచ్చుచున్నాడు. ఇది ఈ లగ్నమునకు విశేషము. కన్యాలగ్నమునకు తృతీయాష్టమాధిపత్యములు పట్టిన కుజుడు పాపస్థానములం దెక్కడనైనను యోగమునివ్వడు. ఇవి స్వక్షేత్రములైన మరింత యెక్కువ అవయోగము. ఈ కుజుడు ద్వాదశమందున్నప్పుడు మాత్రము యోగము నిచ్చుచున్నాడు. ఇద్ది ఈ లగ్నమునకు విశేషము. ఈ కుజునకు ఇచ్చట రాహుసంబంధముండుట చాల మంచిది. వీరిద్దరును యోగమునిచ్చెదరు. ... ఈలగ్నమునకు రవి కుజులకు పరివర్తనముకూడ శుభము. ఇట్టి అష్టమ ద్వాదశాధిపతుల పరివర్తనమువలన యోగముగలుగును. ఇట్టిది లగ్నములకు ఎక్కడను కనుపించదు కుంభలగ్నమునకు పంచమాష్టమాధిపత్యములు పట్టిన బుధుడు సింహలగ్నమునకు గురునివలెనే శుభుడుగా నెంచబడుచున్నాడు. కాని ఈ అభిప్రాయము సరియైనదికాదు. ఇందుకు కారణము; ఈ గురుబుధుల నైసర్గికమును నిర్ణయించుటలో చాలాభేదముకలదు. ఈ కారణము వలన బుధుడు పాపస్థానములందు యోగమునిచ్చుటలేదు. వీనికి అష్టమము ఉచ్చ స్వక్షేత్ర మూల త్రికోణమైనను అచ్చటనుండుట వలన అత్యంత పాపఫలమునే ఇచ్చుచున్నాడు. మీనలగ్నమునకు తృతీయాష్టమాధిపత్యములు పట్టిన శుక్రుడు బుధునికంటె శుభుడు. ఈ శుక్రుడు అష్టమమందుండిన యోగమునిచ్చుచున్నాడు. వీడు ఇతర పాపస్థానములందు యోగము నిచ్చుటలేదు. తృతీయము స్వక్షేత్రమమైనను అవయోగమునే ఇచ్చుచున్నాడు. ఈలగ్నమునకు శనిశుక్రులు అష్టమమందు కలసిన మంచియోగము. ఇది ... గల విశేషము.

నివ్వడు. కేంద్రమా
... పస్థానములలో ...
ర్తలు వ్యాఖ్యాతల

 

గ్రంథకర్త ఇంతవరకును అష్టమాధిపతి మాత్రము అవయో-గము నిచ్చునని చెప్పి లగ్నాష్టమాధిపత్యముపట్టిన గ్రహము మాత్రము శుభుడై యోగముచేయునని ఈయన అభిప్రాయము. ఈలగ్నాష్టమాధిపత్యము మేష తులా లగ్నములకు మాత్రము కలుగును. ఈ రెండు లగ్నములలోను మేషమునకు నైసర్గిక పాపియగు కుజుడున్ను, తులాలగ్నమునకు నైసర్గిక శుభుడగు శుక్రుడున్నూ అష్టమాధిపతులగుచున్నారు. లగ్నాష్టమాధిపత్యము శుభమని చెప్పినమాట సర్వత్ర వర్తించదు. కారణమేమన ఒకడు నైసర్గిక శుభుడును, రెండవవాడు నైసర్గిక పాపియును అగుట తటస్థించినది. ఇచ్చట ఒక ముఖ్యవిషయముకలదు. శాస్త్రజ్ఞులు లగ్నమును కేంద్రముగాను, కోణముగానుకూడ చెప్పినారు.

పై విధముగా లగ్నాష్టమాధిపత్యములు కలిగిన శుక్రకుజులలో శుక్రునకు తులాలగ్నమునకు లగ్నాధిపత్యము కేంద్రముగాను, కుజునకు మేషలగ్నమునకు లగ్నాధిపత్యము కోణముగాను చూచుకొనవలెను. ఇది సాంప్రదాయము.

అప్పుడు పై రెండు లగ్నములకును శుక్రుని కేంద్రాధిపత్యదోషిగాను, కుజుని కోణాధిపత్యదోషిగాను తెలిసికొనవలెను. మేషమునకు లగ్నాష్టమాధిపత్యము పట్టిన కుజునికోణ అష్టమాధిపతిగాను తులకు లగ్నాష్టమాధిపత్యముపట్టిన శుక్రుని కేంద్ర అష్టమాధిపతిగాను ఎంచుకొనవలెను. ఇది ఒక్క మేష తులా లగ్నముల విషయమున మాత్రమే చెల్లును.

ఈ కుజ శుక్రులు స్వక్షేత్రములగు లగ్నమున నున్న యెడల మంచియోగము నిచ్చుటలేదు. అందు ముఖ్యముగా శుక్రునకెక్కువ అవయోగము చెప్పవలెను. వీరు ఆధిపత్యముచేత ఆయువును నిచ్చుచు నందుతప్ప ఇతర కేంద్రములందు యోగము నియోగము నిచ్చుచు

ములో సూచినయెడల ఈ మేష తులాలగ్నములకు ఆధిపత్య పట్టిన శుక్రకుజుల యోగమునవలె వృషభలగ్నమునకు లగ్నాధిపత్యము పట్టిన శుక్రునకుకూడ చూచుకొనవలెను. అనగా లాలగ్నమునకు శుక్రుడు లగ్నాష్టమాధిపతియగుటవలన యోగమయమున ఎంతబలవంతుడో వృషభ లగ్నమునకుకూడ లగ్నస్థాధిపత్యముచేత అంతే బలవంతుడని అర్థము. స్థితివలన గూఢమున గ్నాష్టమాధిపత్యము పట్టిన శుక్రుడు కేంద్రకోణములందు (లక్షణము యునందుతప్ప) ఎంత యోగము చేయునో వృషభలగ్నమునకు కలుగు అంతే యోగము చేయును. అట్లే కుజుడు వృశ్చిక లగ్నమునకు లగ్నస్థము షష్ఠాధిపత్యముచేత పాపి అయి కేంద్రకోణములందు యోగమునకు నిచ్చును. కాని లగ్నమును ఇచ్చట కుజునికి కోణముగా తీసికొనకూడదు. కుజుడు వృశ్చికమునకు లగ్నమందున్నను యోగించును అనగా లగ్నాష్టమాధిపత్యము పట్టినప్పుడు మాత్రమే కుజునకు లగ్నము కోణమగుచున్నది. అందువలన కోణాధిపత్య పాపి యగుచున్నాడు.

మిథునలగ్నమునకు అష్టమ భాగ్యాధిపత్యము పట్టిన శనికూడ లగ్నాష్టమాధిపత్యము పట్టిన శుక్రకుజులతో సమాన బలవంతుడని గ్రహించవలెను.

శుక్రుడు కేంద్రములందు మాత్రమేగాక కోణములందుకూడ యోగమునిచ్చును. శుక్రునకు తులా లగ్నమునకు కేంద్రములందుకంటె కోణములందెక్కువ యోగము. పాపస్థానములందు యోగము నివ్వడు. కేంద్రములలో లగ్న కేంద్రమునందు అంతమంచిది కాదు. పాపస్థానములలో అష్టమమున మిక్కిలి పాపి. చాలమంది గ్రంథకర్తలు వ్యాఖ్యాతలుగూడ లగ్నాష్టమాధిపత్యము పట్టిన గ్ర

ములు మంచివాని చెప్పుటచేత స్వక్షేత్రములగు లగ్నాష్టమ లందు శుక్రుడు యోగి, కుజుని చెప్పినవ్వారు. ఇది అనుభవము, వ్యతిరిక్తము.

కుజుడు కేంద్రములలోను మకరమందు అంతయోగము నిచ్చుట లేదు. పైన కుజునకు మిథునలగ్న విషయమున శనికివలెనే చూచ ...లేనని చెప్పినాను. అయినను ఇచ్చట ఒక ప్రత్యేక విషయము శుభ... కుజునకు లగ్నకోణము స్వల్పపాపముగా జూచుకొనవలెను ఒకశనికి భాగ్యకోణము నైసర్గికముచేతను, ఉత్తరోత్తరముచేతను ...డ ఎక్కువ పాపము. ఈ కారణమువలన శనికంటె కుజుడు కేంద్రములందు ఎక్కువయోగము నిచ్చును. ఈ కుజుడు పాపస్థాన ములందు యోగమునివ్వడు.

---

# గురుశుక్రులకు కేంద్రాధిపత్య దోష నిర్ణయము

శ్లో॥ కేంద్రాధిపత్య దోషస్తు బలవాన్ గురు శుక్ర యోః
మారకత్వేపిచ తయోర్మారకస్థాన సంస్థితిః ॥

---

ఇదివరలో నైసర్గిక శుభులకు కేంద్రాధిపత్యము పట్టి పాపస్థానములగు 8, 6, , 12 లందుండినప్పుడును; వారికే పాపాధిపత్యములు పట్టి కేంద్రములందుండి ...ప్పుడును, యోగమునిత్తురని చెప్పబడినది. ఈ రెండు రకముల యోగములలో నీయోగము యెక్కువ గొప్పదను విషయము చాల ముఖ్యమైనది. నైసర్గిక శుభు ...లకు పాపాధిపత్యము పట్టి కేంద్రములందుండుటకన్న; కేంద్రాధిపత్యము పట్టి పాపస్థానములందుండుట యెక్కువశుభమై అత్యంత రాజయోగప్రద మగుచున్నది. ఏవిధముగనే నైసర్గికపాపులకు కోణాధిపత్యముపట్టి పాపస్థానములందుండుట ...టె, పాపాధిపత్యము పట్టి కోణములందుండుటవలన యోగముతగ్గును. నైసర్గిక ...లకు పాపాధిపత్యముపట్టి కేంద్రకోణములందుండుటకంటె కేంద్రాధిపత్యము ...న కేంద్రములందుండుట అత్యంతరాజయోగప్రదము. పాపాధిపత్యము అందరి ...నగా నైసర్గిక శుభ, పాపగ్రహములకు సమానముగానుండును.

గురు శుక్రులు కేంద్రాధిపత్యదోషము చేత అవయోగమునకు బలవంతులగుచున్నారు అట్టి కేంద్రాధిపత్యదోషము కలిగిన గురు శుక్రులు మారక స్థానములందుండినయెడల మారకము చేయుటకు బలము కలవారగుచున్నారు.

పైశ్లోకమున గ్రంథకర్త రెండు విషయములను చక్కగా చెప్పియున్నాడు. మొదటిది కేంద్రాధిపత్యము యోగవిషయమున మంచిది కాదనియును; రెండవది గురు శుక్రులు మారక లక్షణము కేంద్రాధిపత్యము వలన గాక మారకస్థానములందుండుట వలన కలుగుచున్నదని వారి అభిప్రాయము. నైసర్గిక శుభులకు కేంద్రాధిపత్యము పట్టి మారకస్థానములగు 2, 7, 12 లందుండినచో మారకమునకు బలవంతులై మారకమును చేయుచున్నారు.

ఇచ్చట ఇంకొక విషయము కలదు. నైసర్గిక శుభులకు కేంద్రాధిపత్యముపట్టి మారకస్థానములందుండిన యోగమని చెప్పబడినప్పుడు నైసర్గిక పాపులగు రవి కుజ శనులకు కోణాధిపత్యములు పట్టి మారక స్థానములందుండిన మారకము చేయుదురని వేరుగా చెప్పనక్కరలేదు. మారక విషయమును గురించి ఆలోచించునప్పుడు మారక లక్షణములు పట్టినంతమాత్రమున గ్రహము మారకము చేయునని చెప్పుట తప్పు.

అప్పుడు జాతకునికి ఆయుర్దాయము నిర్ణయించిగాని, మారకము నిర్ణయించగూడదు. ఈవిషయము ప్రతివారును మారకము నిర్ణయించు విషయమున జ్ఞాపకముంచుకొనవలెను. అనగా పీఠికమీద జాతకమునకు అల్ప, మధ్యమ, పూర్ణ దీర్ఘాయువులను నిర్ణయించి, పిమ్మటవే భాగమునపడునో ఆభాగమునవచ్చిన మారక లక్షణములు గల గ్రహదశలలో మారకమును నిర్ణయించవలెను.

ప్రతిభావమునకు యోగవిషయముల విశ్లేషించి నిర్ణయించవలెను. జాతకునకు పీఠిక మీద సంతానముండునో లేదో నిర్ణయించకుండగనే పుత్రస్థానాధిప, పుత్రకారకుల దశలు వచ్చినప్పుడు సంతాన యోగమున్నదని చెప్పుట పొరపాటు. ఇట్టి పొరపాట్లు సాధారణముగా జాతకము చెప్పువారు చేయుచున్నారు. ఏ భావమునకైనను ముందు పీఠిక మీద నిర్ణయించకుండగ ఫలితములు చెప్పుట అశాస్త్రీయము. కాబట్టి మారక విషయమున ఆయుర్నిర్ణయము చేసిగాని మారక నిర్ణయము చేయకూడదు. ఈ సందర్భమున అల్ప, మధ్యమ, పూర్ణ, దీర్ఘ, విపరీతాయువుల ప్రమాణము చెప్పుచున్నాను. బాలారిష్టము లేని వారికి జననాది 32 సంవత్సరములు పూర్తియగువరకు అల్పాయువు. 33 మొదలు 62 పూర్తియగువరకు మధ్యమాయువు, 63 మొదలు 82 వరకు పూర్ణాయువు, 83 మొదలు 120 వరకు దీర్ఘాయువు, 120 దాటిన తరువాత విపరీతాయువనియును చెప్పబడినది. పై విధముగా జాతకునికి అల్ప మధ్యమ పూర్ణాది ఆయుర్దాయములను నిర్ణయించి, ఆయుః ప్రమాణము ఏతరగతిలో పడునో చూచుకుని, ఆ తరగతిలో వచ్చిన దశలలో ఏ గ్రహమునకు ఎక్కువ మారకలక్షణములు పట్టినవో బలాబలములను నిర్ణయించి బలవంతమయిన దశాంతర్దశలలో మారకము నిర్ణయించవలెను. ఇది శాస్త్ర ప్రకారము నిర్ణయించు విధానము. ఆయువు నెట్లు నిర్ణయించవలెనో ఆయుర్దాయ ఖండమున చెప్పినాను. గాన ఇచ్చట వేరుగా చెప్పలేదు. ఇచ్చట మారక గ్రహములనుగురించి మాత్రమే చెప్పుచున్నాను. మారకగ్రహములు ఐదు రకములుగా జెప్పబడుచున్నవి.

(1) ఆధిపత్యముచేత మారక లక్షణములుగల్గి స్థితి వలన కూడ మారక లక్షణములు గలవి.

(2) ఆధిపత్యము చేత మారక లక్షణములు గలిగి స్థితి వలన మారక లక్షణములు లేనివి.

(3) ఆధిపత్యమువలన మారకలక్షణము లేక స్థితి వలన మాత్రము మారక లక్షణములు గలవి.

(4) కేంద్రాధిపత్యదోషము పట్టిన నైసర్గిక శుభులు తిరిగి కేంద్రము లందు గాని, మారకస్థానములందుగాని యుండుట.

(5) కోణాధిపత్యము పట్టిన, రవి, కుజ, శనులు తిరిగి కోణస్థానము లందుగాని, మారక స్థానములందుగాని యుండుట.

పైని ఉదహరించిన ఐదు రకములలోను ఒకదానికంటె ఒకటి క్రమముగా బలములో తక్కువ. మారక స్థానములందుకూడ ఉత్తరోత్తరము కలదు. అది ఎట్లనగా !

(1) లగ్న, అష్టమ, తృతీయాధిపతులు, కేంద్రాధిపత్యము పట్టిన నైసర్గిక శుభులు, కోణాధిపత్యము పట్టిన నైసర్గిక పాపులు.

(2) ద్వితీయ, సప్తమ, వ్యయాధిపతులు.

(3) షష్ఠలాభాధిపతులు.

గ్రహములకు పై ఆధిపత్యములు గలిగి నప్పుడు మారక విషయమున ఉత్తరోత్తరము చే మొదటి రకమున చెప్పిన గ్రహములు ప్రబలమారకులు. రెండవరకము అంతకంటె తక్కువ బలవంతులు. మూడవరకము అంతకంటెను తక్కువ. జాతకు నకు, అల్ప, మధ్యమ, పూర్ణాది ఆయువులను నిర్ణయించిన తరు వాత వాని ఆయుర్దాయము పడిన భాగములో పై మూడురకముల దశలలో మొదటి రెండురకముల గ్రహదశలు వచ్చినఎడల మొదటి రకపు గ్రహదశలలోనే మారకము నిర్ణయించవలెను. ఈ రెండు రకముల గ్రహదశలు రానియెడల అప్పుడు మూడవ రకములోని

గ్రహాదశలయందు మారకము నిర్ణయించవలెను. ఇట్లు నిర్ణయించు టలో ఒక ముఖ్యవిషయముకూడ చూచుకొనవలెను. జాతకుని ఆయువు తిరిగి అల్పములో మధ్యమా ; అల్పములో పూర్ణమాయని యును ; లేక మధ్యమమైన యెడల, మధ్యమములో అల్పమా ; మధ్యమములో మధ్యమా, మధ్యమములో పూర్ణమాయనియును, పూర్ణాయు వయినయెడన పూర్ణములో అల్పమా, పూర్ణములో మధ్యమా, పూర్ణములో పూర్ణమాయనియును, ఇట్లే దీర్ఘాయువు విషయములోను చూచుకొనవలెను. ఈ నిర్ణయము అనుభవమును బట్టి గ్రహబలముననుసరించి చూచుకొనవలెను. గాని సంఖ్యా నిర్ణయము చేయుట దుర్లభము. చాలమంది యభిప్రాయము 2, 7, స్థానములు మాత్రమే ప్రబలమగు మారక స్థానములనియు, అందులో 7 కంటె ద్వితీయము ఎక్కువబలమని చెప్పుదురు. ఇది సరి యయినది కాదు. "అష్టమం ఆయుషస్థానం అష్టమాదష్టమంచతేషు" అని చెప్పుటచేత 3, 8 స్థానములు ఆయుష స్థానములని చెప్పుట చేత లగ్నము ఆయుష స్థానమని వేరుగా చెప్పనక్కరలేదు. అందువలన 1, 3, 8 స్థానములకు పండ్రెండవ ఇల్లుమారక స్థానము గనుక 12, 2, 7 స్థానములు మారకస్థానములైనవి. ఈ స్థానములు మారక స్థానములుకావని చెప్పుటలో భేదాభిప్రాయము లుండుటకు కారణము గనుపించదు. కాని "అష్టమం నిధనం రంధ్రం" అని చెప్పుటలో మహర్షుల యభిప్రాయం తెలియుచున్నది. అష్టమం ఆయుషస్థానమని చెప్పి తిరిగి అది మరణస్థానమని చెప్పినారు. ఆయుషస్థానమని ఎప్పుడైతే చెప్పినారో! అది మరణ స్థానమని వేరుగా సాంప్రదాయము తెలిసినవారికి చెప్పనక్కరలేదు. ఈ కారణమువలన లగ్న, తృతీయ అష్టమ స్థానములు ఉత్తరో త్తరముచేత ప్రబల మారక స్థానములగును. తరువాత 2-7-12

స్థానములు మారక స్థానములగును. మొదటిరకములో గూడ అష్టమము ఎక్కువ ప్రబలము.

## —♦ బుధ చంద్రుల అష్టమాధిపత్యము ♦—

శ్లో॥ బుధస్తదను చంద్రోపి భవత్తదను తద్విధః।
నరంధ్రేశత్వ దోషస్తు సూర్యా చంద్ర మసోర్భవేత్॥

తదను = తరువాత. బుధః = బుధుడు, తద్విధః = గురుశుక్రుల కంటె తక్కువయిన కేంద్రాధిపత్యదోషముగలవాడు. చంద్రోపి = చంద్రుడును, తద్విధః = ఆ బుధుని దోషముకంటె తక్కువదోషము కలవాడు, రంధ్రేశత్వదోషస్తు = అష్టమాధిపత్యదోషము, సూర్య చంద్ర మసోనభవేత్ = సూర్య చంద్రులకు లేదు. ఇదివరలో గురు శుక్రులకు మాత్రమే గాక బుధ చంద్రులకు కేంద్రాధిపత్యదోషము ఎట్లు కలుగుచున్నదో, ఎంతవరకు సరిపోవునో వ్రాసియున్నాను. బుధుడు అర్థపాపి యగుటచేత కేంద్రాధిపత్యదోషము బుధునకు తక్కువ యనుటలో గ్రంథకర్త చక్కగా చెప్పినాడు. కాని ఒక్క విషయముకూడ చెప్పియుండిన బాగుండెడిది. "బుధః పాపయుతపాపః" అని చెప్పబడి యుండుటచేత బుధుడు నైసర్గిక పాపులతో గలసినప్పుడు గ్రంథకర్త యభిప్రాయము సరిగానుండదు. అప్పుడు ఈ అర్థశుభత్వము పోయి బుధుడు పాపిగా నెంచబడును. అట్లే చంద్రునకు నైసర్గిక శుభత్వమును నిర్ణయించకుండగ కేంద్రాధిపత్యదోషమును చెప్పుట గ్రంథకర్త చాల లోటు చేసినాడు. ఈ చంద్రుడు కళలనుబట్టి (తిధులననుసరించి) ఏగ్రహ ములతో సమాన బలవంతుడో, అంతకు తగిన కేంద్రాధిపత్య దోషము ఎట్లు కలిగి ఎట్లు వివిధముగా యోగావయోగములను

చేయుచున్నాడో ఇదివరలో వ్రాసియే యున్నాను. * పాపులతో గలసిన బుధుడు అర్ధపాపి యగుననియును అందువలన రవితో సమానముగా చూచుకొనవలయు ననియునుకూడా ఇదివరలో చెప్పియున్నాను.

ఉ॥ ధనుర్లగ్నమునకు రవి బుధులు కలిసి కేంద్రకోణములం దెక్కడగాని, పరివర్తనము గలిగిగాని, ఎవరి ఇంటిలో వారున్న గాని, అవయోగము జరుగుచున్నది. ఇందుకు కారణము ఇదియే. వారు పాపస్థానములందు విడిపోయియుండిన మంచియోగము నిచ్చుటకు కారణముకూడ నిదియే. కన్యాలగ్నమునకు రవి కేంద్ర కోణములందు ఒక్కడేయుండి పాపస్థానములందు బుధుడు ఒక్కడే యున్నయెడల యోగమునిచ్చును. ఈ రవి బుధులు కలిసియుండి యోగము నిచ్చుటలేదు.

చంద్రుని కేంద్రాధిపత్యదోషము బుధునికంటెను తక్కువ యని వ్రాయుట సరిగాలేదు. గ్రంథకర్త ఈ శ్లోకమున రెండవ పాదమున సూర్యచంద్రులకు అష్టమాధిపత్యదోషము లేదని చెప్పి

---

* —♦ చంద్రుని నైసర్గిక శుభాశుభత్వపు పోలిక ♦—

చంద్రుడు బ॥ 14 మొదలు శుద్ధ విదియ వరకు, శుద్ధ చవితి వరకు ముప్పాతిక పాపియగు కుజునితోను; బ॥ ఏకాదశి మొదలు బ॥ 14 వరకు అర్ధపాపియగు రవి తోను; శుద్ధ దశమి మొదలు బ॥ సప్తమివరకు పూర్ణశుభుడగు గురునితోను; శుద్ధ సప్తమి మొదలు శుద్ధ దశమి వరకు ముప్పాతిక శుభుడగు శుక్రునితోను; శుద్ధ పంచమి మొదలు శుద్ధ సప్తమి వరకు అర్ధశుభుడగు బుధునితోను సమాన బలముకలవా డగుచున్నాడు.

—:*: నైసర్గిక శుభ పాపత్వముల పోలిక :*:—

పూర్ణపాపియగు శని పూర్ణశుభుడగు గురునితోను; ముప్పాతిక పాపియగు కుజుడు ముప్పాతిక శుభుడగు శుక్రునితోను; అర్ధపాపియగు రవి అర్ధశుభుడగు బుధునితోను వ్యతిరిక్తముగు సమాన బలమును కలిగి యుందురు.

యున్నాడు. ఇదివరలో అష్టమాధిపత్యము పట్టిన గ్రహము పాపి యని చెప్పినాడు. కాని ఈశ్లోకమున అష్టమాధిపత్యదోషము రవి చంద్రులకు లేదని వ్రాయుచున్నాడు. దీనినిబట్టిచూడగా గ్రంథ కర్త అభిప్రాయము అష్టమాధిపతికి ఇంకొక యాధిపత్యము పట్టిన గాని పాపత్వము లేదని తెలియుచున్నది. రవి చంద్రులకు ఒకే యాధిపత్య ముండుటచేత వీరికి అష్టమాధిపత్యదోషము లేదని ఈయన యభిప్రాయము. ఇది సరియైనదికాదు. అష్టమాధిపత్యము నైసర్గిక పాపియగు రవికి, శని కుజులకంటె తక్కువ యని చెప్పిన సరిగానుండును. కారణమేమనగా రవి నైసర్గిక పాపత్వమున శని కుజులకంటె తక్కువ. అట్లే చంద్రుని విషయములోను అష్టమాధిపత్యదోషము వాని నైసర్గిక గుణముబట్టి మారును. అనగా ఈ చంద్రుడు గురునితో సమానబలము కలిగి పూర్ణుడైన యెడల అష్టమాధిపత్యదోషము చాలతక్కువ. శుక్రునితో సమాన బలము కలిగినప్పుడు అంతకంటె కొంచెము ఎక్కువ. బుధునితో సమానబలవంతుడైనయెడల ఇంకను ఎక్కువ. రవి కుజ, శనులతో సమానబలము కలిగినప్పుడు ఇంకను హెచ్చుగా చూచుకొనవలెను. ఇట్లీదోషము పైగ్రహములకువలెనే స్థితి, ఆధిపత్యములవలన నెట్లు మారునో చూచుకొని అప్పుడు యోగావయోగములు నిర్ణయించు కొన్నయెడల అనుభవమునకు సరిగా సరిపోవును.

శ్లో॥ కుజస్యకర్మనేతృత్వ ప్రయుక్త శుభకారితా।—
త్రికోణస్యాపి నేతృత్వేనకర్మేశత్వమాత్రనే ఇచ్ఛేద రను

ని అందరును

కుజస్య := కుజునకు, కర్మనేతృత్వ = దమాధిప ర రాహు కేతువు
ప్రయుక్త = కూటడమువల్ల, శుభకారితా = శ యించియున్నారు.
ఢగును. త్రికోణస్యాపినేతృత్వే = పంచమాధిపత లకుకూడా ఆయా

వల్ల, కర్మేశత్వమాత్రతః = దశమాధిపత్యశుభమును, న = ఇవ్వదు ఈశ్లోకమునకు కొందరు కర్మేశత్వ మాత్రతః = (అనుదానికి) దశమాధిపత్యము చేత యోగము చేయక, త్రికోణస్యాపి నేతృత్వే = పంచమాధిపత్యము చేత మాత్రము యోగించుననివ్రాయుచున్నారు. కొందరు: కుజస్య = కుజునకు, కర్మనేతృత్వప్రయుక్తశుభకారితా = కర్మాధిపత్యమువలన కలుగు శుభము, త్రికోణస్యాపి నేతృత్వే = త్రికోణాధిపత్యము (5-9 ఆధిపత్యములు,) కలిగినప్పుడు, కర్మేశత్వమాత్రతః = దశమాధిపత్యము పట్టినంత మాత్రమున, న = యోగము లేదని చెప్పుచున్నారు.

రెండవ యర్థము అనుభవము లేక వ్రాసినది. అనుభవముకు వ్యతిరిక్తమైన అర్థము గ్రాహ్యముకాదు. గ్రంథకర్త యభిప్రాయము. ఈశ్లోకము ఇతరులు చెప్పినట్లుగా కర్కటక లగ్నము కొరకు వ్రాసినట్లు తోచదు. ఒకవేళ అట్లు వ్రాసినాడని అనుకొన్నను అది అనుభవములో జరుగదు. ఈ దశమాధిపత్యము కుజునకు కర్కటక కుంభలగ్నములకు వచ్చును. కర్కటకమునకు కుజునకు పంచమరాజ్యాధిపత్యము కుంభమునకు తృతీయరాజ్యాధిపత్యమును కలుగును. ఇచ్చట కుజుడు కుంభలగ్నమునకు మంచివాడా లేక కర్కటకమునకు మంచివాడా యను విషయము ఆలోచించినయెడల కుజుడు కుంభలగ్నమునకు నిచ్చుయోగము, కర్కటకలగ్నమున కిచ్చుదానికంటె ఎక్కువ. కారణమేమనగా కర్కటక[illegible] మాధిపత్యమువలన కలిగిన దోషముకంటె కుంభ[illegible]యాధిపత్యమువలన కలిగినదోషముతక్కువ. అనుభవ[illegible] కర్కటలగ్నమునకు కేంద్రములందుండినమాత్రము[illegible]గము నిచ్చుచున్నాడు. కోణములందు కేవలము[illegible]చ్చుచున్నాడు. పాపస్థానములందుకూడ అధ

ద్ధ పంచమ మొదలు
లముకలవాడగుట

—:*:—

పూర్ణ పాపియగు
కుజుడు ముప్పాతిక
ఫలనితోను వ్యతిరిక్త

యోగమే యిచ్చుచున్నాడు. కుంభలగ్నమున కట్లుకాదు. ఈ లగ్నమునకు కుజుడు కేంద్రములందును కోణములందునుకూడ యోగమునిచ్చును. పాపస్థానములందు మాత్రమే యోగము నిచ్చుటలేదు. ఈ కారణమువలన పంచమ రాజ్యాధిపత్యములు పట్టిన కుజుడుమాత్రమే తృతీయ రాజ్యాధిపత్యములు పట్టిన కుజుని కంటె ఎక్కువయోగము నిచ్చునని చెప్పుట తప్పు. కుంభలగ్నమునకు ఇతర కేంద్రాధిపతులగు రవి శనులతో కలసి కేంద్రకోణములలో నెచ్చటనున్నను అత్యంత రాజయోగము నిచ్చుచున్నాడు. కర్కాటకలగ్నమునకు ఇతర కేంద్రాధిపతులగు శని, శుక్ర, చంద్రులతో కలసి కేంద్రములందుండినను అంతయోగము నిచ్చుటలేదు. కోణములయందు కేవలము అవయోగముమాత్రమునిచ్చుచున్నాడు.

శ్లో॥ యద్యద్భావగతౌ వాపి యద్యద్భావేశసంయుతౌ।
తత్తత్ఫలాని ప్రబలౌ ప్రదిశేతాం తమోగ్రహౌ॥

తమోగ్రహౌ = రాహుకేతువులు, యద్యద్భావగతౌ వాపి = ఏయేభావములందు (యేస్థానములయందు) ఉందురో, యద్యద్భావేశ సంయుతౌ = ఏయేభావాధిపతులతో కలసి యుందురో (చూడబడుట కూడ) వారు ప్రబలౌ = బలవంతులై, తత్తత్ఫలాని = వారి వారి ఫలితములను ప్రదిశేతాం = ఇచ్చెదరు.

రాహుకేతువులు (ఎవరిచేత చూడబడిన) ఎవరితో కలసిన ఎవరి ఇంటిలోనుండిన వారి ఫలితమునుమాత్రము నే ఇచ్చెదరను చెప్పుమాట సామాన్యముగా వాడుకలోనున్నది. కాని అందరును ఈ యభిప్రాయమును అంగీకరించియుండలేదు. వీరు రాహుకేతువులకుకూడా ఉచ్చ స్వక్షేత్రమిత్రస్థానములు నిర్ణయించియున్నారు. ఇందువలన వీరి అభిప్రాయము ఛాయాగ్రహములకుకూడా ఆయా

రాసులందలి స్థితులనుబట్టియును సంబంధమునుబట్టియును ఇతర గ్రహములకువలెనే యోగము నిర్ణయించవలెనని తెలుచున్నది. ఛాయాగ్రహములు స్వతంత్రముగా యోగము చేయగలవని అనుభవమువలనను ఋషిప్రోక్తములవలనను తెలియుచున్నది. ఇందుకు అనేకవందల శ్లోకములు శాస్త్రమునకలవు. ఇందుకు ఇచ్చట కొన్ని ఉదాహరణలుమాత్రము ఇచ్చుచున్నాను. ఉ. "రాహుర్వ్యయేచ యోగశ్చతాపహర్తా" అని చెప్పియున్నారు. రాహువు ద్వాదశమందున్నయెడల అనేక యోగములను ఖండించువాడని చెప్పియున్నారు. అట్లే "కేతౌ స్తృతీయసంస్థానం యోగోయంభవతీ ధ్రువం" "కేతుర్వ్యయసంస్థానం యోగోయం భవతిధ్రువం" అని పారాశర్యంలోగూడ చెప్పబడియున్నది. కేతువు తృతీయ ద్వాదశము లందున్నప్పుడు ఆ తృతీయ ద్వాదశాధిపతులయొక్క బలముతో నిమిత్తము లేకుండగనే రాజయోగమునిచ్చుచున్నాడు. అట్లే "శుక్రే కేతుయుతే భార్యాగర్భస్థాదుష్ప్రజాశన" మొదలగు విషయములు బృహస్పతిచే బార్హస్పత్యసంగ్రహమున వ్రాయబడినది. జైమినికూడ "కేతునా ప్రతిబంధకః॥" అనగా ఇతర గ్రహములు చేయు యోగమునకుగాని అవయోగమునకుగాని కేతువు ప్రతిబంధకము కలుగచేయు శక్తికలవాడని చెప్పియున్నాడు. అట్లే "రవిరాహుగురుభిః బహుపుత్రః" అని వ్రాసినాడు. అనగా రాహువు రవిగురులవలె స్వతంత్రముగా బహుపుత్రయోగము నిచ్చుచున్నాడని చెప్పినాడు. శాస్త్రమును శోధించిన ఇట్టివి అనేకములు కనిపించుచున్నవి. ఒక్కవిషయము మాత్రము గ్రంథకర్త అభిప్రాయముతో సరిపోవుచున్నది. రాహుకేతువులు ఇతర గ్రహములతో కలసినప్పుడుమాత్రము స్వతంత్రులుకాక వారితో కలసిన గ్రహములయొక్క ఆధిపత్య సంబంధమైన శుభాశుభములను మాత్రమే తీసుకొని వారితో కలసిన గ్రహములకంటె బలవంతమై సత్సంబంధ

మగు యోగమునుగాని అవయోగమునుగాని ఇచ్చెదరు. ఇచ్చట ఛాయాగ్రహములకును ఇతరగ్రహములకును భేదమేమి అని సందేహము కలుగవచ్చును. ఏ రాశియందైనను రెండుమూడు గ్రహములు కలసినప్పుడు ఈ గ్రహములు ఒకరి సంబంధమువలన మరియొకరు యోగావయోగముల నిచ్చుటకు బలవంతులగుదురు. కాని రాహు కేతువులు ఇతరగ్రహములతో కలసినప్పుడుమాత్ర మట్లు కాదు. ఇతర గ్రహములు రాహు కేతువుల సంబంధమువలన వీరి బలాబలములను తాము తీసికొనలేవు. కాని రాహు కేతువులు మాత్రము వీరి బలమును తీసికొనుచున్నారు.

ఉదాహరణము:-ధనుర్లగ్నమునకు కుజరాహువులు భాగ్యమున కలిసినారనుకొందము. అప్పుడు రాహువునకు సింహము మంచిరాశి అగుటచేతను వీనితో కలసిన కుజునకు కోణాధిపత్యదోషము పట్టినను కోణము కుజునకు చెడురాశి అయినను స్వతస్సిద్ధముగా శుభరాశి అగుటచేత కోణసంబంధమగు శుభమును మాత్రమే గ్రహించి, తత్సంబంధమగు శుభమును రాహువు ఇచ్చును. కుజుడుమాత్ర మవయోగమునిచ్చును, అచ్చటకుజుడుఆధిపత్య స్థితులవల్లఅవయోగము నిచ్చును, గనుక వీనితో కలసిన రాహువు అవయోగము నివ్వగలడని చెప్పుటతప్పు. ఇదేవిధముగా ఈ రాహు కేతువులు కేంద్రస్థానములయందు కేంద్రాధిపత్యముపట్టిన నైసర్గిక పాపులతో కలసియుండినయెడల చక్కని రాజయోగము నిచ్చుచున్నారు. ఇవే స్థిరరాసులు అయినయెడలను, పాపరాసులైనయెడలను, యోగము మరింత హెచ్చు. శుక్ర కేతువుల సంబంధము యోగభంగము. ఇది పాపస్థానములందైనయెడల మరింత హెచ్చు. శని కేతువుల సంబంధము యోగమునకు మంచిది. రాహు కేతువులకు చంద్రసంబంధము చాలామంచిది. వారిలో కేతువునకుకంటె రాహువునకు మరింత

బలము. ఈ చంద్రుడు కేంద్రకోణాధిపతియై రాహువుతో కలసి కేంద్రములందుండిన మంచియోగము. ఈ కేంద్రకోణములు మేష సింహము లైనయెడల మరింత యెక్కువ. రవికి కేంద్రాధిపత్యము పట్టి రాహువుతో కలసి కేంద్రకోణములలో నెక్కడనున్నను మంచి రాజయోగము నిచ్చెదరు. ఇట్లే ఇతర పాపగ్రహములకును జూచు కొనవలెను. వృశ్చిక లగ్నమునకు ద్వితీయమున గురు కేతువులు కలసిన మంచి ధనయోగము. వీరు కేంద్రకోణములందు కలసిన మంచిది. చాలమంది ద్వితీయమున కేతువుండిన ధనయోగమని వ్రాసినారు.

శ్లో॥ "కేంద్రత్రికోణ పతయస్సంబంధేన పరస్పరం
ఇతరై రప్రసక్తాశ్చే ద్విశేష శుభదాయకాః"

కేంద్రత్రికోణపతయః = కేంద్రములయొక్కయు, త్రికోణముల యొక్కయు అధిపతులు, ఇతరైః = ఇతరులగు 2-3-6-8-11-12 స్థానాధిపతులతో, అప్రసక్తాశ్చేత్ = సంబంధము లేనివారైనచో పరస్పరం = ఒకరొకరియొక్క, సంబంధేన = సంబంధము చేత, విశేష శుభదాయకాః = మిక్కిలి శుభము నిచ్చేవారు, భవంతి = అగు చున్నారు.

ఈ అభిప్రాయము అనుభవములో సర్వత్ర వర్తించదు. కొంత వరకుమాత్రమే సరిపోవును. ఇదివరలో చెప్పిన ప్రకారం నైసర్గిక పాపులగు రవి, శని, కుజులకు కేంద్రాధిపత్యము పట్టిన నైసర్గిక శుభులగు గురు, శుక్ర, బుధులకు కోణాధిపత్యము పట్టినప్పుడు వీరి పరస్పరసంబంధము అత్యంత రాజయోగము. ఇట్టి కేంద్ర కోణాధి పతులకు శ్లోకములో చెప్పిన 2-3-6-8-11-12 స్థానాధిపతుల సంబం ధము మంచిది కాదు. ఇంతవరకును గ్రంథకర్తయొక్క అభిప్రాయము సరిగానున్నది. కాని నైసర్గిక శుభులకు కేంద్రాధిపత్యము కలిగి

నైసర్గిక పాపులకు కోణాధిపత్యము కలిగినప్పుడు వీరి పరస్పర సంబంధము యోగమునివ్వదు. సరికదా, అవయోగము చేయును. అప్పుడు వీరికి పాపస్థానాధిపతుల సంబంధము మంచిది. అనగా వీరికి పాపుల సంబంధ ముండినగాని యోగము నివ్వరని అభిప్రాయము. కేంద్రకోణాధిపతుల పరస్పర సంబంధము యోగమని వ్రాయుటలో, గ్రంథకర్త అభిప్రాయము, కేంద్రాధిపత్యము పట్టినవారు నైసర్గిక పాపులును కోణాధిపత్యము పట్టినవారు నైసర్గిక శుభులును అయియుండవలెనని గ్రహించవలెను.

ఉదాహరణము:- ఈయోగము వృషభలగ్నమునకు రవి, కుజ, శనులకు కేంద్రాధిపత్యముపట్టును గనుక ఇట్టి రవి, కుజ, శనులు వారిలోవారు కలసి కేంద్రకోణములలో నెక్కడనున్నను మంచిది. వీరికి పంచమాధిపత్యముపట్టిన బుధసంబంధముకూడా మంచిది. వీరు పాపస్థానాధిపతులగు గురుచంద్రులతో కలసినను, పాపస్థానములందుండినను, అవయోగము. ఈ లగ్నమునకు ఒకవిశేషము కలదు. రవికి కేంద్రాధిపత్యముపట్టి బుధునకు కోణాధిపత్యము పట్టినను వీరి పరస్పరసంబంధము కేంద్రకోణములందంత యోగము నిచ్చుట లేదు. అనగా ఈబుధుడు శనికుజులతో కలసినప్పుడు ఇచ్చు యోగముకంటె, రవిబుధులు కలసినప్పుడు ఇచ్చుయోగము చాల తక్కువగానున్నది. సింహ లగ్నమునకు శుక్ర కుజుల సంబంధము కేంద్రకోణములం దవయోగము. వీరికి స్వక్షేత్రములైన మరింత ఎక్కువ. కర్కటక లగ్నమునకు శుక్రకుజుల సంబంధము తుల, వృశ్చిక, మీనములయం దవయోగము. ధనుర్లగ్నమునకు భాగ్యరాజ్యాధిపతుల సంబంధము కేంద్రకోణములందవయోగము. మేష లగ్నమునకు రవిశుక్రులు కేంద్రకోణములందు కలియుట మంచిది కాదు, అట్లే గురు బుధ కుజులు కేంద్రకోణములందు కలియుట

అవయోగము. కాని మిధున, ధనుర్లగ్నములకుమాత్రము ఒకవిశేషము కలదు. ధనుర్లగ్నమునకు గురు శనులు లగ్నమందు కలసినను, మిధున లగ్నమునకు సప్తమమందు కలసినను, యోగము నిచ్చుచున్నారు.

శ్లో॥ కేంద్రత్రికోణ నేతారౌ దోషయుక్తా వపిస్వయం
సంబంధమాత్రాద్బలినౌ భవేతాం యోగకారకౌ॥

కేంద్రత్రికోణ నేతారౌ= కేంద్రత్రికోణాధిపతులు. స్వయం= తాము స్వతస్సిద్ధముగా దోషయుక్తావపి=దోషముకలవారైనప్పటికిని (నైసర్గికశుభులకు కేంద్రాధిపత్యమును నైసర్గిక పాపులకు కోణాధిపత్యమును కలిగినప్పటికి) సంబంధమాత్రాత్ =(ఈ దోషమునకు ప్రతిబంధకముగా) పాపుల సంబంధము అనగా 3-6-8-12 స్థానాధిపతుల సంబంధమువలన, బలినౌ= యోగమునిచ్చుటకు బలవంతులై యోగకారకౌ= యోగము నిచ్చుచున్నారు. ఈశ్లోకమును, దీనికి పూర్వశ్లోకమును. కలిపి చదివినగాని గ్రంథకర్తయొక్క అభిప్రాయము అనుభవమునకు సరిపోదు. ఈశ్లోకమునకు ఇతరులు ఇంకొకవిధముగా అర్థము చెప్పుచున్నారు. అది ఎట్లనగా, బలవంతులైన కేంద్రకోణాధిపతులు ఆధిపత్యదోషముకలవారైనను పరస్పరసంబంధమువలన యోగము నిచ్చెదరని చెప్పుచున్నారు. బలవంతులైన కేంద్రకోణాధిపతులని చెప్పుటలో వీరిఅభిప్రాయమేది యోబోధపడుటలేదు. దోషయుక్తావపిస్వయం- అని చెప్పుమాటకుకూడా ఈ దోషము ఈ గ్రహమునకు ఆధిపత్యముచేతనా ? లేక సంబంధము వలననా? అనువిషయములు చర్చింపబడియుండలేదు. ఈ కారణము వలన నేను ఈ శ్లోకమునకు అర్థము అనుభవమునకు సరిపోవునట్లు చెప్పియున్నాను. ఈ శ్లోకముప్రకారము మేషలగ్నమునకురవి, మిధున, ధనుర్లగ్నములకు రవి, కుజ, శనులును, గురు, బుధులును

పాపస్థానస్థితులవలన, పాపస్థానాధిపతుల సంబంధ మాత్రముననుు, యోగము నిచ్చుచున్నారు. పాపులసంబంధము లేక యోగము నిచ్చుటలేదు. ఈవిషయమై అనేక ఉదాహారణములను ఇదివరలో ఇచ్చియుండుటచేత ఇచ్చట వ్రాసియుండలేదు.

శ్లో॥ నివసేతాం వ్యత్యయేన తావుభౌధర్మ కర్మణోః
ఏకత్రాన్య తరోవాపి వసేచ్చేద్యోగ కారకౌ॥
శ్లో॥ త్రికోణాధి పయోర్మధ్యే సంబంధో యేన కేనచిత్
కేంద్రాధిపస్యబలినో భవేద్యది సయోగకృత్ ॥

తావుభౌ=ఆనవమదశమాధిపతులు, ధర్మకర్మణోః=నవమ దశమస్థానములందు, వ్యత్యయేన=విపర్యయముగా, నివసేతాం= ఉన్నట్టయితే, అన్యతరః=నవమ దశమాధిపతులలో నొకడు, ఏకత్రవా=నవమదశమములలో నొకస్థానమందు, వసేచ్చేత్= ఉన్నట్లయినయెడల, యోకకారికౌ = యోగము నిచ్చేవారై, భవతః=అగుచున్నారు.

బలినః = బలవంతుడైన, కేంద్రాధిపస్య = కేంద్రాధిపతికి, త్రికోణాధిపయోర్మధ్యే = పంచమ నవమాధిపతులలో, యేన కేనచిత్=ఏ యొక్కరితోనైనను సంబంధము, భవేద్యది=కలిగిన యెడల, సః=ఆ సంబంధము, యోగ=రాజయోగమును, కృత్ = చేయును.

గ్రంథకర్త పైశ్లోకములలో రాజ్యాధిపతి రాజ్యమందు; భాగ్యాధి పతి భాగ్యమందు, ఈ భాగ్యరాజ్యాధిపతులకు పరివర్తనము, వీరిద్దరు కలసి భాగ్యరాజ్యములందెక్కడనున్నను; ఇతర రాసులలో నెక్కడనున్నను రాజయోగమని చెప్పుచున్నాడు. ఇతర కేంద్రాధి పతులుకూడ పంచమ నవమాధిపతుల సంబంధము ఏవిధముగా కల్గినను రాజయోగము నిచ్చునని చెప్పుచున్నాడు. భాగ్యరాజ్యాధి

పతుల సంబంధముగాని, కేంద్రకోణాధిపతుల సంబంధముగాని, ఎల్లప్పుడును మంచిది కాదనియును, కేంద్రాధిపతులు నైసర్గిక పాపులును, కోణాధిపతులు నైసర్గిక శుభులును అయినప్పుడు మాత్రమే గ్రంథకర్త యభిప్రాయమునకు సరిపోవుననియునుముందు వ్రాసిన శ్లోకములలో వ్రాసియున్నాను. అయినను కొన్ని ఉదాహరణములను మాత్రము ఇచ్చట చెప్పుచున్నాను.

ధనుర్లగ్నమునకు రవి బుధులు భాగ్య రాజ్యాధిపతులగుదురు. వీరు భాగ్యరాజ్యములందు ఎవరి ఇంటిలో వారున్నను, భాగ్యాధిపతి రాజ్యమందుండి, రాజ్యాధిపతి భాగ్యమందుండినను, వీరిద్దరు కలసి భాగ్యమందుగాని, రాజ్యమందుగాని యున్నను, వీరిద్దరు కలసి ఇతర కేంద్రకోణములలో నెక్కడనున్నను, వీరికి పంచమాధిపత్యము పట్టిన కుజునిసంబంధము పై రాసులలో నెక్కడ కలిగినను, లేక పంచమమందున్నను, ఈ భాగ్య రాజ్యాధిపతులు ఇతర కేంద్రాధిపతులతో కలసి కేంద్రకోణములలో నెక్కడనున్నను అత్యంత అవయోగము నిచ్చెదరు. వీరు పీఠిక మీద అవయోగము నిచ్చుటయేగాక, వీరి దశలయందుగూడ అవయోగము నిచ్చెదరు. ఇదేవిధముగా మీనలగ్నమునకు భాగ్యరాజ్యాధిపత్యముపట్టిన కుజగురులు పైవిధముగా నున్నయెడల అత్యంత అవయోగము నిచ్చెదరు. మేషలగ్నమునకు రవి శుక్రులు; సింహలగ్నమునకు శుక్ర కుజులు పైవిధముగానున్నప్పుడు యోగమునివ్వరు. ఈ కారణము వలన భాగ్యరాజ్యాధిపతుల కలయికలవల్ల రాజయోగము ఎల్లప్పుడును కలుగునని చెప్పుట చాల పొరపాటు. అనుభవమునకు వ్యతిరిక్తము.

ఇక కేంద్రకోణాధిపతుల యొక్కయు, భాగ్య రాజ్యాధిపతుల యొక్కయు సంబంధమువలన ఎట్లుమంచియోగము కలుగుచున్నదో

తెలియుటకు కొన్ని ఉదాహరణముల నిచ్చుచున్నాను. వృషభ లగ్నమునకు భాగ్య, రాజ్యాధిపత్యములు పట్టిన శని రాజ్యమందు గాని, ఇతర కేంద్రములందుగాని ఇతర కేంద్రాధిపతులతో కలసి యుండినగాని మంచిరాజయోగము. అట్లే కుంభలగ్నమునకు భాగ్య రాజ్యాధిపత్యముపట్టిన శుక్రకుజులు భాగ్యరాజ్యములందుగాని, పరివర్తనము గలిగిగాని, ఇతర కేంద్రాధిపతులతో గలసిగాని, పంచమాధిపతితో గలసిగాని యున్న యెడల మంచి రాజయోగము. ఇదేవిధముగా ఇతర లగ్నములకుకూడ చూచుకొనవలెను. ఈ భాగ్యరాజ్యాధిపతుల యోగవిషయమున కాళిదాసు ఒక విశేషాంశమును వ్రాసియున్నాడు.

యోగస్యా ప్యపయోగజస్య విమృతౌ తద్యోగ కర్త్రోర్ద్వయో
ర్మధ్యే గేప్యథపృష్ట తశ్చలఖగ స్తద్వాదశాంశాంతరే
ఈ పంశోన్యలవే భవేద్రమివేఖం చామపాదితాత్పలం
సూర్యాంశైశ్చల ఖేచర్తేగ్రలవ గేత్రత్రేష్ట విద్వాంసకః

ఇచ్చట కాళిదాసు భాగ్యరాజ్యాధిపతుల సంబంధముగాని, కేంద్రకోణాధిపతుల సంబంధముగాని, కలిగినప్పుడు ఈ కేంద్ర కోణాధిపతులలో నొకడు మందగ్రహమును, రెండవవాడు శీఘ్ర గ్రహమును అయి మందగ్రహము ముందును శీఘ్రగ్రహము వెనుకను ఉండినయెడల యోగమునిచ్చెదరు. వీరిద్దరికిని మధ్య 12 భాగలకంటె నెక్కువ తేడా యుండకూడదు. వీరిద్దరి మధ్యను చంద్రుడుండిన మంచియోగము. ఈయోగముకూడ ఎల్లప్పుడును సరిపోదు. వృషభలగ్నమునకు శనికుజులు రాజ్యమందుండి, అప్పుడు కుజుడు వెనుకను శని ముందును ఉండి. వీరిద్దరకు 12 భాగలుండిన యెడల అత్యంత రాజయోగము నిచ్చుచున్నారు. కాని ధనుర్లగ్నము నకు రవి బుధులు [illegible] రాజ్యములందుండి, వారు 12 భాగముల లోనుండి రవి [illegible] బుధుడు వెనుకను ఉన్నను యోగము

నిచ్చుటలేదు. అట్లే మీనలగ్నమునకు గురుకుజులు భాగ్యరాజ్యాధిపతులై భాగ్యమునందుగాని, రాజ్యమునందుగాని ఉంటే, వారిలో మందగ్రహాము గురుడు ముందును శీఘ్రగ్రహాము కుజుడు వెనుకను ఉండి వీరి మధ్య 12 భాగముల లోపుండినను యోగము నిచ్చుటలేదు. ఈ కారణమువలన నైసర్గిక, ఆధిపత్య, స్థితులవలన మాత్రమే యోగము నిర్ణయించవలెను. గాని ఇంకొక విధముగా నిర్ణయించినయెడల సరిగా సరిపడదు. కాళిదాసు ఈ యోగమే గాక విపరీత రాజయోగమునుగూడ వ్రాసియున్నాడు. అది యెట్లనగా షష్ఠ, అష్టమ, వ్యయాధిపతులు ముగ్గురును కలసిగాని, విడిగాగాని, తిరిగి షష్ఠాష్టమ వ్యయములలో నెక్కడనుండినను ఈ యోగము పట్టును. ఈమూడు గ్రహాములును ఒకేరాశిలో గాని, రెండు రాసులలోగాని, మూడురాసులలోగాని యుండవలెను. ఇది చక్కగా జరుగుచున్నది. ఈ విపరీత రాజయోగముకూడా చక్కగా చెప్పబడినది. కాని ఈ యోగమునకుకూడ పాపస్థానములందు శుక్ర కేతు సంబంధమువలన భంగము కలుగుచున్నది. పరాశరముని భాగ్య, రాజ్యాధిపతులకు ప్రాముఖ్యము, యోగవిషయమున ఇచ్చినట్లుగానె జైమినికూడ రాజయోగములకు లగ్న పంచమాధిపతులకు ఎక్కువ ప్రాముఖ్యము నిచ్చినాడు. ఇందుకు ప్రమాణము "సూ॥ అథరాజ జనితాభ్యాం యోగే యోగేలేయాన్మేపాధిపః" అనిచెప్పినాడు. దీని యర్థమేమనగా లేయాః లగ్నాధిపతియును మేపాధిపః = పంచమాధిపతియును, రాజయోగమునకు కారకులని యాతని యభిప్రాయము.

శ్లో॥ దశాస్వపిభవేద్యోగః ప్రాయశో యోగకారిణోః
దశాద్వయీ మధ్యగతః తదయుక్ఛ్భ[illegible]ణాం॥

యోగకారిణోః = రాజయోగమునిచ్చు [illegible]రెండు గ్రహాల యొక్క దశాద్వయీమధ్యగతః = రెండ[illegible]మధ్యనున్నట్టి,

తత్ = ఆ యోగ కారకులతో, అయుక్ = సంబంధము లేని గ్రహము శుభకారిణాధి = శుభమును చేయు గ్రహములయొక్క, దశాస్వపి = దశలయందు కూడా, ప్రాయశః = తఱుచుగ, యోగః = యోగము నిచ్చువాడుగా, భవేత్ = అగుచున్నాడు.

అట్లే రెండు రాజయోగ దశల మధ్యను వచ్చిన అవయోగ దశకూడ యోగమునిచ్చును.

ఇట్లే దీనికి వ్యతిరేకముగా రెండు అవయోగ కారక గ్రహ దశల నడుమ వచ్చిన బలవంతుడగు శుభకారక గ్రహదశకూడ యోగము నివ్వదు.

శ్లో॥ యోగకారక సంబంధాత్ పాపినోపి గ్రహాస్స్వతః
తత్తద్భుక్త్యనుసారేణ దిశేయుర్యౌగికం ఫలమ్॥

గ్రహాస్స్వతః = గ్రహములు తాము, పాపినోపి = తృతీయ షష్ఠాష్టమ వ్యయాధిపత్యములవలన పాపులైనప్పటికి, యోగకారక సంబంధాత్ = యోగమునిచ్చెడి గ్రహములయొక్క సంబంధము వలన, తత్తత్ = ఆయా గ్రహములయొక్క, భుక్త్యనుసారేణ = దశల ననుసరించి. యౌగికం = రాజయోగ సంబంధమయిన, ఫలం = ఫలమును, దిశేయుః = ఇచ్చెదరు.

ఈ శ్లోకమున గ్రంథకర్త గ్రహములు పాపాధిపత్యములు పట్టినప్పుడు అనగా 3-6-8-12 స్థానముల కధిపతులైనను యోగ గ్రహముల సంబంధమువలన మంచివారై యోగము నిచ్చెదరని వ్రాయుచున్నాడు. ఈ యోగగ్రహము లెవ్వరో మాత్రము చెప్పియుండలేదు. వీరు యోగగ్రహ సంబంధము లేనియెడలకూడ నెట్లు యోగమును, స్థితులవలన ఇవ్వగలరో, కూడ చెప్పియుండ లేదు. ఇంకను కొందరు "పాపినోపి గ్రహాస్స్వతః" అనగా రవి,

కుజ శనులు, స్వతస్సిద్ధముగ అనగా నైసర్గికముగ పాపులగుటచేత యోగ గ్రహసంబంధమువలన యోగమునిచ్చువారని వ్రాసినారు. గ్రంథకర్త యభిప్రాయము నైసర్గిక పాపులనికాదు. ఆధిపత్య పాపులనియే చెప్పుకొనవలెను. ఈకారణము వలన మొదట చెప్పిన అర్థము చాల చక్కగా నున్నది. ఈపాపాధిపత్యములు రవ్యాది సప్తగ్రహములకు ఎట్లువచ్చునో చెప్పి తరువాత స్థితి, సంబంధము వలన నెట్లు యోగావయోగములనిచ్చుచున్నారో వ్రాయు చున్నాను. రవి చంద్రులకు మాత్రము ఒకే యాధిపత్య ముండుట చేత వీరిని గురించి చెప్పుట అంత కష్టములేదు. తక్కినవారికి రెండాధిపత్యములు కలుగుటచేత పాపాధిపత్యముతో పాటు కేంద్రాధిపత్యముగాని, కోణాధిపత్యముగాని కూడ రావచ్చును. గ్రంథకర్త యభిప్రాయము ఇదికాదు. ఈయన యభిప్రాయము గ్రహములకు రెండాధిపత్యములుకూడ పాపాధిపత్యము లైనప్పుడు మాత్రమే గ్రహములు కేవలము పాపులగుదురు. కనుక అట్టివారిని గురించియే వ్రాసినాడు. గ్రహములకు కేంద్ర పాపాధిపత్యముగాని, కోణపాపాధిపత్యముగాని పట్టినప్పుడు ఎట్లు యోగావయోగముల నిచ్చెదరో ఇదివరలో వ్రాసియున్నాను. ఈ కారణమువలన మేషాది ద్వాదశ రాసుల విషయమున గ్రహములకు కేవలము పాపాధి పత్యము పట్టినప్పుడు మాత్రము ఎట్లుయోగము నివ్వగలరో చెప్పుచున్నాను.

సులభముగా గ్రహించుటకు ఈ క్రింది పట్టికలో మేషాది రాసులలో పాపస్థానాధిపతులగు గ్రహములను చూపుచున్నాను.

| | | |
|---|---|---|
| ( 1) మేషమునకు | బుధుడు | 3- 6 లకు |
| ( 2) వృషభమునకు | చంద్రుడు | 3- నకు |
| ,, | గురుడు | 8-11 లకు |

| | | | |
|---|---|---|---|
| ( 3) మిథునమునకు | రవి | 3- | నకు |
| ,, | కుజుడు | 6-11 | లకు |
| ( 4) కర్కటకమునకు | బుధుడు | 3-12 | లకు |
| ( 5) సింహామునకు | చంద్రుడు | 12 | నకు |
| ( 6) కన్యకు | కుజుడు | 3- 8 | లకు |
| ,, | రవి | 12 | నకు |
| ( 7) తులకు | గురుడు | 3- 6 | లకు |
| ( 8) వృశ్చికమునకు | బుధుడు | 8-11 | లకు |
| ( 9) ధనుర్లగ్నమునకు | శుక్రుడు | 6 11 | లకు |
| ,, | చంద్రుడు | 8- | నకు |
| (10) మకరమునకు | రవి | 8- | నకు |
| ,, | గురుడు | 3-12 | లకు |
| (11) కుంభమునకు | చంద్రుడు | 6- | నకు |
| (12) మీనమునకు | శుక్రుడు | 3- 8 | లకు |
| ,, | శని | 11-12 | లకు |
| ,, | రవి | 6- | నకు |

గ్రంథకర్త అభిప్రాయముప్రకారము మేషలగ్నమునకు కుజుడు అష్టమాధిపత్యముపట్టినను పాపిగాడు. ఇందుకు కారణము లగ్నాధిపత్యముకూడ నుండుటవలన. ఇట్లే ఇతరలగ్నములకుకూడ కేంద్రాధిపత్యములతోను పాపాధిపత్యములతోను కూడిన పాపాధిపతులను తీసికొనలేదు. ద్వితీయాధిపత్యమును గురించి ఇదివరలో చెప్పుట చేత 2-11- స్థానాధిపతులనుగూడ తీసికొనలేదు. గ్రంథకర్త ఈ పాపగ్రహములు కేంద్రాధిపతులతో కలసిన మాత్రముననే యోగమునిచ్చునని వ్రాసినాడుగాని, ఈ కలయిక కేంద్రకోణములయందా? లేక పాపస్థానములయందా? యను విషయములుకూడ

చెప్పియుండలేదు. ఇంకను ఈపాపులు నైసర్గిక శుభులైన నెట్లుండురు ? నైసర్గిక పాపులైన నెట్లుండురు ? అనువిషయముకూడ చెప్పియుండ లేదు. ఈకలయిక కేంద్రములయందయిన నెట్లుండును? కోణములయం దయిన నెట్లుండును ? అను విషయము కూడ ఆలోచించవలసి యున్నది.

మేషలగ్నమునకు బుధుడు 3-6 స్థానముల కధిపతి యగుటచేత పాపియగుచున్నాడు. ఇట్టి బుధుడు లగ్నాష్టమాధిపత్యము పట్టిన కుజునితో కలిసి 1-4-5-7 లందుండిన యోగించును, అప్పుడు కుజుడు కూడ ఈ బుధునితోబాటు యోగమునిచ్చును. ఈ బుధ కుజులలో కుజుడు బుధునికంటె ముందుండుట చాలమంచిది. బుధుడు ముందుండిన, కుజునికంటె నెక్కువ యోగము నిచ్చును. ఈ కుజ బుధులు కేంద్రములందు కోణములందుకంటె నెక్కువయోగము నిచ్చె దరు. ఈ కేంద్రములలో మకరమున కుజ బుధు లిద్దరును యోగము నివ్వరు. వీరు పాపస్థానములందు కలసిన అవయోగము. ఈ బుధుడు రవితో కలిసి కేంద్రములందుండిన మంచియోగము. రవి కూడ యోగము నిచ్చును. కోణములందంత యోగము చెప్ప కూడదు. అందునను భాగ్యకోణమునందు బుధుడు మాత్రము యోగమునిచ్చి, రవి యోగమునివ్వడు. లగ్న కేంద్రములందు కలిసిన రవికి ఉచ్ఛగాన రవిబుధులిద్దరును యోగమునివ్వరు. పాపస్థానము లందుకలసినప్పుడు రవిమాత్రము సామాన్యయోగమునిచ్చి బుధుడు కేవలము అవయోగమునిచ్చును. ఈలగ్నమునకు శనిబుధులు కేంద్ర కోణములందు కలియుటమంచిది. ఇద్దరును రాజయోగము నిచ్చె దరు. ఈ శని బుధులకు రవికుజుల సంబంధము మంచిది కాదు. అందు ముఖ్యముగా కుజ సంబంధము ఎక్కువ అవయోగకరము. ఈ శని బుధులు మాత్రము కోణములందు కలిసినను యోగము

నిచ్చెదరు. కాని కేంద్రములందుకంటె తక్కువ. కేంద్రములలో మేష, కర్కటక, మకరములం దెక్కువయోగము నిచ్చెదరు. తుల యందు బహు సామాన్యము. ఈశని బుధులు రవి గురులతో కలిసి భాగ్యలాభము లందుండిన ధనయోగమునకు చాలమంచిది. వీరు పాపస్థానములందు యోగమునివ్వరు.

వృషభమునకు తృతీయాధిపత్యము పట్టిన చంద్రుడు పూర్ణబల వంతుడై నయెడల (అనగా శుద్ధ5-మొదలు బ॥10-వరకు) కేంద్రము లందుండుట మంచిది. ఇచ్చట గురు చంద్రుల కలియకకూడ చాల మంచిది. ఇట్టి గురుచంద్రులు కేంద్రాధిపతులగు రవి, కుజ, శను లతో కలిసి కేంద్రములందుండినను మంచియోగము నిచ్చెదరు. ఈలగ్నమునకు కలిసి యుండుటకంటె, కలియక యుండుట మరింత యెక్కువయోగము. ఈ గురుచంద్రుల కలయికవలన, రవి కుజ శనులయోగము కొంతతగ్గును. కోణములందు కలిసినను యోగము నిచ్చెదరుగాని కేంద్రములందుకంటె తక్కువ. ఈ లగ్నమునకు శని గురులుమాత్రము పంచమమందు కలిసినయెడల యోగమునివ్వరు. మకరమునందుకూడ అంతయోగము నిచ్చుటలేదు. వీరు పాప స్థానములం దున్నయెడల అవయోగము. ఈ లగ్నమునకు గురుడు గాని చంద్రుడుగాని ద్వితీయమందుండిన సామాన్యయోగము. ఈ లగ్నమునకు శుక్రుడు, గురు చంద్రులతో కలిసి కేంద్రకోణములం దుండుట మంచిది. కోణములందును మంచివారు. ఈ గురుచంద్రులు ధన పంచమాధిపత్యముపట్టిన బుధునితో కలసి కేంద్రకోణములలో నెక్కడనున్నను మంచియోగము నిచ్చెదరు. గురు డొక్కడును పంచమమందుండిన యోగించకపోయినను బుధునితో కలసినప్పుడు మాత్రము కొంత యోగము చేయుచున్నాడు.

మిథునలగ్నమునకు :-ఈ లగ్నమునకు రవికి తృతీయాధిపత్యము ఒక్కటిమాత్రమే వచ్చుటచేత కేంద్రకోణములలో నెక్కడనున్నను యోగమునిచ్చును. ఈ రవి బుధునితో కలిసి కేంద్రములందుండిన ఇద్దరు యోగమునిచ్చెదరు. వీరు కలయిక విద్యావిషయమున మాత్రము కొంతవరకు జబ్బు. ఈ రవి ఒక్కడు కేంద్రమునందును, బుధుడు పాపస్థానములందును నుండుట, కలియుటకంటెను నెక్కువ యోగప్రదము. ఈరవి పాపస్థానములందు యోగింపడు. ఈరవితో కలసిన శని కేంద్రములందుండిన కొంతవరకు యోగము నిచ్చును. పాపస్థానములందు అవయోగము నిచ్చును. ఒక శని మాత్రము మేషమునందు యోగమునిచ్చును ఈ రవితో కలిసిన గురుడు కేంద్రములందుండిన సామాన్యము. వీరు పాపస్థానములందు కలసిన యెడల గురుడుమాత్రము యోగము నిచ్చును. రవి యోగము నివ్వడు. రవిశుక్రులు కేంద్రకోణములందు కలిసినయెడల ఇద్దరును యోగమునిచ్చెదరు. కాని రవి ఎక్కువ యోగమును, శుక్రుడు సామాన్యయోగమును నిచ్చెదరు. ఈ లగ్నమునకు రవికుజులు కలిసి పాపస్థానములందుండిన ఇద్దరును అవయోగము నిచ్చెదరు. ఈ రవి కుజులు శనితో కలిసి కేంద్ర కోణములందుండిన మంచివారు. కోణములందు శనికుజులు యోగమునివ్వరు. ఈ కుజుడు, గురు బుధులతో కలసి కేంద్రకోణములందుండినయెడల తాను యోగమునిచ్చి గురుబుధులను కూడా బాగుచేయును. కుజ బుధులు చంద్రునితో కలసి ఏకాదశమందుండుట ధనయోగము, ఈ కుజునకు చంద్ర శుక్రులు కలిసినయెడల ధనయోగమని చెప్పవలెను. ఈ కుజునకు చంద్ర శను లేకాదశమందు మరి యెవ్వరితోను కలియక యున్న యెడల ధనయోగము. ఈ కుజుడు శుక్రునితో కలసి కేంద్రములందుండినను మంచియోగము. కుజునికంటె శుక్రునికి ఎక్కువ యోగము. ఈ కుజ శుక్రులకు క్షేత్ర సంబంధము అవయోగము.

కర్కాటక లగ్నమునకు :- ఈ లగ్నమునకు తృతీయ వ్యయాధిపత్యము పట్టిన బుధుడు ఒక్కడు కేంద్రకోణములందు మంచివాడు. వానికి గురుసంబంధము ఇచ్చుట మంచిది. పాపస్థానములందు ఇద్దరును అవయోగము నిచ్చెదరు. ఈ బుధునకు శుక్రసంబంధము కేంద్రములందు కలిగినయెడల బుధుడు మాత్రము యోగము చేసి, శుక్రుడు అంత యోగమునివ్వడు. పాపస్థానములందు కలిసినయెడల శుక్రుడు మంచివాడై బుధుడు యోగమునివ్వడు. బుధ చంద్రులు కేంద్రకోణములందుండిన మంచివారు. బుధశనులు కేంద్రములందు కలియుట మంచిది. ఈ లగ్నమునకు బుధ కుజులు కేంద్రములందు కలిసిన మంచి యోగము నిచ్చెదరు. ఇది మేష మయినయెడల మరింత యెక్కువ యోగము. గురు బుధులు కలిసిన యెడల కోణములందుకంటె కేంద్రములందు ఎక్కువ యోగము. వీరిద్దరు కలిసి పాపస్థానములందుండిన ఇద్దరును అవయోగము నిచ్చెదరు.

సింహలగ్నమునకు :- ఈ లగ్నమునకు వ్యయాధిపత్యము పట్టిన చంద్రుడు కేంద్రకోణములం దెక్కడనున్నను మంచియోగము. వీనికి గురు శుక్ర శనులలో నెవ్వరితోడి కలయికయైనను కేంద్రములందు మంచిది. వృషభమున మాత్రము మంచిది కాదు. ఈ చంద్రునితో బుధుడు కలిసి కేంద్రకోణము లందుండిన మంచివాడు. కాని ధన వ్యయము మాత్రము ఎక్కువగానుండును. ఈలగ్నమునకు రవి కుజ శని చంద్రులు కేంద్రములందు కలిసినయెడల అత్యంత యోగము.

కన్యాలగ్నమునకు:- ఈలగ్నమునకు రవి ద్వాదశాధిపతియగును. కుజుడు తృతీయాష్టమాధిపతి యగును. ఈ రవి కుజులు కేంద్రములందుండిన కొంతవరకు యోగము నిచ్చెదరు. కోణములందుకూడ మంచివారు, పాపస్థానములం దవయోగము. ఈ లగ్నమునకు రవి,

బుధ, గురులతో కలిసి కేంద్రకోణములం దెక్కడ నున్నను మంచివాడు. పాపస్థానములందు కలిసినయెడల గురు బుధులు మాత్రము యోగమునిచ్చిరవి యోగమునివ్వడు. రవితో కలియని గురుబుధులు మాత్రము పాపస్థానములందు మంచి రాజయోగము నిచ్చెదరు. ఈ లగ్నమునకు రవి, బుధ, కుజ, శుక్ర శనులు కలిసిన మంచిదికాదు. ఈ లగ్నమునకు కుజ సంబంధము ఏ రాశియందయినను అంత మంచిదికాదు. కుజుడు ఒక్కడు కేంద్రములందుండిన మంచివాడు. ఈ కుజుడు తృతీయమునందుండిన భాతృవృద్ధి. ఇది ఈ లగ్నమునకు విశేషము.

తులాలగ్నమునకు:- ఈలగ్నమునకు గురుడు తృతీయ షష్ఠాధిపతి యగును. ఈ గురుడు 3-6 ఆధిపత్యముల చేత పూర్వ శుభుడుగా అనేక గ్రంథకర్తలచేత చెప్పబడినాడు. గ్రంథకర్త అభిప్రాయము ప్రకారము ఈ గురుని పాపిగా తీసికొనగూడదు. ఈ గురుడు కేంద్రములందు మంచివాడు. కోణములందు కొంత తక్కువ. ఈ గురుడు ద్వితీయమందుండిన ధనయోగమునకు కొంతవరకు మంచివాడు. ఈలగ్నమునకు గురు కుజుల సంబంధము కేంద్రకోణములందు మంచిది. వీరికి బుధ సంబంధమువలన కూడ మంచి యోగము చెప్పవలెను.

వృశ్చికలగ్నమునకు :- బుధుడు ఈ లగ్నమునకు అష్టమ లాభాధిపతియగును. ఇట్టి బుధుడు కేంద్రకోణములందు మంచివాడు. వీనికి శుక్రసంబంధము ఇచ్చట మంచిది. కాని శుక్రుడుఅంతయోగము నివ్వడు. కాని బుధ సంబంధమువలన కొంతవరకు మంచివాడగును. వీరు సప్తమ కేంద్రమునందు కలిసినయెడల శుక్రుడు యోగము నివ్వడు. బుధుడు మాత్రము యోగము నిచ్చును. ఈలగ్నమునకు గురు బుధులు కలిసి కేంద్రకోణములం దెక్కడనున్నను మంచిది.

పాపస్థానములందు ఇద్దఱను అవయోగము నిచ్చెదరు. అట్లే చంద్ర బుధులు కలిసి కర్కాటకమునందు తప్ప ఇతర కేంద్రకోణములందుండిన యోగము నిచ్చెదరు. ఈ బుధునకు రవి శని కుజుల సంబంధము కల్గిన బుధుడు మంచియోగము నిచ్చును. ఈబుధ సంబంధమువలన వీరికి మాత్రము కొంత యోగము తగ్గును. ఈ లగ్నమునకు రవి శని కుజులు బుధునితో కలిసి పాపస్థానములందుండిన అవయోగము నిచ్చెదరు. జాతకునికి పీఠికమీదనున్న యోగముకూడా చెడిపోవును.

ధనుర్లగ్నమునకు :- ఈ లగ్నమునకు చంద్రు డష్టమాధిపతి యగును. ఇట్టి చంద్రుడు కేంద్రకోణములందు మంచివాడు. ఈ చంద్రుడు పూర్ణుడయిన యెడల ద్వాదశే మందుండినను యోగము నిచ్చును. కాని భావసంబంధమగు ''పితృవు'' నకు జబ్బు, ధనవ్యయము, కుటుంబ కలహము, కళత్రమునకు జబ్బు మొదలగునవి మాత్రము చేయగలడు. ఈలగ్నమునకు బుధగురులు చంద్రునితో కలిసి కేంద్రములందుండిన చంద్ర సంబంధముచేత కొంతవరకు బాగుపడుదురు. చంద్రుడు మాత్రము మంచివాడగును ఈచంద్రునకు రవి సంబంధము అంత మంచిది కాదు. రవిమాత్రము యోగమునిచ్చును. వీడు మేషమునందు మాత్రము యోగము నివ్వడు. ఈ చంద్రునకు, కుజసంబంధము కేంద్రకోణములందు మంచిది. కుజుడు మాత్రము యోగము నివ్వడు. ఈ లగ్నమునకు శని చంద్రులు పాపస్థానములందు కలియుట అవయోగము. వీరు కేంద్రములందు మంచివారు.

ఈ లగ్నమునకు శుక్రుడు 6–11 స్థానముల కధిపతియగును. ఇట్టి శుక్రుడు ఎవ్వరితోను కలియక కేంద్రకోణములం దెక్కడ నున్నను మంచి యోగమునిచ్చును. అందున కోణములకంటె

కేంద్రములందు ఎక్కువ. నీచమయినను కుజ గ్రహ దెక్కణమునందు మంచివాడు. వీనికి గురుబుధుల సంబంధము వలన గురు, రవి బుధులు కొంత మంచి వారగుదురు. శుక్రుడు సామాన్య యోగమును నిచ్చును. శుక్రచంద్రు లిద్దరును కలిసి కేంద్రములందుండిన మంచి రెళను యోగము నిచ్చెదరు. ఈ శుక్రుడు రవితో కలిసినప్పుడు రవి సామాన్య యోగము నిచ్చును. వీరు పాపస్థానములందు కలిసిన యెడల రవి మంచివాడై శుక్రుడు యోగము నివ్వడు. కుజ శుక్రుల సంబంధత్వమును రవి శుక్రుల సంబంధమువలెనే చూచుకొనవలెను. శని శుక్రుల సం... యో కేంద్రములందు మంచిది. ఇద్దరును యోగమునిచ్చెదరు. శని ఒక్కడును కేంద్రకోణములందుండుట మంచిది. ఏకాదశమునందు మాత్రము రవితో కలిసినప్పుడు ఇద్దరును యోగము నిచ్చెదరు. గురుబుధు లిద్దరును పాపస్థానములందుండి యోగము నిచ్చువారై నప్పుడు పాపస్థానములందున్నను పైశ్లోకము ప్రకారము యోగ భంగము చేయక మంచి యోగమునే యిచ్చెదరు. ఈ లగ్నమునకు శని గురులు కలిసి లగ్న కేంద్రమునందుండిన మంచివారు. బుధ శనులు కలిసినను మంచివారే కాని గురు శనుల సంబంధముకంటె తక్కువ యోగము.

మకరలగ్నమునకు:- ఈలగ్నమునకు రవి అష్టమాధిపతియగును. ఇట్టి రవి కేంద్రములందుగాని, కోణములందుగాని, మంచివాడు. పాపస్థానములందు యోగము నివ్వడు. ఈ రవి రాజ్యాధిపత్యము పట్టిన శుక్రునితో కలిసి కేంద్రములందుండిన శుక్రునిదోషము కొంత తగ్గించి తాను కొంతవరకు శుభుడై యోగము చేయును. ఈలగ్నము నకు రవి బుధులు విడిపోవుట చాలమంచిది. ఈ రవి, గురుబుధు లతో కలిసి పాపస్థానములందున్నప్పుడు మంచిదికాదు. వీరితో కలిసినను కేంద్రములందుండుట మంచిది. కోణములందు కొంత

తక్కువ. ఈ రవి యోగకారక గ్రహములగు కుజబుధులతో కలిసి పాపస్థానములందుండిన యెడల అవయోగము. వీరందరును కేంద్రము లందుగాని, కోణములందుగాని యుండుట చాలమంచిది. ఈరవితో కుజుని సంబంధము కుజునకు కొంత యోగము తగ్గించును. పాప స్థానములందు కలిసిన యెడల పూర్తిగా నవయోగ మిచ్చెదరు. ఈ లగ్నమునకు తృతీయ వ్యయాధిపత్యములు పట్టిన గురుడు కేంద్ర కోణస్థితులు కలిగినప్పుడు మంచియోగము నిచ్చును. కోణములందు సామాన్యము. కేంద్రములందు కూడ దశమ కేంద్రమునందు సామాన్య యోగము. ఈ గురుడు కుజునితో కలిసి కేంద్రములం దుండిన నిద్దరును మంచియోగము నిచ్చెదరు. మకరమునందు మాత్రము కలియకూడదు. గురు డొక్కడుండుట మంచిది. ఈ లగ్నమునకు గురుడు మేషమందుండి, కుజుడు లగ్న కేంద్రమునం దుండిన నిద్దరును యోగమునిచ్చుటలేదు. మకరమందు కుజుడుండని యెడల గురుడు యోగమునిచ్చును. అట్లే గురుడు సప్తమమందుండి, లగ్నమునందున్న కుజ దృష్టి గురునకు కలిగిన యెడల యోగము చెడును. ఈ లగ్నమునకు రవి బుధ గురులు షష్ఠాష్టమ వ్యయము లందు కలిసిన యెడల విపరీత రాజయోగము పట్టి యోగము నిచ్చు చున్నారు. ఈ లగ్నమునకు కేంద్రములందు (తుల తప్ప) గురు శుక్రులు కలిసిన యెడల గురుడు మంచియోగము నిచ్చి శుక్రుడు సామాన్యముగా నుండును. ఈ లగ్నమునకు రవి గురులతో కలి యని కుజ బుధులు కేంద్రకోణములందు (మకరము తప్ప) మంచి యోగము నిచ్చెదరు. వారికి చంద్రసంబంధము కూడ మంచిది. ఈ లగ్నమునకు చంద్ర గురుల సంబంధము కర్కాటకమున తప్ప ఇతర కేంద్రములందు మంచిది.

కుంభలగ్నమునకు :- ఈ లగ్నమునకు చంద్రుడు షష్ఠాధిపతి యగును. ఈ చంద్రునకు ఒకే ఆధిపత్య మగుటచేత కేంద్రములం

దెక్కడనున్నను మంచియోగము. పాపస్థానములందు అవయోగము. వీనికి కేంద్రకోణాధిపత్యములు పట్టిన శుక్రసంబంధము కేంద్రములందు మంచిది. ఈ చంద్రుడు ధనలాభాధిపతి యగు గురునితో కలిసి కేంద్రములం దెక్కడనున్నను చాలామంచిది. ధన విషయమునమాత్రము కొంతతక్కువ. వీరిద్దరు కలిసి పాపస్థానములం దెక్కడనున్నను ఇద్దరును అవయోగము నిచ్చెదరు. ఈ లగ్నమునకు చంద్ర బుధులు పంచమమందు కలిసినయెడల సామాన్య యోగము మాత్రము నిచ్చుచున్నారు. ఈ చంద్రుడు రవి, శని కుజులతో కలిసి కేంద్రకోణములందుండిన అత్యంత రాజయోగము. ఈ యోగము గురుబుధ శుక్రులతో కలిసిన దానికంటె చాల యెక్కువ. ఈ చంద్రునితో కలియని రవి, శని, కుజులు కేంద్రములందు కలిసినప్పుడుకంటె ఎక్కువ యోగము నిచ్చెదరు. వీరు పాపస్థానములందు చంద్రునితో కలిసినయెడల అవయోగము నిచ్చెదరు.

మీనలగ్నమునకు :-ఈ లగ్నమునకు రవి షష్ఠాధిపతి యగును. ఈ రవి సప్తమ కేంద్రమునందు సామాన్యయోగము నిచ్చి, ఇతర కేంద్రములందు మంచియోగము నిచ్చుచున్నాడు. ఈ రవి పాపస్థానములందుండిన యోగమునివ్వడు. ఈ రవి కేంద్రాధిపతులగు గురు బుధులతో కలిసినయెడల వీరిదోషము కొంత తగ్గును. ఈ దోషము గురునకుకంటె బుధునకు ఎక్కువతగ్గును. ఈ లగ్నమునకు రవి కుజులు కలిసి కేంద్రములందుండిన కుజుని దోషము కూడ చాలవరకు తగ్గి ఇద్దరును యోగమునిచ్చెదరు. కోణములందు కుజుడు యోగమునివ్వడు. ఈ లగ్నమునకు శనికి లాభ వ్యయాధిపత్యములు పట్టును. ఈ శని కేంద్రకోణములందు మంచివాడు. ఈ రవి శనులు, కలిసి కేంద్రములందుండిన మంచివారు ఈ లగ్నమునకు గురు,

శనులు కేంద్రములందుండి కలిసినను కొంత యోగము నిచ్చుచున్నారు. ఈ లగ్నమునకు శని, శుక్రులు రవితో కలియకుండుట మంచిది. ఈ రవి శనులు చంద్రునితో కలిసినయెడల చంద్రుడు యోగము నివ్వడు.

శ్లో॥ యది కేంద్రే త్రికోణేవా నివసేతాం తమోగ్రహా
నాన్యతరస్యైవసంబంధాద్యోగకారకౌ॥

కేంద్రేవా = కేంద్రమునందుగాని, త్రికోణేవ = పంచమ నవమములందుగాని, తమోగ్రహా = రాహు కేతువులు, నివసేతాం యది = ఉండినట్లయితే, అన్యతరస్య = ఇతర కేంద్ర కోణముల యొక్క, నాథేన = అధిపతితోడి, సంబంధాత్ = సంబంధము (కలయిక, దృష్టుల) వలన, యోగకారకౌ = యోగము నిచ్చువారు, అనగా రాహు కేతువులు కేంద్ర కోణములందుండినప్పుడు ఇతర కేంద్ర కోణాధిపతులలో నెవ్వరితోడనైనను సంబంధము కలవారైనచో రాజయోగము నిచ్చెదరని చెప్పుచున్నారు. ఇందుకు వ్యాఖ్యాతలు కేంద్రములందున్న రాహు కేతువులకు కోణాధిపతుల సంబంధముగాని, దృష్టిగాని యుండవలయుననియును, కోణములందున్న రాహు కేతువులకు కేంద్రాధిపతుల సంబంధమున్న మాత్రముననే యోగమునిచ్చెదరని చెప్పుచున్నారు. ఇంకను కేంద్రములందున్నప్పుడు కేంద్రాధిపతుల సంబంధము కలిగిన యోగము నివ్వరనియును, కోణములందున్నప్పుడు కోణాధిపతుల సంబంధమువలన యోగము నివ్వరనియును చెప్పుచున్నారు. ఈ అర్థము అనుభవమునకు సరిపడుటలేదు. కేంద్ర కోణాధిపతులతోనే గాక ఇతర పాపాధిపతులతోకూడ సంబంధము యోగప్రదమని గ్రహింపవలెను. ఇంకొక ముఖ్యాంశ మీ విషయమున తెలిసికొనవలసియున్నది. ఛాయాగ్రహములగు రాహు కేతువులు ఒకవిధ

ముగా యోగముకుగాని అవయోగమునుగాని ఇచ్చెదరనుట చాల తప్పు. రాహు కేతువులకు యోగము నిర్ణయించుటలో అనేక విషయములు కలవు. (1) రాహువునకు చెప్పినట్లుగా కేతువునకు యోగము చెప్పరాదు. (2) రాహు కేతువులు కేంద్ర కోణేతర స్థానములందు యోగము చేయుదురా? లేదా? యను విషయము (3) ఈ స్థానములు నైసర్గిక పాపుల ఇండ్లయినయెడల ఎట్లుండును? నైసర్గిక శుభరాసులైనయెడల ఎట్లుండును? (4) రాహువు, కేతువును నైసర్గికముచేతను, దశా ప్రమాణములచేతను సమాన బలములు కలవారా? కారా? యను విషయము. (5) వీరు మిశ్రమ రాసులగు ద్వితీయైకాదశములందుండినప్పు డెట్లుండెదరు? (6) వీరీ స్థానములలో నెక్కడనున్నను, వీరికి ఉచ్చ నీచ గ్రహముల సంబంధమువలన ఎవరెట్లు మారెదరు? మొదలుగాగల విషయముల నిందు పొందుపరచుచున్నాను. రాహు కేతువులు సామాన్యముగా కేంద్ర కోణములందుండిన మంచివారు. వీరికి కేంద్ర కోణాధిపతుల సంబంధముకూడ మంచిదే. (కాని కేంద్రమందున్న రాహు కేతువులు కోణాధిపతుల సంబంధమువలన కోణమందున్న రాహు కేతువులు కేంద్రాధిపతుల సంబంధమువలనగాని యోగము చేయరనుట తప్పు. కారణ మేమనగా కేంద్ర కోణరాసులు శుభ స్థానములు గనుక అచ్చటనున్న రాహు కేతువులు మంచివారనుట సరిగానేయున్నది. ఇదియును అనుభవములో ఎల్లప్పుడును సరిగా నుండుటలేదు.) మిథున, కన్యా, ధనుర్మీనములు లగ్నములైనప్పుడు గురు, బుధులకును; మకరము లగ్నమైనచో శుక్రునకును; కర్కటక, సింహములు లగ్నమైనప్పుడు కుజునకును, కేంద్ర కోణాధిపత్యములేగాని, పాపాధిపత్యములు పట్టవు. ఒకే యాధిపత్యము గలిగిన రవి, చంద్రులకు కేంద్ర, కోణాధిపత్యము పట్టినప్పుడు పాపాధిపత్యము పట్టదు. ఇతర లగ్నముల విషయమున గ్రహములకు కేంద్ర కోణాధిపత్యములతో పాటు పాపాధిపత్యముగూడ కలు

గును. అట్టి ఉభయాధి (శుభ. పాప) పత్యములు గల గ్రహము లతో సంబంధము గల్గిన రాహు కేతువులు ఎట్లు యోగము నిచ్చెదరను విషయముకూడ చూడవలెను. రాహు కేతువు లిద్దరును తమోగ్రహములుగా జెప్పబడినను నైసర్గికముచేతను ఆధిపత్య, స్థితి సంబంధములచేతను వీరు ఒకే విధముగా యోగావ యోగముల నిచ్చుటలేదని అనుభవములో ప్రతివారికిని తెలిసిన విషయమే. ఈకారణమువలన యోగముగాని అవయోగముగాని నిర్ణయించు టలో వేరువేరుగా చూచుకొనవలెను. ఇందువలననే జైమినిమహర్షి "విపరీతం కేతోః" అని చెప్పినాడు. అనగా రాహువువలె గాక విరుద్ధముగా కేతువు కోణములందున్నప్పుడు ఇతర పాపగ్రహముల వలె గాక నైసర్గిక శుభులవలె జూచుకొని యోగము చెప్పుకొన వలెనని చెప్పియున్నాడు. ఇంకను అనేకులు రాహు కేతువులకు వేరువేరుగా చెప్పినారు. ఈ కారణమువలన ముందు రాహువు ఏలగ్నమున కెట్లు యోగము చేయునో చెప్పి తరువాత కేతువునకు చెప్పుచున్నాను.

మేషలగ్నమునకు :- ఈలగ్నమునకు రాహువు కుజునితో కలిసి మేష కర్కాటకములందుండిన మంచిది. తులయందుసామాన్యము. మకరమందు అంత యోగము చెప్పకూడదు. సింహమందు మంచివారు. ధనస్సునందు అంతకంటె తక్కువ. ఈ లగ్నమునకు రాహువు అష్టమమందు తప్ప ఇతర పాపస్థానములందుండినను ద్వితీయమునందున్నను అంత యోగము నిచ్చుటలేదు. ఇట్లే ఈ లగ్నమునకు గురు రాహువులు కేంద్ర కోణములందు కలిసిన. మంచివారు. వీనికి బుధ సంబంధము మంచిది కాదు, శుక్ర రాహువులు కలిసినప్పుడు మాత్రము సప్తమమందు సామాన్యముగానుండి ఇతర కేంద్రములందు మంచివారుగానున్నారు.

ఈ లగ్నమునకు కేతువు కేంద్ర కోణములందు మంచి యోగము నిచ్చును. వీనికి చంద్రసంబంధమువలన యోగము కొంచెము తగ్గును. వీనికి శుక్రసంబంధమువలన ఇతర గ్రహావస్థలయొక్క యోగముకూడ తగ్గింపబడును. పాపస్థానములందు మరింత అవ యోగము. ఈ కేతువు 3-12 స్థానములందు చాలా మంచి యోగము నిచ్చును. ఈ విషయమున రాహువిచ్చే దానికి కేతువు వ్యతిరేక ఫలము నిచ్చును. కోణములందున్న కేతువు రాహువుకంటె నెక్కువయోగము నిచ్చును. ఏకాదశమందున్న కేతువు యోగము నివ్వడు. ఏకాదశమందునున్న రాహువు యోగమునిచ్చును.

వృషభలగ్నమునకు :- కేంద్రములందున్న రాహువు అత్యంత రాజయోగమునిచ్చును. ఇట్టి రాహువునకు నైసర్గిక పాపులగు రవి, కుజ, శనుల సంబంధము కలిగినయెడల మరింత రాజయోగము. ఈ రాహువు ద్వితీయమందున్నను, వారితో కలిసియున్నను అంత కంటె యోగము చాల తక్కువ. రాహువు కోణములందు పైవిధముగా కలిసినయెడల కేంద్రములందుకంటె చాల తక్కువ యోగము వారిచ్చెదరు. ఈలగ్నమునకు అష్టమ, లాభ వ్యయము లందున్న రాహువుకూడ యోగము నిచ్చుచున్నాడు. షష్ఠమమందు బహు సామాన్యము. ఈ లగ్నమునకు కేతువు వ్యయమందును, తృతీయమందును, ద్వాదశమందును, కేంద్రములందును యోగము నిచ్చును. వీనికి లగ్నాధిపత్యముపట్టిన శుక్రసంబంధము అత్యంత అవయోగకరము. రాహుకేతువు లిద్దరకును గురు సంబంధము మంచిది కాదు. అందులో కేతువుకంటె రాహునకెక్కువ జబ్బు. ఈలగ్నమునకు రవి బుధులతో కలిసిన కేతువు అంతయోగము నివ్వడు.

మిధునలగ్నమునకు:- రాహు కేతువు శ్రేగ్రహముతోను కలియక కేంద్ర కోణములందున్నయెడల మంచివారు. వీరికి నైసర్గికపాపుల

సంబంధము అంత మంచిదికాదు. నైసర్గిక శుభుల సంబంధము మంచిది. ఇట్టి సంబంధమువలన వీరితో కలిసిన గ్రహములు యోగము తక్కువచేసి రాహు కేతువులు మాత్రము యోగము నిచ్చెదరు. ఈలగ్నమునకు ద్వితీయమందున్న రాహువు సామాన్య యోగము నిచ్చును. ఏకాదశమందు చాలమంచివాడు. కేతువు ఏకాదశమందు ఒక్కడును ఉన్నయెడల యోగమునివ్వడు. వీనికి లాభాధిపత్యము పట్టిన కుజసంబంధము మంచిది. ఈ లగ్నమునకు శుక్ర కేతువులు పాపస్థానములందు అత్యంత అవయోగము నిచ్చెదరు. కేంద్రములందు అంత అవయోగము చేయరు.

కర్కటలగ్నమునకు :- ఈ లగ్నమునకు కేంద్ర కోణములందు రాహుకేతువులు గురునితో కలిసిన మంచియోగము నిచ్చెదరు. శుక్రునితో కలిసిన రాహువుకూడ యోగమునిచ్చును. ఈయోగము గురు రాహువులు కలియుటకంటె తక్కువ. ఈ లగ్నమునకు రవి రాహువుల సంబంధము సామాన్యము. ఈ లగ్నమునకు చంద్ర రాహు సంబంధము కేంద్రములందుమంచిది. చంద్ర కేతు సంబంధమును నష్టే. చంద్రరాహువుల సంబంధముకంటె, చంద్రకేతుసంబంధము ఎక్కువ మంచిది. ఈ లగ్నమునకు, రాహు కేతువులకు, కుజ, శనుల సంబంధము కేంద్రకోణములందు మంచిది. అందులో మేషమునందు కుజ రాహువులును, మకరమునందు శనిరాహువులు గాని, శని కేతువులుగాని కలిసిన మరింత మంచిది. ఈ రాహు కేతువులు ఎవ్వరితోను కలియక కేంద్ర కోణములం దుండినను యోగమునిచ్చెదరు. ఈ రాహు కేతువులు నవమ కోణమునందు నైసర్గిక పాపులతో కలిసినయెడల వీరుమాత్రము యోగము నిచ్చెదరు. వీరితో కలిసిన గ్రహములంత యోగము నివ్వరు. పంచమ కోణమందు అట్లుకాదు. కుజరాహువులు కోణములందు కలిసిన

యెడల గురునకు యోగము లేనప్పుడు, కుజ గురులమధ్య వచ్చిన రాహుదశకూడ యోగమునివ్వదు.

సింహలగ్నమునకు :- ఈ లగ్నమునకు నైసర్గికశుభులగు గురు, బుధ, చంద్రులసంబంధము రాహుకేతువులకు చాలమంచిది. శుక్ర రాహువులుగాని, శుక్ర కేతువులుగాని దశయందు కేంద్రమున అంతమంచి యోగము నిచ్చుటలేదు. ఈ లగ్నమునకు నైసర్గిక పాపులగు రవి, కుజ, శనులు కేంద్రకోణములలో రాహు కేతువులతో కలిసినయెడల రాహుకేతువులు మంచియోగము నిచ్చెదరు. వీరు ఎవ్వరితోను కలియక కేంద్రకోణములందుండుటకూడ చాలమంచిది. ఈ లగ్నమునకు రాహుకేతువులు 3-11 స్థానములందు మంచివారు. కేతువు మాత్రము 11 నందుకంటె 12 నందెక్కువ యోగము నిచ్చును.

కన్యాలగ్నమునకు :- ఈలగ్నమునకు రాహుకేతువులు నైసర్గిక శుభులగు గురు, బుధులతో కలిసి కేంద్రములందున్నయెడల అంత యోగము చెప్పకూడదు. ఈ లగ్నమునకు తులా లగ్నమునకును వ్యయమందున్న రాహువు మంచియోగము చేయును. రాహుకేతు వులు, 3-6 స్థానములందు కూడ మంచివారు. ఈ లగ్నమునకు రాహుకేతువులు కోణములందు ఎవ్వరితోను కలియకుండుట మంచిది. ఈ కోణములందు శని, శుక్ర కుజులలో నెవ్వరితోనయి నను కలిసినయెడల పీఠికమీద యోగము తగ్గును. ఈ లగ్నము నకు గురుకేతువులుగాని, శుక్ర కేతువులుగాని ఏకాదశమున మంచివారుకారు.

తులాలగ్నమునకు :- కేంద్రకోణములందున్న రాహు కేతువులు మంచివారు. అందులో కేతువునకంటె రాహువు ఎక్కువ మంచి వాడు. వీరు కేంద్రములందు కోణములందుకంటె నెక్కువ మంచి వారు. ఈ కేంద్రములలో మకర, మేషములందు ఎక్కువ మంచి వారు. వీరికి చంద్ర, కుజ, శని సంబంధము చాలమంచిది. కుంభ

మరియు శని కేతువుల సంబంధము అంత మంచిది కాదు. వ్యయమందు శని రాహువుల సంబంధము అంత మంచిది కాదు. శని కేతువుల సంబంధము చాల మంచిది. ఈ లగ్నమునకు 3-6-8-11-12 స్థానములందు రాహువు యోగమునిచ్చును. 3-6-12 స్థానములందు కేతువుకూడ అంతే మంచివాడు.

వృశ్చికలగ్నమునకు:- ఈలగ్నమునకు నైసర్గిక పాపులతో కలిసిన రాహు కేతువులు కేంద్రములందు అత్యంత యోగము నిచ్చెదరు. వీరి దశలయందే గాక వీరికమీదకూడ మంచియోగము. ద్వితీయ మందు గురు కేతువులు కలిసిన మంచియోగము. గురు, రాహువులు యోగము నివ్వరు. ఈలగ్నమునకు కేంద్రకోణములందు శుక్ర కేతుసంబంధము మంచిదికాదు. పాపస్థానములందు కలియుట అత్యంత పాపకరము. వీరికమీదకూడ యోగభంగము చేయును. ఈ లగ్నమునకు బుధకేతువులుగాని బుధరాహువులుగాని పాప స్థానములందు కలిసినరెండల అవయోగము. ఈ లగ్నమునకు చంద్ర రాహువులుగాని, చంద్ర కేతువులుగాని, కేంద్ర కోణము లలో నెక్కడనున్నను మంచి యోగమునిచ్చెదరు. ఈ లగ్నమునకు ఏకాదశమందున్న కేతువు యోగము నివ్వడు.

ధనుర్లగ్నమునకు:- ఈ లగ్నమునకు రాహు కేతువులు ఎవ్వరి తోను కలియక కేంద్ర కోణములందెక్కడనున్నను మంచివారు. వీరికి గురు బుధుల సంబంధము అంత మంచిది కాదు. వీరికి కుజ శనుల సంబంధము మంచిది. అప్పుడు వీరితో కలిసిన గ్రహముల కంటె రాహుకేతువు లెక్కువ యోగము నిచ్చెదరు. ఈ రాహు కేతువు లెవ్వరితోను కలియక పాపస్థానములందున్నను మంచివారు.

మకరలగ్నమునకు :- మకరమునకు కేంద్ర కోణములందున్న రాహుకేతువులు మంచియోగము నిచ్చెదరు. వీరికి కుజ శనుల

సంబంధము మంచిది. బుధ సంబంధముకూడ మంచిది. బుధ రాహు సంబంధముకంటె; బుధ కేతు సంబంధము ఎక్కువమంచిది. చంద్ర రాహుసంబంధము; చంద్ర కేతు సంబంధముకంటె మంచిది. ఈ లగ్నమునకు అష్టమమందున్న రాహువు మంచియోగము నిచ్చును. ఈ లగ్నమునకు గురురాహు సంబంధము అంత మంచిది కాదు. ఈలగ్నమునకు గురు, కుజులుగాని, గురు, కుజ, రాహువులు గాని కలిసినప్పుడు కుజుడు యోగమునివ్వక, గురు రాహువులు యోగమునిచ్చెదరు. ఈ లగ్నమునకు రవి, రాహువులుగాని, రవి కేతువులుగాని కలియుట మంచిదికాదు.

కుంభలగ్నమునకు:-ఈ లగ్నమునకు రవి, కుజ, శనులు రాహు కేతువులతో కలియుట మంచిది. రాహువుకంటె కేతువుయెక్కువ యోగమునిచ్చును. పాపస్థానములందు రాహుకేతువులు ఒక్కరే ఉండుట మంచిది. ఈలగ్నమునకు అష్టమమందున్న రాహుకేతు వులు అంత యోగము నివ్వరు. ఈరాహుకేతువులకు గురు చంద్ర సంబంధము కేంద్రములందు మంచిది. మీనమునకుకూడ ధనస్సు నకువలెనే చూచుకొనవలెను.

శ్లో॥ కేంద్ర త్రికోణాధిపయోరైక్యే తే యోగకారకాః
అన్య త్రికోణపతినా సంబంధోయధి కిం పునః

కేంద్ర త్రికోణాధిపయోః = కేంద్ర త్రికోణాధిపతులయొక్క, ఐక్యేన = కలియుటవలన. తే= ఈకేంద్ర కోణాధిపతులు, యోగ కారకాః=రాజయోగము నిచ్చెడివారై, భవంతి=అగుచున్నారు. అన్యత్రికోణపతినా = ఇతరమైన త్రికోణాధి పతితోడ, సంబంధో యుది = సంబంధము కలిగినట్లయితే, కిం పునః = ఇక చెప్పవలెన

దేమున్నది ? అనగా మంచియోగము నిచ్చేవరని యర్థము. అనగా కేంద్రాధిపతులు కోణాధిపతులతో సంబంధము కలిగిన యెడల యోగము నిచ్చెదరనియు ఈ కేంద్రాధిపతు లిద్దరుకోణాధిపతులతో కలిసినే అపరిమిత రాజయోగము నిచ్చెదరని గ్రంథకర్త యభి ప్రాయము ఈ యభిప్రాయము బహు ప్రశంసనీయము. గ్రంథకర్త ఇదివరలో కేంద్రాధిపత్యము నైసర్గిక శుభులకును, కోణాధిపత్యము నైసర్గికపాపులకును పనికిరాదనియును ; అట్టి కేంద్రకోణాధిపతులు పరస్పర సంబంధమువలన అవయోగము నిచ్చెదరనియును చెప్పి యున్నాడు ఈ సాంప్రదాయము మరచిపోయి ప్రతి కేంద్రాధిపతి యును, ప్రతి కోణాధిపతితోను కలిసినప్పుడెల్ల రాజ గము నిచ్చునని జ్యోతిష్కులు అర్థము చేసికొని అనుభవముకు సరిపోవక పోవుటవలన ననేకవిధముల నూహించుచున్నారు. కాబట్టి పై సాంప్ర దాయమును మనస్సులో పెట్టుకొని ఈ శ్లోకము నన్వయించుకొని అనుభవములో పెట్టుకొన్న యెడల ఈ మహర్షి యొక్క యభి ప్రాయము పూర్తిగా తెలియగలదు. అనుభవమునకు సరిగా సరి పోవును. ఈ శ్లోకము పై సాంప్రదాయ ప్రకారము ఏ యే లగ్న ముల కెట్లు సరిపోవునను విషయము చెప్పుచున్నాను.

1. కేంద్రకోణాధిపతులు తమ కలయికవలన కేంద్ర కోణములందు ఎప్పుడు యోగము నిచ్చెదరు ?
2. ఈ కేంద్ర కోణాధిపతులు కేంద్ర కోణములందు కలియుట ఎప్పుడు అవయోగకరము ?
3. కేంద్ర కోణాధిపతులు పాపస్థానములందు కలియుటవలన ఎప్పుడు యోగము నిచ్చెదరు ?
4. కేంద్ర కోణాధిపతులు పాపస్థానములందు కలియుటవలన ఎప్పుడు అవయోగము నిచ్చెదరు ?

ధర్మ కర్మాధినేతారౌ = నవమ దశమాధిపతులు, రంధ్ర లాభాధిపౌ యది = అష్టమ లాభాధిపతులైన యెడల (అనగా ఆ నవమ దశమాధిపతులే అష్టమ లాభాధిపతులగుట తటస్థించినచో) తయోః = అట్టి అష్టమ లాభాధిపతులయొక్క, సంబంధమాత్రేణ = సంబంధముచేతనే, నరః = మనుష్యుడు, యోగం నలభేత్ = యోగమును పొందుటలేదు.

పై శ్లోకము ననుసరించి నవమ దశమాధిపతులకు అష్టమ లాభాధిపత్యములు పట్టుట మేష, మిథున లగ్నముల విషయమున మాత్రమే కలుగుచున్నది. మేషలగ్నమైనచో భాగ్యాధిపతి గురుడును రాజ్యాధిపతి శనియును అగుచున్నారు. ఆశనికి లాభాధిపత్యము గూడ నున్నది. ఈ విధముగా రాజ్య లాభాధిపత్యము పట్టిన శనియొక్క సంబంధము భాగ్యాధిపతియగు గురునకు యోగప్రదము కాదు. మిథునము లగ్నమైనచో భాగ్యాధిపతి శనియును, రాజ్యాధిపతి గురుడును అగుచున్నారు. శనికి అష్టమాధిపత్యము గూడనున్నది. ఈవిధముగా అష్టమాధిపత్యముగల శనియొక్క సంబంధము రాజ్యాధిపతియగు గురునకు యోగప్రదము కాజాలదు.

"భాగ్యరాజ్యాధిపతులకు అష్టమలాభాధిపతుల సంబంధము యోగప్రదము కాదు" నునట్లుగా గొంటజీ శ్లోకమున కర్థము చెప్పిరి. ఇది అనుభవమునకు సరిగానుండుటలేదు. ఇందులకీ క్రింది యుదాహరణములే తార్కాణములు.

మిథునలగ్నమునకు రాజ్యాధిపత్యము పట్టిన గురుడు అష్టమాధిపత్యము పట్టిన శనితో కలిసి కేంద్రకోణములందుండిన యోగము నిచ్చుచున్నాడు.

వృషభలగ్నమునకు భాగ్యరాజ్యాధిపత్యముపట్టినశనికిఅష్టమాధిపత్యముపట్టిన గురుసంబంధము కేంద్రములందు యోగప్రదము.

వీనినిబట్టిచూడగా కేంద్రాధిపత్యముపట్టిన నైసర్గికశుభులకును, కోణాధిపత్యము పట్టిన నైసర్గిక పాపులకును, పాపులగు అష్టమాధిపతుల సంబంధము ఉన్నగాని యోగము కలుగదని తేలుచున్నది.

ఇందుకు పారాశర్యమున "మేషే యుగ్మేతు జాతస్యరాజయోగోన లభ్యతే" అని చెప్పబడినది. అనగా భాగ్యాధిపత్యము పట్టిన శనికి అష్టమాధిపత్యము మిధున లగ్నమునకు మాత్రము కలుగును. ఇట్లే మేషలగ్నమునకు రాజ్యాధిపత్యము పట్టిన శనికి లాభాధిపత్యముకూడా కలుగును. ఈ శ్లోకములో గ్రంథకర్త భాగ్యరాజ్యాధిపత్యము పట్టిన శని యోగము నివ్వడని చెప్పుటలో నొక సాంప్రదాయము కలదు. అది ఏది అనగా భాగ్యరాజ్యాధిపత్యము పట్టిన గ్రహము ఆధిపత్యపాపి యగును. ఇట్టి గ్రహము అష్టమలాభములగు స్వక్షేత్రములందుండినను, ఇతర పాపస్థానములందుండినను, యోగము నిచ్చుటలేదు. ఈ గ్రహమునకు కోణము స్వక్షేత్రమయినను అందున్నచో నవయోగము నిచ్చుచున్నాడు. ఈ శని దశమకేంద్రమందు స్వక్షేత్రమైనను ఇతర కేంద్రములందు కంటె తక్కువయోగము నిచ్చును. "భాగ్య రాజ్యాధిపతులకు అష్టమలాభాధిపతులు సంబంధము అవయోగకరము" అనువిషయము సర్వదా వర్తించదు. ఎవరు ఎట్లు చెప్పినను గ్రహములకు నైసర్గిక, ఆధిపత్య స్థితి సంబంధములనుబట్టి యోగావయోగముల నిర్ణయించవలెనుగాని, ఒక ఆధిపత్యముచేతగాని, ఒకకలయికచేత గాని, ఏ గ్రహమునకు ఏ లగ్నము విషయమున నిర్ణయించరాదు.

శ్లో॥ నదిశేయుఃర్గ్రహాః సర్వే స్వదశాసు స్వభుక్తిషు।
శుభాశుభఫలం నౄణా మాత్మ భావానుసారతః ॥

సర్వేగ్రహాః=రవ్యాది సమస్తగ్రహములు, స్వదశాసు=తమ దశలయందు, స్వభుక్తిషు=తమదశలలో వచ్చిన తమ అంతరముల

యందు (స్వదశాస్వభుక్తులయందు) ఆత్మభావానుసారతః = తమ యోగ్యతకు తగినట్లుగా అనగా తాము చేయగలిగిన యోగావయోగముల యొక్క, శుభాశుభ ఫలం = శుభాశుభ ఫలమును, నృణాం = మనుష్యులకు, నదిశేయుః = ఇవ్వరు. అనగా ఏ గ్రహమైనను తనదశలో తన అంతరము వచ్చినప్పుడు పూర్వదశలో నెట్టియోగము జరుగుచున్నదో ఆ దశ సంబంధమైన శుభాశుభ ఫలముల నిచ్చునుగాని, తమ దశాసంబంధమగు యోగావయోగములను స్వతంత్రముగా నివ్వజాలదని యర్థము. ఇచ్చట "సర్వే గ్రహాః" అనిచెప్పుటలో సూర్యాది సప్తగ్రహముల కే వర్తించును గాని ఛాయాగ్రహములకు మాత్రము వర్తించదు. ఈ నభిప్రాయము గ్రంథకర్త చాలచక్కగా వ్రాసినాడు. ఇది అనుభవము నకు కూడా సరిగానున్నది. అక్కడక్కడమాత్రము విరుద్ధముగా రవ్యాది సప్తగ్రహములును వారి స్వభుక్తులయందుకూడా పూర్వ దశాసంబంధమగు ఫలములతో నిమిత్తము లేకుండగా తాము స్వయముగా యోగావయోగముల నిచ్చుచున్నారు. ఇది అనుభవముచేత నిర్ణయించుకొనవలెను. అందువలన గ్రంథకర్త ఇట్లు వ్రాసియున్నాడు.

శ్లో॥ శుభపాపాత్మకతయా నిర్దిష్టాస్తు ఫలం గ్రహాః ।
ప్రదిశన్తి శుభా ఏవ స్వదశాసు స్వభుక్తిషు ॥

శుభ పాపాత్మకయా = శుభత్వము కలిగియుండుటచేతను, పాపత్వము కలిగియుండుటచేతను, నిర్దిష్టాస్తు = నిర్ణయింపబడిన (అనగా "శుభులు, పాపులు" అనినిర్ణయింపబడిన) గ్రహాః = గ్రహములు స్వదశాసు = తమ దశలయందు, స్వభుక్తిషు = తమయొక్క అంతర్దశలయందును, శుభాయేవ = శుభులే అయి, ఫలం = మంచి ఫలమును (యోగమును) ప్రదిశంతి = ఇచ్చుచున్నారు. బలవంతమైన యోగగ్రహము తనదశయందు యోగము ప్రారంభించవలసివచ్చి

నప్పుడు వాని దశాస్వభుక్తులయందు యోగము చేయుచున్నది. ఒక దశకు పూర్వదశలో యోగము ప్రారంభించినప్పుడు తరువాతి దశలో వాని స్వభుక్తియందు యోగము నిచ్చునా? లేదా? యను విషయము ఆలోచించనక్కఱలేదు. ఈ దశకూడా యోగదశ అయినయెడల దీనికి స్వభుక్తిలోకూడ యథాప్రకారముగా మంచియోగమే చేయును. పూర్వదశలో యోగము ప్రారంభించి దాని తరువాతదశ పూర్తిగా అవయోగదశ అయినయెడల దీని స్వభుక్తి దాటిన తరువాతి అంతరములలో పూర్తిగా అవయోగము నిచ్చును. ఈ భుక్తి లక్షణములు నిర్ణయించుటకు ముందుగా దశలయొక్క వివరము కొంతవరకు చెప్పుచున్నారు.

దశలు అనేక రకములు. ఇందులో ముఖ్యమైనవి నక్షత్రదశలనియును, రాశి దశలనియును, గ్రహదశలనియును మూడు రకములు. రాశిదశలు జైమినిమహర్షి చే చెప్పబడినవి. గ్రహదశలు (అనగా ఒక గ్రహమునకు ఇన్ని సంవత్సరములు అని చెప్పుట) శ్రీపతి వరాహమిహిరాదుల సాంప్రదాయము. ఇంకను అనేకరకములు గలవు. కాని ఈ మతములన్నియును అంత ప్రశస్తమైనవి కాకపోవుటచేత ఒక్కపారాశర్య మతమగు నక్షత్రదశలనే మన దేశమున నాసేతు హిమాచల పర్యంతము అన్ని రాష్ట్రముల వారును అంగీకరించుటయే గాక ప్రత్యక్ష ప్రమాణముగా వాడు చున్నారు. ఈమతము అత్యంత సులభసాధ్యమేగాక అనుభవ సిద్ధమని వేఱుగా చెప్పనక్కఱలేదు. ఈ కారణమువలన ఇది వాడుకలో అనుసృతముగా వచ్చి ఎక్కువగా వాడబడుచున్నది. ఇది అన్ని మతములకన్నను, అగ్రగణ్యము. ఈ ఉడుదశ అనగా నక్షత్రదశయొక్క క్రమము రెండు రకములు. మొదటిది మనము అన్ని దేశములందును వాడుచున్న వింశోత్తరి. అనగా నూట ఇరువది సంవత్సరములు పరిమాణముకలది. ఇది రవ్యాది నవగ్రహములకు రవికి 6- చంద్రునకు 10- కుజునకు 7- రాహువునకు 18- గురు

నకు 16- శనికి 19- బుధునకు 17- కేతువునకు 7- శుక్రునకు 20-సం॥ చొ॥ మొత్తము నూట ఇరువదిసంవత్సరములకు క్రమముగా కృత్తిక మొదలు 27 నక్షత్రములతో పూర్తిఅగునది వింశోత్తరి. రెండవది అష్టోత్తరి. ఈ మతమునకు 8- గ్రహములు మాత్రమే తీసి కొనబడినవి. అనగా కేతువు వదలివేయబడినది. ఈ 8-గ్రహము లకు మొత్తము 108 సంవత్సరములే ప్రమాణముగా చెప్పినారు. నక్షత్రములవరుసకూడా కృత్తిక మొదలుకాక ఆరుద్రతో ప్రారంభ మైనది. దశల క్రమమును ప్రమాణములువేరు. అట్లే నక్షత్రములు కూడా 27 నక్షత్రములకు బదులు అభిజిత్తు కలుపుకొని 28 నక్షత్ర ములు చెప్పినారు. దీని వివరము ఈ క్రింద చూపబడినది.

ఇందులకు దశాక్రమ మిట్టిదనిన :

| | గ్రహములు | సంవత్సరములు | జన్మ నక్షత్రములు |
|---|---|---|---|
| 1) | రవి | 6 | ఆరుద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్రేష |
| 2) | చంద్రుడు | 15 | మఖ, పుబ్బ, ఉత్తర, |
| 3) | కుజుడు | 8 | హస్త, చిత్త, స్వాతి, విశాఖ |
| 4) | బుధుడు | 17 | అనూరాధ, జ్యేష్ఠ, మూల |
| 5) | శని | 10 | పూర్వాషాఢ, ఉత్తరాషాఢ అభిజిత్తు, శ్రవణం |
| 6) | గురుడు | 19 | ధనిష్ఠ, శతభిషం, పూర్వాభాద్ర |
| 7) | రాహువు | 12 | ఉత్తరాభాద్ర, రేవతి, అశ్విని, భరణి |
| 8) | శుక్రుడు | 21 | కృత్తిక, రోహిణి, మృగశిర |
| | మొత్తము | 108 | |

పైని చెప్పినప్రకారము ఆయా నక్షత్రములయందు పుట్టిన వారికి ఆ రాహు దశలలో ప్రారంభము, పై క్రమము ననుసరించి దశలు జరుగును. ఈ మతము దేశభేదముల చేతను, కొన్ని జబ్బులు కలవారికిని, పిచ్చివారికిని, రాహువు లగ్న కేంద్రమునందును, ఈ రాహువు లగ్నాధిపతికి కేంద్రమునందును నుండునప్పుడు ఈ మతమును గ్రహింపవలెనని మఖ్యాభిప్రాయము. కాని ఈ మతము అచ్చటచ్చట కొద్దిమంది జైమినీమత రాశిదశలవలెనే వాడుచున్నారు. అక్కడకూడ వింశోత్తరీమతమే వృద్ధిని పొందుచున్నది.

శ్లో॥ ఆత్మసంబంధినో యేచ యేయే నిజసధర్మణః।
తేషామన్తర్దశాస్వేవ దిశన్తి స్వదశాఫలమ్ ॥

యేచ=ఏగ్రహములు, ఆత్మసంబంధినః=తమ సంబంధము కలవారో, యేయే=ఏ యే గ్రహములు, నిజసధర్మణః=తమతోడ సమానమైనధర్మము కలవారో, తేషాం=వారలయొక్క అంతర్దశలయందు మాత్రమే, స్వదశాఫలమ్=తనయొక్క (మహాదశానాధునియొక్క) దశయందు దానిచ్చుఫలమును, దిశన్తి=ఇచ్చుచున్నారు.

అనగా ఏజాతకమందైనను ఒకదశలో ఏవిధమైనదోషము ఇంతవరకు చేయునది పీఠికమీద నిర్ణయించినప్పుడు అట్టి యోగము ఆ దశానాధునితో కలిసిన ఇతరయోగ గ్రహముయొక్క అంతరము వచ్చినప్పుడు ఆ మహా దశానాధుని యోగము వీని అంతరములో చేయునని అర్థము. లేక ఒకప్పుడు అట్టియోగము ముందు ఈ అంతరములో ప్రారంభించి క్రమముగా హెచ్చును. ఒకప్పుడు ఏ భావమునకు అంతర్దశాధిపతి కారకుడో, ఏ భావసంబంధ మగు యోగమునకు వీడు బలవంతుడో, ఆ భావసంబంధమైన యోగము మాత్రము నిచ్చును. ఇది విశేషము.

శ్లో॥ ఇతరేషాం దశానాథ విరుద్ధఫలదాయినాం ।
తత్తద్బలానుగుణ్యేన ఫలాన్యూహ్యాని భుక్తిషు ॥

దశానాథ విరుద్ధ ఫలదాయినాం=మహాదశానాథునకు విరుద్ధ ఫలమునిచ్చు, ఇతరేషాం=దశానాధునితో సంబంధము లేనట్టి అంతర్దశానాథుల యొక్క, అంతర్దశాసు = అంతర్దశలయందు, ఫలాని=ఫలితములు, తత్తద్బలానుగుణ్యేన=వారివారి స్థితి, గతుల ననుసరించి, భుక్తిషు=వారివారి అంతరములయందు, ఊహ్యాని= ఊహించదగినవి. అనగా ఒకప్పుడు అంతర్దశానాథుని భుక్తులలో వారివారి స్థితి ననుసరించి, వీరు దశానాథునకు లేనిగుణములతో కూడిన ఫలముల నిచ్చెదరు. ఇట్టి ఫలితములు అంతర్దశానాథుల యొక్క స్థితులవలననుకూడా తెలిసికొనవలెను. ఇచ్చట పై రెండు శ్లోకములు కలిపి అర్థము చెప్పకొనినకాని గ్రంథకర్త అభి ప్రాయము బోధపడదు. గ్రంథకర్త యభిప్రాయ మేమనగా దశాంతర్దశఫలము నిర్ణయించుటలో రెండురకములు కలవని. అవి ఏవనగా (1) దశానాథునకు అనుగుణముగా వారి భుక్తులయందు యోగము నిచ్చుట (2) దశానాథునకు వ్యతిరిక్తఫలముల నిచ్చుట. గ్రంథకర్త యభిప్రాయము దశానాథునితో కలిసిన గ్రహములు వాని అంతరములయందు దశానాథు డిచ్చు ఫలములను మాత్రము ఇచ్చెదరు. అనగా దశానాథుడు శుభుడైన మంచియోగమును, పాపియయిన నవయోగమును ఇచ్చును. ఇది ఒక్క యోగ విషయమున మాత్రమే. భావముల విషయమున వాడు ఏ భావమున కధిపతియో, కారకుడో, ఆ సంబంధముగు శుభా శుభముల నిచ్చును. దశానాథునకు యోగము నిర్ణయించవలసినప్పుడు ముందు పీఠిక మీాద యోగము నిర్ణయించి, తరువాత దశానాథునికి యోగము నిర్ణయించవలెను. అంతర్దశానాథులు దశానాథునకు లేని యోగము ఎప్పుడు యివ్వలేరు. దశానాథుడిచ్చు యోగమునే ఇతరగ్రహములు అనగా

దశానాథునితో కలియని గ్రహములు యోగము తక్కువగాని వారి స్వతస్సిద్ధమగు ఆధిపత్య, కారక, స్థితుల ననుసరించి ఇచ్చెదరు. ఒకప్పుడు ప్రారంభములో దశానాథుడు ప్రబలమయిన రాజయోగము నిచ్చి తరువాత వానిదశలోనే విరుద్ధఫలమును, అనగా యోగ భంగమును, చేయును. అప్పుడు తరువాతిదశలు అంతకంటే మంచి వయినను యోగము చెడిపోవును. ఇవి విపరీత ఫలములు. ఒకప్పుడు దశాచ్ఛిద్రములందు దశానాథునకు సంబంధములేని అవయోగము జరుగును. ఇది తరువాత వచ్చుదశకు అందించుటకుగాను చేయును. ఇవి అనుభవములో చాల జాతకములందు సరిపడుచున్నవి.

శ్లో॥ స్వదశాయాం త్రికోణేశో భుక్త్యా కేంద్రపతేశ్శుభం।
దిశేత్సోపి తథానోచే దసంబంధేపి పాపకృచ్చేత్॥

త్రికోణేశః=పంచమ నవమాధిపతులు, స్వదశాయాం=తమ దశలయందు, పాపకృచ్చేత్=పాపమునిచ్చువారైనయెడల, అసంబంధేపి=తనతో కలియకున్నను, కేంద్రపతేః=కేంద్రాధిపతి యొక్క, భుక్త్=అంతమునందు, శుభం=శుభమును, దిశేత్=ఇచ్చును. సోపి=ఆ కోణాధిపతి, తథానోచేత్=పాపి కానియెడల, శుభం=శుభ ఫలమును, దిశేత్=ఇచ్చును. అనగా కోణాధిపత్య దోషములేని నైసర్గిక పాపులదశయందు, కేంద్రాధిపత్య దోషము లేని నైసర్గిక శుభుల అంతరములో యోగము ప్రారంభమగును. అనగా నైసర్గికపాపి దశానాథుడైనప్పుడు కోణాధిపత్యముండకూడ దనియును, అట్టిదశలో కేంద్రాధిపత్యదోషములేని శుభుల అంతర ములందు యోగము ప్రారంభమని అర్థము. అట్లే కేంద్రాధిపతు లగు నైసర్గిక పాపుల దశలయందు కోణాధిపత్యము పట్టిన శుభుల అంతరములలో యోగము ప్రారంభమనియును, కోణాధిపత్యము పట్టిన నైసర్గిక శుభుల దశలయందు కేంద్రాధిపత్యము పట్టిన

నైసర్గికపాపుల అంతరములందు మంచియోగము చేయుటగాని, యోగము ప్రారంభించుటగాని జరుగును. వీరు అనగా దశాంతర్దశా నాథులు కేంద్రములందుగాని, కోణములందుగాని కలిసియున్నను, కలియకయున్ననుకూడ పైవిధముగా చూచుకొనవలెను అది అను భవములో సరిగానుండును. కోణాధిపతి నైసర్గిక పాపియై కేంద్రాధి పతి నైసర్గిక శుభుడైనయెడల ఆ కోణాధిపతి దశలో ఆ కేంద్రాధి పతి అంతరమునందు అత్యంత అవయోగము నిచ్చుచున్నాడు. పాపాధిపత్యములేని కోణాధిపతుల దశయందు పాపాధిపత్యములేని కేంద్రాధిపతుల అంతరములందు అని (పాపాధిపతులనగా 3-6-8-12 స్థానాధిపతులని తెలియవలెను.) అర్థము అనుభవములో నెక్కు డను సరిగా నుండదు.

శ్లో॥ ఆరంభో రాజయోగస్య భవేన్మారక భుక్తిషు।
ప్రలయంతి తమారబ్ధం క్రమశః పాపభుక్తః॥

మారకభుక్తిషు=మారక లక్షణములుగల అంతర్దశలందుండు రాజయోగస్య ఆరంభోభవేత్ = రాజయోగము ప్రారంభించుచు న్నది. ఆరబ్ధం = అట్లు ప్రారంభించిన, తం=ఆ రాజయోగమును క్రమశః = క్రమముగా, పాపభుక్తః = పాపుల అంతరములు, ప్రలయంతి=(యోగభంగము) మారకము చేయుచున్నారు. దీనికి కొందరు భిన్నాభిప్రాయమును చెప్పుచున్నారు. ప్రలయంతి=అను శబ్దమునకు బదులుగా "ప్రథయంతి" అని పాఠాంతరము చెప్పుకొని రాజయోగము నెక్కువగా నిచ్చునని చెప్పుచున్నారు. వీరు మారక భుక్తిషు=మారకుల అంతరములలో, రాజయోగస్య = రాజయో గముయొక్క, ఆరంభోభవేత్ =ప్రారంభమగును. తమారబ్ధం= అట్లు ప్రారంభించిన యోగమును, క్రమశః=క్రమముగా, పాప భుక్తయః=పాపుల అంతరములు, ప్రథయంతి=వృద్ధిచేయుచున్నవి.

అని చెప్పుచున్నారు. కొందరు "ఆరంభః" అనిచెప్పుటచేత దశా ప్రారంభమున అనగా తనదశలో స్వభుక్తియందు యోగము ప్రారంభించి, తిరిగి ఆ దశలోనే పాపుల అంతరము అనగా మారకుల అంతరము వచ్చినప్పుడు దశానాధునకుకూడ మారక లక్షణములు కలిగినచో దశాంతర్దశానాధులు మారకులై మారకము చేయుదురని చెప్పుచున్నారు. వీరి యభిప్రాయము ప్రకారము "మారక భుక్తిషు" అని గ్రంథకర్త చెప్పుటచేత మారక లక్షణములుగల గ్రహముమాత్రమే తన స్వభుక్తియందు యోగము నిచ్చినదై, పాపులగు ఇతరమారకుల అంతరములందు మారకము చేయునని చెప్పుచున్నారు. సాధారణముగా దశానాధునకు మారక లక్షణములు లేనప్పుడు ఎంత ప్రబలమయిన మారకుల అంతరములు వచ్చినను మారకమునివ్వడు. అట్లే యోగవిషయమున యోగములేని దశయందు ఎంత మంచి అంతరము వచ్చినను దశానాధునకు లేనియోగము నివ్వడు. అట్లే యోగదశయందు పాపాంతరములు వచ్చినను యోగభంగము చేయజాలవు. చిక్కులు మాత్రము కలుగజేయగల్గును. అనుభవములోచూడగా "ఆరంభో రాజయోగస్య" అనుటచేత ఏ గ్రహములకైనను ప్రబలమైన రాజయోగముపట్టి, వానికే, మారక లక్షణములు కలిగినయెడల, అప్పుడు అల్ప, మధ్య, పూర్ణాయువులను నిర్ణయించుకొని ఆ భాగములో వాని దశ వచ్చినప్పుడు మారకము కలుగునని తెలియవలెను. అప్పుడు వాని స్వభుక్తిలో ప్రబలమయిన రాజయోగము ప్రారంభమయి "క్రమశః" అనగా క్రమముగా ఆ దశలో కొంత జరిగిన తరువాత "పాపభుక్తయః" పాపుల అంతరములందు అనగా మారకలక్షణములు కలిగినవారల అంతరములు మారకము చేయును. ఇచ్చట ప్రబల రాజయోగమని చెప్పుటలో అంతకు ముందు రాజయోగము కలిగినవారికికూడ ఆ గ్రహము తనయొక్క

అంతరము వచ్చినప్పుడు ఎప్పుడును అనుకోనంత యోగమును అకస్మాత్తుగా చేసి, తరువాత మారకము చేయునని యభిప్రాయము. ఒకప్పుడు మారక లక్షణములు లేని గ్రహములు తమయొక్క మహా దశలయందుకూడ వారి స్వభుక్తులలో మంచి రాజయోగము చేయును. అప్పుడు మారకభుక్తులు వచ్చినను ఈ యోగము పాడు చేయదు. ఒకప్పుడు మారకలక్షణములు గలిగిన మహాదశలయందు తన స్వదశా స్వభుక్తిలో యోగము ప్రారంభించినను అల్ప, మధ్య, పూర్ణాయువులను నిర్ణయించిన తరువాత పూర్ణాయువు పట్టినవారికి అల్పాయువు భాగమున ఈ యోగదశ ప్రారంభించినను మారకము చేయదు. ఈ రాజయోగ భుక్తుల నిర్ణయించుటలో అనేక భేదాభిప్రాయములు కలవు. కొందరు షడ్వర్గుల లక్షణములనుబట్టియున్ను, కొందరు ఆరోహణావరోహణములనుబట్టియున్ను, మఱికొందరు కక్ష్యాహ్రాసముల బట్టియును, అష్టకవర్గ లక్షణములను బట్టియును, యోగము నిర్ణయించుచున్నారు. షడ్వర్గ లక్షణమువలన భావ సంబంధమగు యోగము నిర్ణయించుటయేగాని యోగము నిర్ణయించుట పనికిరాదు.

ఉదాహరణము :— పంచమాధిపతి పంచమమందున్న పంచమ భావమునకు అనగా పుత్ర విషయమునకు మంచిది. ఈ గ్రహమే పంచమమందుస్వక్షేత్రమందున్నను అవయోగమునిచ్చును. సర్వార్థ చింతామణి మొదలగు గ్రంథములు ఆరోహణావరోహణములకు ప్రాముఖ్యము నిచ్చినవి. ఇదియును అనుభవమునకు సరిపోదు. తాచక మతస్థులు, కక్ష్యాహ్రాసము లు మొదలగువానినిగూడ యోగము చెప్పుచున్నారు. ఇదియును అనుభవమునకు సరిగా నుండుటలేదు. అష్టకవర్గనుబట్టికూడ యోగము నిర్ణయించు చున్నారు. ఈ మతప్రకారము బిందువులనుబట్టి కొద్దియోగములు

మాత్రమే జరుగుచున్నవి. దీనినిబట్టి పీఠికమీద యోగము నిర్ణయము చేయుటగాని, దశాంతర్దశలందు యోగ నిర్ణయము చేయుటగాని పనికిరాదు. పీఠికమీదగాని, దశాంతర్దశానాధుల యోగము గాని నిర్ణయించుటలో గ్రహములయొక్క నైసర్గిక, ఆధిపత్య, స్థితి సంబంధ దృష్టులచేత బలాబలముల నిర్ణయించి అప్పుడు యోగనిర్ణయము చేయవలయును.

శ్లో॥ తత్సంబంధి శుభానాంచ తధాపునరసంయుజామ్।
శుభానాంతు సమత్వేనచా సంయుగ్యోగ కారిణామ్॥

తత్ = దశానాధునితో సంబంధి = సంబంధముకలిగిన, శుభానాం = రాజయోగమునిచ్చు గ్రహములయొక్క, భుక్తయః = అంతరములు, తధా = అప్రకారమే (అనగా దశానాధునితో సమానముగా రాజయోగమునే) ఇచ్చుచున్నవి. అసంయుజాం = దశానాధునితో కలియని, శుభానాంతు = యోగమునిచ్చు గ్రహములయొక్క భుక్తయః = అంతరములు, సమత్వేన = సామాన్యమయిన యోగము నిచ్చుచున్నవి, పునః = తిరిగి, అసంయుగ్ = వానితో చేరనటువంటి, యోగకారిణాం = యోగమునిచ్చు గ్రహములయొక్క, భుక్తయః = అంతరములు యోగమునిచ్చుచున్నవి. ఈ శ్లోకములో దశాంతర్దశానాధుల సంబంధమునలన యోగము నిర్ణయించుచున్నాడు. గ్రంథకర్త యభిప్రాయము దశానాధునితో కలిసిన యోగగ్రహములు వారి అంతరములలో దశానాధునకు సమానమయిన యోగము నిచ్చుచున్నవనియును, వానితో సంబంధములేని గ్రహములు తమ అంతరములందు సామాన్యయోగము నిచ్చుననియును, సంబంధము లేకపోయినను స్వతంత్రముగా యోగమునిచ్చు గ్రహములు తమ అంతరములందు మంచియోగము నిచ్చుననియును చెప్పుచున్నాడు. ఇది అనుభవముతో సరిగానున్నది. ఈ రెండుశ్లోకములలో నొక ముఖ్యవిషయము గ్రహించవలసి యున్నది. దశాంతర్దశలయందలి

యోగము నిర్ణయించునప్పుడు ఇదివరలో చెప్పిన రీతిని ఏగ్రహము నకు ఆగ్రహముయొక్క బలాబలముల నిర్ణయించుకొన్నతరువాత, దశానాధునకు అంతర్దశానాధునకును ఉన్న సంబంధమువలన, ఏ దశానాధుని దశలో నేయే అంతరమున నెంతెంత రాజయోగము నిచ్చునో నిశ్చయించవలెను. ఈ యభిప్రాయము చాల ముఖ్యము. ఇందుకు కారణమేమనగా ఒక గ్రహ మొక దశలో వచ్చినప్పుడు ఒక విధముగాను, ఇంకొకదశయందు ఆగ్రహమే ఇంకొకవిధము గాను యోగము చేయును.

శ్లో॥ శుభంచ స్వవియుక్తస్య వశాయాం యోగకారకాః।
స్వస్వభుక్తిషు చేచ్ఛంతి కుత్రచిద్యోగకారిణః॥

యోగకారకాః = యోగమునిచ్చెడి గ్రహములు, స్వవియుక్తస్య=తనతో సంబంధము లేని, యోగకారిణః=యోగమునిచ్చెడి గ్రహముయొక్క, దశాయాం=దశయందు, స్వస్వభుక్తిషు=తమ తమ భుక్తులయందు, శుభం=యోగఫలితమును, కుత్రచిత్ =అప్పు డప్పుడు, ఇచ్ఛంతి=ఇచ్చుచున్నారు. ఇదివరలో గ్రంథకర్త దశా నాధునితో కలిసినగ్రహములు తమ అంతరములలో మాత్రము దశానాధఫలితము నిచ్చెదరని వ్రాసినారు. ఈ శ్లోకములో ఒకప్పుడు దశానాధునితో కలియని ఇతర గ్రహములు తమ అంతరములలో సహితము దశానాధుని యోగము ఇచ్చునని చెప్పినాడు. ఒకప్పుడు అనుటలో ఇది సర్వదా వర్తించదనియును, అనుభవము చేత ఎప్పుడు చేయునది నిర్ణయించుకొనవలెనన్న యభిప్రాయము తెలియుచున్నది.

శ్లో॥ తమోగ్రహౌ శుభారూఢా నసంబధాచ్చ కేనచిత్।
అంతర్దశానురూపేణ భవేతాం యోగకారకౌ॥

అసంబంధాత్ =సంబంధము లేని (కలియని) తమోగ్రహౌ = రాహుకేతువులు, అంతర్దశానురూపేణ =వారి అంతరముల ననుసరించి. యోగకారకౌ = యోగమునిచ్చేవారై, భవేతాం = అగు

చున్నారు. అనగా రాహుకేతువులు ఎవ్వరితోను కలియక, శుభ రాసులయందున్నప్పుడు వారి యంతరములలో మంచి రాజయోగము నిచ్చెదరు. ఈ శ్లోకప్రకారము ఎవ్వరితోను కలియని రాహు కేతువులు కేంద్ర, కోణములందున్నప్పుడు మంచివారని తెలుచున్నది. ఈ కేంద్రకోణములు పాప రాసులగుట చాలమంచిది. అవి స్థిర రాసులయిన యెడల మరింత మంచిది. చర రాసులలో మేషముగాని, స్థిర రాసులలో సింహముగాని, కేంద్రకోణములయి రాహువు అందున్న యెడల అత్యంత శుభము. ఈ శ్లోకమున కేంద్ర, కోణములు మాత్రమే చెప్పబడినను పాపస్థానములందుకూడ వీరు యోగము నిచ్చుచున్నారు. ఈ విషయమై ఇదివరలో వ్రాసి యున్నాను. ఈ శ్లోకము అనుభవములో చాల చక్కగా సరిపోవుచున్నది. ఈ యోగమునకు దశానాథుడు శుభయోగము నిచ్చువాడైనప్పుడు మాత్రమే చూచుకొనవలెను.

శ్లో॥ పాపాయది దశానాథాః శుభానాం తదసంయుజామ్।
భుక్తయః పాపఫలదా స్తత్సంయుక్చుభ భుక్తయః॥

శ్లో॥ భవంతి మిశ్రఫలదా భుక్తయో యోగకారిణామ్।
అత్యంత పాపఫలదా భవంతి తదసంయుజామ్॥

దశానాథాః = దశానాథులు, పాపాయది = పాపులయిన యెడల (అనగా అవయోగమునిచ్చు గ్రహములయిన యెడల) తదసంయుజాం = ఆ పాపగ్రహములతో చేరకయున్న, శుభానాం = శుభగ్రహములయొక్క భుక్తయః = అంతరములు, పాపఫలదాః = పాప ఫలితము [illegible]నవై, భవంతి = అగుచున్నవి. తత్సంయుక్చుభ భుక్తయః = ఆ దశానాథునితో, సంయుక్ = కూడుకొన్న శుభభుక్త[illegible] = శుభగ్రహములయొక్క అంతరములు, మిశ్రఫల

దాః = శుభాశుభ ఫలములను రెంటిని ఇచ్చునవై, భవంతి = అగు చున్నవి (ఇచ్చుచున్నవి) తదసంయుజాం = ఆదశానాథ సంబంధము లేనటువంటి, యోగకారిణాం = యోగమునిచ్చే గ్రహములయొక్క భుక్తయః = అంతరములు, అత్యంత పాపఫలదాః = మిక్కిలి చెడు యోగము నిచ్చునవై, భవంతి = అగుచున్నవి. అనగా దశా నాథుడు పాపియయి (అవయోగమునిచ్చు గ్రహమై,) వానితో కలిసిన గ్రహములు తమ అంతరములందు పాపఫలితమునే యిచ్చె దరు. వీరు శుభులయినయెడల మిశ్రఫలము నిచ్చెదరు. దశానాథు నితో కూడని శుభగ్రహాభుక్తులు కూడ పాప ఫలము నిచ్చును. ఇచ్చట దశానాథునితో కూడని శుభగ్రహముకూడ మిశ్రఫలము నిచ్చునని చెప్పుట అనుభవమునకు సరిపోవుచున్నది. దశానాథు నితో సంబంధములేని శుభగ్రహముకూడ పాపఫలము నిచ్చునని చెప్పుట మాత్రము అనుభవమునకు సరిపోదు.

శ్లో॥ పరస్పర దశాయాంచ స్వభుక్తౌ సౌరిభార్గవౌ।
ప్రదిశేతాం వ్యత్యయేన విశేషేణ శుభాశుభమ్॥

సౌరిభార్గవే = శని శుక్రులు, పరస్పర దశాయాం = ఒకరిదశలో నొకరు, స్వభుక్తౌ = తమ భుక్తియందు, వ్యత్యయేన = వ్యత్యాస ముగా, శుభాశుభఫలం = శుభాశుభ ఫలమును ప్రదిశేతాం = ఇచ్చెదరు. దీనికి చాలమంది శనిదశలో వచ్చిన శుక్రభుక్తి, శుక్ర దశలో వచ్చిన శనిభుక్తి, శుభులయిన శుభఫలము గ్రహపులైన పాప ఫలము నిచ్చెదరని చెప్పుచున్నారు. ఈ యభిప్రా., గ్రంథ కర్త వీరిద్దరికిని ప్రత్యేకముగా చెప్పుటలో వీరుచ్చులోనొకరి యంతరమువచ్చినప్పుడు యోగము నిచ్చుటలేద తత్అంతరములన్నారు. ఇది అనుభవములోకూడ సరిపోవుచున్నది. వీః = ప్రదిశేతాం విశేషము

చేత యోగముచేసినను, అంత ఎక్కువగా చేయుటలేదు. ఈ విశే షము వృషభలగ్నమునకు శని కేంద్రములందుండి, శుక్రుడు కూడ లగ్నకేంద్రముతప్ప ఇతర కేంద్రకోణములందుండిన మంచి రాజ యోగము నిచ్చుచున్నారు. ఇట్లే శని రాహుదశలయందు కూడ చూచుకొనవలెను.

శుభమ్

ఇది శ్రీపార్వతీపరమేశ్వర కరుణాకటాక్ష లబ్ధమాహాత్మ్యసగోత్ర పవిత్ర
శ్రీ వాసుదేవు వంశపయః పారావార రాకాసుధాకర శ్రీరామస్వా
మీశ్వరార్య పౌత్ర వేంకట రాజామాత్య వేంకటరత్న
మాంబాపుత్ర, సుకవిజనవిధేయ జ్యోతిష విద్యా
ప్రవీణ సూర్యనారాయణమూర్త్యభిధేయ
ప్రణీతంబైన జాతకనారాయణీయము
ద్వితీయ భాగమునందు
పూర్వపరాశరీయను
యోగావళీఖండమున
ప్రథమ భాగము
సంపూర్ణము.
ఓమ్



# జాతక నారాయణీయము

## బాలారిష్ట ఖండము

పరాశరుడు తన గ్రంథమున బాలారిష్ట విషయమేమియును చెప్పి యుండలేదు. ఆ గ్రంథము కేవలము యోగము నిర్ణయించుటకు మాత్రమే చెప్పబడినది. యోగవిషయమునకు నింతటి గ్రంథము మఱొకటి లేదని అన్నిరాష్ట్రములవారును నేకగ్రీవముగ నొప్పుకొని యున్నారు. మన దేశమున దశాభుక్తుల నిర్ణయించుటలోగూడ నీ గ్రంథమునే వాడుచున్నారు. జ్యోతిష గ్రంథము వ్రాయునప్పుడు ఆయుర్విషయము వ్రాయకుండగ యోగము మాత్రము వ్రాయుట అశాస్త్రీయము, అసంపూర్ణమును నగుటచే నీ మహర్షి ఈ విషయ మునుగుఱించి క్లుప్తముగా చెప్పియున్నాడు. పిండాయుర్దాయవిషయ మున బాదరాయణ వచనములుకలవు. కాని బాలారిష్టమునుగురించి మాత్రము వారు వ్రాయలేదు. బాలారిష్టమున వరాహమిహిరా దుల మతము చాల అగ్రగణ్యమనుటకు సందేహములేదు. ఆయు ర్విషయమునుగురించి చెప్పుటకు ముందు బాలారిష్టమును గురించి చెప్పుట చాల అవసరము. ఈ కారణమువలన బాలారిష్ట, ఆయు ర్దాయ ఖండములను ప్రత్యేకముగా వ్రాసినాను.

ఇదివరలో నేను వ్రాసిన జాతకనారాయణీయమున బాలారిష్టా యుర్దాయాధ్యాయములు వ్రాసియున్నాను. అందులోని సంగతులు మాత్రమే తిరిగి వ్రాయుట అనవసరము గనుక అందులో లేని కొన్ని సంగతులను, వరాహమిహిరాదులు వ్రాసిన యభిప్రాయములను ఇందున వ్రాయుచున్నాను.

బాలారిష్టములు రెండు రకములు. మొదటిది జన్మలగ్నమును బట్టి, ఆవలి గ్రహములను బట్టియు చెప్పుట. రెండవది చంద్రారిష్టము. ఇది చంద్రబలనుబట్టి, నక్షత్రబలమునుబట్టియు, చెప్పుట. మొదటిరకపు బాలారిష్టము తిరిగి రెండు రకములుగా విభజింపబడినది. 1. సౌమ్యబాలారిష్టము. 2. సద్యోబాలారిష్టము. చంద్రారిష్టము పట్టిన శిశువు మూడు మాసములకంటె నెక్కువ జీవింపదు. చంద్రారిష్టమనగా బాలారిష్టమంపట్టి, చంద్రుడుకూడ బలహీనుడగుట. ఇట్టి చంద్రుడు అశ్విని 2, 4, భరణి 2, కృత్తిక 3, ఉత్తర 2, హస్త 1, 4, చిత్త 2, 3, విశాఖ 4, అనూరాధ 3, జ్యేష్ఠ 3, 4, మూల 2, 3, ఉత్తరాషాఢ 1, ధనిష్ఠ 2, శతభిషం, ఉత్తరాభాద్ర 4, పాదములయందున్నప్పుడు, రవి కుజ శని వేధలు కలిగినప్పుడు, శుభ గ్రహ సంబంధము లేనియెడలనే చంద్రారిష్టమని చెప్పబడుచున్నది. ఇందున పై విధముగా చంద్రుడుండి కేంద్రకోణములందు నైసర్గిక శుభులు లేకపోవుట మాత్రమే యుండిన చంద్రారిష్టము. పై విధముగా చంద్రుడుండి పాపగ్రహ వేధలుకలిగి, లగ్నమునశుభగ్రహములు లేకుండినను, లగ్నమునకు శుభగ్రహదృష్టి లేకుండినను చంద్రారిష్టము. కొందరు చంద్రుడు వృషభము, మీనము మొదలగు కొన్ని రాసుల యందుండి బలవంతుడై చంద్రారిష్టమును కలుగ జేయడని చెప్పుదురు. ఇది అనుభవములో సరిగానుండుట లేదు.

సౌమ్యబాలారిష్టమనగా జననకాలదశపూర్తియగువరకుచూచుకొనవలసిన బాలారిష్టము. శుభ, పాప గ్రహవీక్షణము మిశ్రమమై యుండినను, శుభపాపగ్రహములు కలిసి లగ్నమందుండినను, ఇతర కేంద్రములందుండినను నిట్టి సౌమ్యబాలారిష్టములు కల్గును. ఈలోపుగా ఆదశలోవచ్చిన అంతరముల బలము నిర్ణయించికొని దానిలో మారకము నిర్ణయించవలెను. ఒకప్పుడు శుక్రదశ అప్పుడే

ప్రారంభమయి, శుక్రదశలో కేత్వంతరములో మారకము చేయ వలసి వచ్చినప్పుడు సుమారు 20 సంవత్సరములగును. సౌమ్య బాలారిష్టము పట్టినప్పుడు 3, 4, సంవత్సరములకంటె జరుగదని కొందరి యభిప్రాయము. ఇది అనుభవమునకు విరుద్ధము.

సద్యోబాలారిష్టమనగా పుట్టిన దినము మొదలు ఒక సంవత్సరము లోపుగా మరణించుట. వీరికి 1-4-5-3-12 మాసములు అత్యంత పాపములు. ఈ కాలములో వచ్చిన పాపత్వముయొక్క ఉత్తరోత్తములనుబట్టి లగ్నషష్ఠాష్టమ వ్యయాధిపతుల అంతరములలో బాలారిష్టము బలమయి మారకము చేయును. ఈ రాసుల యందున్న గ్రహాభుక్తులలోనుకూడ మారకము చెప్పవలెను. షష్టమము పై రాసులకంటె తక్కువబలముకలది పై రాసులలోనున్న శని రాహువులు ఇతర గ్రహములకంటె బలవంతులై, ఇతరుల నతిక్రమించి, వీరు మారకము చేయుదురు. మిధున, కర్కాటక, తుల, మీన రాసుల యందలి చంద్రుడు బలవంతుడనియును, ఇచ్చట చంద్రుడుండగా పుట్టిన శిశువునకు బాలారిష్ట మరణము కలుగదని చెప్పుట చాల శోచనీయము. ఇది బాదరాయణ, గార్గ్య, యవన, వరహామిహిరాదుల మతమునకు వ్యతిరిక్తము, అనుభవమునకు కూడ సరిపోదు. లగ్నమునందు గురుడుండినను ఎల్లప్పుడును బాలారిష్టము కలుగదనుటకూడ తప్పు. ఇది చాలమందికి ఆశ్చర్యముకల్గించును. కాని చాల జాతకములను పరీక్షించిన తరువాత ఇది యెట్లు జరుగునో తెలియగలదు. ఈ విషయము ముందు వ్రాసెదను. పైని చెప్పినట్లు చంద్రుడు మిధున, కర్కాటక, తులా, మీనము, లందున్నప్పుడు బాలారిష్టభంగమని చెప్పుటకంటె చంద్రారిష్టభంగమని చెప్పుట బాగుగనుండును. బాలారిష్టముల నిర్ణయించుటకు ముందు సంధికాలములను, త్యాజ్యకాలములను చూచుకొనవలెను.

సంధులు మూడువిధములు. 1. నక్షత్రసంధి, 2. లగ్నసంధి. 3. కాలసంధి.

1. నక్షత్రసంధి :- నక్షత్రమునకు ప్రారంభమున రెండు గడియలును, అంత్యమున రెండు గడియలును గల సంధి కాలము నక్షత్ర సంధి యనబడును. కొందరు గండాంత నక్షత్రము లగు రేవతి, అశ్వినులకు, ఆశ్రేష, మఖలకు, జ్యేష్ఠ, మూలలకును మాత్రమే ఈ నిర్ణయము చూచుకొనవలెననియును, అప్పుడు మాత్రమే శిశువునకు దోషమనియును చెప్పుచున్నారు. అనగా రేవతిలో ఆఖరు 2-గడియలును, అశ్వినిలో ప్రారంభమున 2-గడియలును, ఆశ్రేషలో ఆఖరు 2-గడియలును, మఖ ప్రారంభములోని 2-గడియలును, జ్యేష్ఠలో ఆఖరు రెండు గడియలును, మూలకు ప్రారంభమున 2-ఘటికలును సంధి కాలములుగా చెప్పబడినవి. ఈ యభిప్రాయమే సరియైనది.

2. లగ్నసంధి :- లగ్నమునకు ప్రారంభమున అరగడియయు, అంత్యమున అరగడియయును లగ్నసంధియని చెప్పబడుచున్నది. కాని ఈ యభిప్రాయము నందరు అంగీకరించియుండలేదు. ఏ లగ్నమునకైనను ప్రారంభమునందుగాని, అంత్యమునందుగాని పావు గడియ మాత్రమె అనగా 6-నిముషములు మాత్రమే సంధి కాలమని చెప్పుచున్నారు. ఇది సరియయిన యభిప్రాయము. కొందఱు నక్షత్రములవలెనే గండాంతరాసులగు మీన మేషములకును, కర్కాటక సింహములకును, వృశ్చిక ధనస్సులకును మాత్రమే అరగడియ చూచుకొని ఇతర రాసులకు మాత్రము పావుగడియ చూచుకొనవలెనని చెప్పుచున్నారు. మఱికొందఱు ఆఖరి నవాంశమునందు జనించిన లగ్నసంధియని చెప్పుచున్నారు.

కాలసంధి :- సూర్యోదయ సూర్యాస్తమయములందు కలుగు సంధి, కాలసంధి యనబడును. సామాన్యముగా సూర్యోదయము

నకు ముందు 2-గడియలును, సూర్యాస్తమయమునకు పిదపవాత 2-గడియలుగాను చెప్పబడినది. ఈ విషయమై భరద్వాజుడు

శ్లో॥ ఉదయాత్ ప్రాక్తనీ సంధ్యాఘటికాద్వయ ముచ్యతే।
సాయంసంధ్యా ద్విఘటికాహ్యాస్తాదుపరి భాస్వతః॥

అని చెప్పినాడు, కాని 2-గడియల కాలమని చెప్పుట జాతక విషయమున సమంజసము కాదు. ముహూర్తవిషయమునమాత్రము రెండు గడియల సంధికాలములలోను సర్వశుభకర్మలు వదలివేయు టకు చాల మంచిది. అందువలన ఈ విషయమై

శ్లో॥ అర్ధాస్తమయాత్సంధ్యావ్యక్తాభూతాని తారకా యావత్ ।
తేజః పరిభాతి ముఖాద్భానోరర్ధోదయో యావత్॥

అని చెప్పబడినది. అనగా సాయంకాలము సూర్యమండలము యొక్క అర్ధాస్తమయము మొదలుకొని నక్షత్రప్రకాశపర్యంతము సాయంసంధ్య యనియును, ఉదయమున ఒకరిముఖము మరొకరికి కన పడు సమయము మొదలు సూర్యమండలముయొక్క అర్ధోదయ పర్యం తము ప్రాతస్సంధి యనియును చెప్పబడినది. ఈ సంధికాలమున పుట్టిన శిశువు బ్రతుకదని చాలమంది యభిప్రాయము. కాని అంత మాత్రమున శిశుమరణము జరుగుననుట తప్పు. ఈ సంధికాలమున పాపగ్రహరాశివచ్చి ఆరాశిలో అంత్యనవాంశమున జననముపొందిన శిశువు మరణించును. ఇది వరాహమిహిరాదుల మతము. ఇదియే సరియయినది. ఇందుకు కారణము కాలసంధియేకాక, రాశిచ్ఛిద్రము కూడ నగుట. ఈ రెండింటిలో రాశిచ్ఛిద్రము శిశుమరణమునకు బలవత్తరము. కాని ఈ విషయమున కూడ భేదాభిప్రాయములు కలవు. సంధికాల మయినంత మాత్రమున భయము లేదనియును, అంత్య నవాంశము చంద్రహోరయయి అందున పాపగ్రహము

లుండుటవలనమాత్రమే మరణము కలుగునని యును వరహామిహి రుడు చెప్పచున్నాడు.

ఈ కాలనిర్ణయములోనే ఇంకొక ముఖ్యవిషయముకలదు. అది జననవిషయమైన నక్షత్రత్యాజ్యగడియలును, వారజనితదుర్ముహూర్త గడియలునుకూడ శిశువునకు మరణము కలుగజేయుచున్నవి అనునది. కట్టి త్యాజ్యగడియలయందు జనించు శిసువు ఒకసంవత్సరము కంటె నెక్కువ బ్రతుకదు. ఈ వారజనిత దుర్ముహూర్తమునకుగాని అందు ముఖ్యముగావర్జ్యగడియలకు లగ్నమందు గురుడుండినను, ఒకప్పుడు మూడు శుభగ్రహము లున్ననుకూడ శిశువు మరణించును. లగ్నసంధికి జననాది 11- రోజులు అరిష్టదినములు. ఈ రోజులు దాటినయెడల లగ్నసంధియను సందేహముండ నవసరము లేదు. ఈ పదునొకండు రోజులలోను 4, 8 రోజు లెక్కువ చెడ్డవి. ఇదే విధముగా జననకాల దశలు అనగా మొట్టమొదట వచ్చిన దశ; లగ్న, అష్టమ, వ్యయాధిపతుల దశ మైనయెడల నాదశ గడచువరకును ఆయువు నిర్ణయించకూడదు. ఒకప్పుడు లగ్నమందు మూడు శుభగ్రహము లున్ననుకూడ ఆదశలో మారకము జరుగుచున్నది. ఒకప్పుడు ఇంత గ్రహబలము లేకపోయినను దాటిపోవుటకూడ కలదు.

బాలారిష్ట విషయమై గ్రహబలము నిర్ణయించుటకు చక్రమునకు పూర్వార్ధమనియును, ఉత్తరార్ధమనియును చెప్పియున్నాడు. లగ్నమునందు పుట్టుసరికి ఎన్నిభాగలు చెల్లినవో అన్నిటిని దశమమునందువదలి తక్కినభాగలును, ఏకాదశమును, ద్వాదశమును, లగ్న, ద్వితీయ, తృతీయరాసులును, చతుర్థమున లగ్నమునందెన్ని భాగలు భుక్తియయినవో అన్నిభాగలును కలుపుకొన్న చక్రమునకు పూర్వార్ధమనియు తక్కినవి ఉత్తరార్ధమనియును

చెప్పబడినది. ఇందుకు బాదరాయణుకు "త్రిరాశిసహితం లగ్నం పూర్వార్ధం షడ్భిరన్వితమ్। పశ్చార్ధం క్లిష్టసంస్థం స్యాచ్చక్రపూర్వాపరే క్రమాత్". నైసర్గిక శుభగ్రహములు ఉత్తరార్ధమునందును, నైసర్గిక పాపగ్రహములు పూర్వార్ధములందును నుండిన సద్యో బాలారిష్టమని చెప్పబడినది. కాని యవనాదులు పై విధముగా గ్రహములుండి కర్కాటక, వృశ్చిక లగ్నములందు పుట్టినవారికి మాత్రమే బాలారిష్టమని చెప్పుచున్నారు. కాని, గర్గి, వీరి నతిక్రమించి ఈ విషయమై చక్కగా చెప్పినాడు.

శ్లో॥ రిపువ్యయగతైః పాపైర్యది వా ధనమృత్యుగైః।
లగ్నే వా పాపమధ్యస్థే ద్యూనే వా మృత్యుమాప్నుయాత్॥

ఈతడు లగ్నము పాపగ్రహ మధ్యస్థమయిన నా యోగము చెప్పినాడు. ఇందుకు దేవలుడు

శ్లో॥ చక్రస్య పూర్వభాగే పాపాస్సౌమ్యాస్తథోత్తరార్థేచ।
వృశ్చికలగ్నే జాతా గతాయుషః" అని చెప్పినాడు.

ఇతని యభిప్రాయ ప్రకారము కర్కాటక లగ్నమునకు పై యోగము చెప్పకూడదనియును వృశ్చికలగ్నమునకు మాత్రమే ఈ యోగము వర్తించును అనియును చెప్పవలెను.

ఇంకను లగ్న; సప్తమములందు, శుభగ్రహములు లేక షష్ట; అష్టమ ద్వితీయ, ద్వాదశములందు పాపులుండగా పుట్టిన శిశువు బాలారిష్టముచే మృతినొందునని చెప్పుచున్నారు. ఇందుకు దేవలుడు

శ్లో॥ లగ్నా ద్ద్వాదశ ధనగైః పాపైః మ్రియతేచరంధ్ర
రిపుసంస్థైః॥ అని చెప్పియున్నాడు.

ఈ యభిప్రాయమునే యవనుడు

శ్లో॥ గ్రహేషు లగ్నాభిముఖేషు సర్వే।
ష్వవాప్తవీర్యేషు స్వవర్గగేషు॥ అనియు

శ్లో॥ రిపువ్యయగతైః పాపై ర్యది వా ధనమృత్యుగైః।
లగ్నేవా పాపమధ్యస్థే ద్యూనేవా మృత్యుమాప్నుయాత్
అనియును చెప్పి ఏకీకరించుచున్నాడు.

ఈ యభిప్రాయమే సరియైనది. లగ్న సప్తమములు పాపగ్రహ మధ్యస్థము లయినప్పుడుకూడ శని, బుధ శుక్రులలో నెవ్వరైనను లగ్నమునందుగాని, సప్తమమందుగాని యుండిన బాలారిష్టభంగము లగును. ఇవి వీరికి స్వక్షేత్రము లయిన మరింత మంచిది. ఇంకను క్షీణములందుగాని ఏకాదశమందుగాని గురుడుండి, లగ్నసప్తమము ను చూచుచుండిన బాలారిష్ట భంగము. ఇచ్చట వరాహమిహి రుడు చెప్పిన బాలారిష్టములను చెప్పి, వాని విషయమున ఇతరుల యభిప్రాయములుకూడ చెప్పి ఈ యోగములు ఎంతవరకు అనుభవ మునకు సరిపోవునో చెప్పుచున్నాను.

శ్లో॥ పాపా ఉదయాస్తగతాః క్రూరేణ యుతశ్చ శశీ।
దృష్టశ్చ శుభైర్న యదా మృత్యుశ్చ భవే దచిరాత్॥
శ్లో॥ క్షీణే హిమగౌ వ్యయగే పాపై రుదయాష్టమగైః।
కేంద్రేషు శుభాశ్చన చేత్ క్షిప్రం నిధనం ప్రవదేత్॥

పాపగ్రహములు లగ్న, సప్తమములందుండినను, చంద్రుడు పాపయుతుడైనను, శుభగ్రహములచే చూడబడకుండినను, క్షీణ చంద్రుడు వ్యయమందున్నను, పాపులు లగ్నాష్టమములందుండినను, నాలుగు కేంద్రములందును ఒక్క శుభగ్రహమైన లేకపోవుట వల నము బాలారిష్టము కలుగును.

ఈ విషయముననే గర్గియు

శ్లో॥ క్షీణే చంద్రేవ్యయగతైః పాపై రష్టమలగ్నగైః।
కేంద్రే బాహ్యగతైః సౌమ్యైర్జాతస్య నిధనం భవేత్॥

పై విషయములు అనుభవమునకు సరిపడుచు చక్కగానున్నవి.

పై యోగములందు గురుడు 5, 9, 11 స్థానములందు లేని యెడల సరిగా సరిపోవును. అనగా కేంద్రములందు గురు, బుధ శుక్రులలో నెవ్వరుగాని, కోణములందు గాని ఏకాదశమందు గాని గురుడైననున్న యెడల పై బాలారిష్టములకు భంగము పై యోగములలో చంద్రుడు పాపులతో కలిసి లగ్న సప్తమము లందుండిన బాలారిష్టమునకు భంగము లేదని వరాహమిహిరుల యభిప్రాయము. చంద్రుడు పాపస్థానములందుగాని, కోణములందుగాని యుండి నైసర్గిక శుభుల సంబంధము లేనియెడల బాలారిష్టము.

ఇందుకు సారావళియందు కళ్యాణవర్మ ఇట్లు చెప్పినాడు

శ్లో॥ వ్యయాష్ట సప్తోదయగేశశాంకే। పాపైస్సమేతే శుభదృష్టిహీనే।
కేంద్రేషు సౌమ్యగ్రహవర్జితేషు।జాతస్యసద్యః కురుతేప్రణాశమ్॥

చంద్రుడు 12, 8, 7, 1, స్థానములందు పాపులతో గూడి నప్పుడుగాని, శుభదృష్టి లేనప్పుడుగాని-కేంద్రములందు శుభగ్రహములు లేనప్పుడు గాని, పుట్టిన శిశువునకు సద్యోమరణము గలుగుచున్నది.

శ్లో॥ శశిన్యరివినాశగే నిధనమాశు పాపేక్షితే।
శుభైరథ సమాష్టకం, దళ మతశ్చ మిశ్రైః స్థితైః॥

చంద్రుడు షష్టాష్టమములందుండి పాపులచే చూడబడినచో సద్యోబాలారిష్టము కలుగును. అట్టి చంద్రుడు శుభులచే చూడబడిన యెడల సౌమ్య బాలారిష్టము కలిగి ఆజాతకుడు ఎనిమిది సంవత్సరములు జీవించును. అట్టి చంద్రుడు శుభాశుభ గ్రహయుతుడైనచో ఆజాతకుడు 4 సంవత్సరములే జీవించును. కాని ఇది శని

శ్లో॥ వర్షేణ షష్ఠాష్టమగ శ్శశాంకో నిహన్తిమాసాదశుభైశ్చ దృష్టిః।
అబ్దాష్టకాత్తైవల సౌమ్యదృష్టో మిశ్రేక్షితో వర్ష చతుష్టయేచ॥

ఇందుకు దేవకీర్తియు నీ క్రిందిరీతిగ జెప్పి యనుకూలు డగుచున్నాడు.

శ్లో॥ వర్షాన్మ్రియతే చంద్రే షష్ఠాష్టమ సంస్థితే విలగ్నర్క్షే।
సద్యః క్రూరైః దృష్టః సౌమ్యై రబ్దాటకాచ్చైవ॥

కాని మాండవ్యుడు శుక్లపక్షమున రాత్రియందును, కృష్ణపక్షమున పగటియందును జనించిన శిశువునకు చంద్రుడు షష్ఠాష్టమములందుండినను, శుభగ్రహవీక్షణముగలనను బాలారిష్టము లేదని చెప్పుచున్నాడు.

శ్లో॥ పక్షేసితే భవతి జన్మయది క్షపాయాం
కృష్ణేథవాహాని శుభగ్రహవీక్ష్యమాణః।
తచ్చంద్రమా రిపు వినాశగతోపి యత్నా
దాపత్సు రక్షతి పితేవ శిశుం నహన్తి॥

మరియు దేవకీర్తి

శ్లో॥ సౌమ్యాః షష్ఠాష్టమగాః క్రూరైర్వక్రోప సంగతైః దృష్టాః।
మాసేన మృత్యుదాస్తే యదిన శుభై స్తత్ర సందృష్టాః॥

అనగా శుభులచే జూడబడని సౌమ్యగ్రహములు 6, 8 స్థానములందుండి క్రూరులతోగాని వక్రించినవారితోగాని సంబంధము కలవారగుచో ఒక మాసము కాలములో బాలుర కరిష్టమునుకల్పింతురు.

షష్ఠాష్టమములందున్న శుభగ్రహములు బలవంతులగు పాపులచే చూడబడుచుండగా పుట్టిన శిశువు ఒక మాసము మాత్రమే బ్రతుకును. లగ్నాధిపతి పాపగ్రహములచేత యుద్ధపరాజితుడై సప్తమమందున్నయెడల అట్టి శిశువు ఒకమాసముకంటె బ్రతుకదు.

శ్లో॥ లగ్నక్షీణే శశిని నిధనం రంధ్రకేంద్రేషు పాపైః।
పాపాంతస్థే నిధన హిబుక ద్యూన యుక్తేచ చంద్రే॥
ఏవం లగ్నే భవతి మదనచ్ఛిద్ర సంస్థైశ్చ పాపైః।
మాత్రా సార్థం యదిచన శుభైర్వీక్షితశ్శక్తిమద్భిః॥

క్షీణచంద్రుడు లగ్నమందున్నప్పుడు అష్టమమునందును కేంద్రములందును నున్న పాపులచేత బాలారిష్టము కలుగజేయబడుచున్నది. చంద్రుడు అష్టమ, చతుర్థ సప్తమములలో నెచటనైన నుండి పాపగ్రహమధ్యస్థుడైనప్పుడు జన్మించిన శిశువు మరణించును. పాపమధ్యస్థుడగు చంద్రుడు లగ్నమందుండి బలవంతులగు శుభులచే చూడబడకపోయినచో, సప్తమాష్టమములందున్న పాపులచేత తల్లితోగూడ శిశువునకు మరణము కలిగింపబడును.

ఈ యోగములో చంద్రునకు శుభగ్రహదృగ్యోగము వలన కేంద్రకోణములందున్న నైసర్గిక శుభులచేతగూడ పై యోగములకు భంగము కలిగించబడుచున్నది.

పై యోగములలో శిశు మరణము జరిగినను మాతృనష్టము కలుగుటలేదు. కాని, శిశువునకు మాతృస్థానమందు పాపగ్రహముండి మాతృస్థానాధిప మాతృకారకుల దశలలో నేదైన వచ్చినప్పుడు మాత్రము మాతృనష్టముకూడ జరుగుచున్నది.

శ్లో॥ రాశ్యంతగే సద్భిరవీక్షమాణే।
చంద్రే త్రికోణో పగతైశ్చ పాపైః॥
ప్రాణైః ప్రయాత్యాశు శిశుర్వియోగ
మస్తేచ పాపైస్తుహినాంశు లగ్నే॥

చంద్రుడు ఏ రాసియందైనను అంత్య నవాంశయందుండి శుభగ్రహములచే చూడబడకపోయిన పంచమనవమములందున్న పాపు

లవే శిశుమరణము కలుగ జేయబడుచున్నది. చంద్రుడు లగ్నమందుండిన సప్తమమందుండలి పాపులచేగూడ శిశుమరణము చేయబడును. ఈ యోగము అనుభవమునకు విరుద్ధము. చంద్రుడు అంత్య నవాంశమును పొంది, జన్మకాలముగూడ అంత్యనవాంశమున పడిన యెడల, లగ్నమునకు శుభగ్రహవీక్షణము లేనియెడలను మాత్రమే బాలారిష్టము జరుగును. లగ్నమునందు చంద్రునుండి కేంద్రకోణ ములలో నెచ్చటను శుభులు లేనియెడల బాలారిష్టము జరుగును.

శ్లో॥ అసిత రవి శశాంక భూమిజైః
వ్యయ నవమోదయ నైధనాశ్రితైః ।
భవతి మరణ మాశు దేహినాం
యది బలినా గురుణా నవీక్షితాః॥

క్రమముగా 12, 9, 1, 8, స్థానములందున్న శని, రవి, చంద్ర కుజులు బలవంతుడగు గురునిచే చూడబడని యెడల సద్యోబాలా రిష్టమును గలిగింతురు. ఇచ్చట బలవంతుడైన గురుడనుటచే అస్తంగతుడు కానివాడని అర్థము. పై విధముగా గ్రహములు ఒకేమారు ఆయా చోటులలోనుండుట సంభవించుట చాలకష్టము. ఈ రవి చంద్ర కుజ శనులు పైన చెప్పబడిన స్థానములలో నెచ్చటనైనను నుండవచ్చును. కాని చంద్రుడు మాత్రము లగ్నమునందు గాని అష్టమమందుగాని యుండితీరవలెను. అప్పుడు వీరిలో నెవ్వరికిగాని గురుసంబంధము లేనియెడల బాలారిష్టము కలుగును.

శ్లో॥ ధామే విలగ్నేచ శుభైరదృష్టే
మృష్టేష్టమే వార్కసుతేన యుక్తే ।
తావస్త సంస్థా శుభదృష్టి హీనా
జాతస్య సద్యః కురుతే ప్రణాశమ్॥

కుజుడు లగ్నమందుండి శుభదృష్టి హీనుడైనను షష్ఠాష్టమము లందు శనితో గూడియున్నను, ఆ శని కుజులు సప్తమమందు శుభ దృష్టి లేనివారై యుండినను సద్యోబాలారిష్టము చేయుచున్నాడు. ఈ యోగము గ్రంధకర్త చాల చక్కగ వ్రాసినాడు. ఈ యోగము పైవిధముగ పట్టినను, వీరికి నైసర్గిక శుభదృష్టికలిగినను, లగ్నమందు శుభగ్రహములుండుటగాని, కేంద్రకోణములందు లేక ఏకాదశమందైనను గురుడుండుటగాని తటస్థించిన పై బాలారిష్టము నకు భంగము గలుగును. వరహామిహిరుడు వ్రాసిన యీ పై బాలా రిష్టములు కాక ఇంకనుఅనేక బాలారిష్టయోగములుఅనుభవములో సరిచూచి, స్వయముగా ఇదివరలో నాచే వ్రాయబడిన జాతక నారాయణీయ గ్రంధమున బాలారిష్టాధ్యాయమున వ్రాయబడినవి ఇవి అనుభవమునుబట్టి వ్రాయబడిన వగుటచే చాలయుపయుక్తము లుగా నుండును.

పారాశర్యమున విరివిగా వాశబడు బాలారిష్ట శ్లోకము నిందు వ్రాయుచున్నాను.

శ్లో॥ చంద్రాష్టమంచ ధరణీసుత సప్తమంచ
రాహుర్నవంచ శని జన్మ గురుస్తృతీయే।
అర్కస్తు పంచ భృగుషట్క బుధశ్చతుర్థే
జాతోన జీవితి ప్రవదన్తితజ్ఞాః॥

అనగా చంద్రుడు షష్టము మందును, కుజుడు సప్తమ మందును, రాహువు తొమ్మిదింటను, శనిలగ్నమందును, గురుడు తృతీయ మందును, రవి పంచమమందును, శుక్రుడు షష్టమమందును, బుధుడు చతుర్థమందును, నున్నయెడల బాలారిష్టము కలుగునని యభి ప్రాయము. దీనిని సాధారణముగా ప్రతివారును వాడుదురు. కాని యిది యనుభవములోసరిపోదు. ఈగ్రహములలో అన్నియు నొకే

మారుపట్టుట యసంభవము. అట్లయినచో ఈ శ్లోకమున కేమి యుపయోగమని సందేహము కలుగవచ్చును. ఇందుకు సమాధానముగా కొందరు "ఇందులో చెప్పినప్రకారము ఏ ఒక్క గ్రహమైనను వానిదశ వచ్చినప్పుడు మారకము చేయు"నని చెప్పుదురు. ఈవిషయము పైదానికంటె కొంత యనుభవముతో జెప్పబడినది. కాని యిదియును అంతటా సరిపోదు. కాని పైవిధముగా గ్రహములలో నేదైనను వుండి, వారు లగ్నాష్టమాధిపతులై వారిదశ ఆరంభమున వచ్చినప్పుడు ఆదశ పూర్తిగ వెళ్ళువరకు ఆయుర్నిర్ణయము నిర్ణయింపరాదు ఇచట కేతువును విడుచుటలో నాతడు బాలారిష్టగ్రహము కాదని సాంప్రదాయము ఈవిషయము నన్ని మతములవారు నేకగ్రీవముగ నామోదించిరి. అనగా కేవలస్థితి వలన కేతువునకు బాలారిష్ట కారకత్వము చెప్పగూడదు. అనగా, అల్ప, మధ్య, పూర్ణాయుర్దాయములను నిర్ణయించి, కేతువుమారకస్థానములందుండి, తన దశ వచ్చినప్పుడు మాత్రమే మారకము చేయగలుగుచున్నాడు.

గద్య

ఇది శ్రీ పార్వతీ పరమేశ్వర కరుణా కటాక్షలబ్ధ మౌద్గల్యసగోత్ర
పవిత్ర మాడ్రేవు వంశపయఃపారావార రాకాసుధాకర శ్రీ
రామస్వామిశాస్త్ర్యాగ్య పౌత్ర వేంకట రాజామాత్య
వేంకట రత్నమాంబాపుత్రసుకవిజనవిధేయ,
జ్యోతిష విద్యాప్రవీణ సూర్యనారాయణ
మూర్త్యభిధేయ ప్రణీతంబైన
జాతక నారాయణీయము
నందు బాలారిష్ట ఖండమను
ద్వితీయ భాగము
సంపూర్ణము.

# జాతకపారిజాతీయము

## ఆయుర్దాయ ఖండము

శ్లో॥ అష్టమం హ్యాయుష్యః స్థానమష్టమాదష్టమంచ తత్।
తయోరపి వ్యయస్థానం మారక స్థాన ముచ్యతే॥

అష్టమస్థానము ఆయుర్దాయమునిచ్చు యిల్లు. అనగా అష్టమమునుబట్టి ఆయుర్దాయమును నిర్ణయించవలెను. ఈ అష్టమము లగాయతు ఎనిమిదవ స్థానముగూడ ఆయుష్య స్థానమగును. ఈస్థానము లగ్నాత్తృతీయమగుచున్నది. అట్టియెడల తృతీయాష్టమములు ఆయుస్థానములగుచున్నవి. అష్టమమునకు సప్తమమును తృతీయమునకు ద్వితీయమును, లగ్నమునకు ద్వాదశమును వ్యయస్థానములై మారకస్థానము లగుచున్నవి.

ఆయుర్నిర్ణయము చేయుటకు తృతీయాష్టమములను, లగ్నమును గూడ చూడవలెను. కొందరు తృతీయమునకు నష్టమగు దశమమును గూడ చూచుచున్నారు. "ఆయుష్యంజీవనోపాయం విద్యాభుక్తిస్తు కంబళః" అని చెప్పబడియుండుటచేత అట్లు చూచుచున్నారు. కాని మొదట చెప్పిన మూడు స్థానములే ముఖ్యములైనవి. వానిని వాని యందుండు గ్రహములనుబట్టియు, కేంద్రకోణములందున్నవైసర్గిక శుభగ్రహములను బట్టియు అల్ప,మధ్య, పూర్ణాది ఆయుర్దాయములను మొదట పీఠికమీద నిర్ణయించవలెను.

ఆయుర్దాయమును నిర్ణయించువిషయమున ముఖ్యమగు మూడు మతములు కలవు. 1. పారాశర్యము 2. జైమిని 3. వరహామిహిర

రాదుల మతములు అవి మూడు విధములు. వీనిలో పారాశర్య మతము అగ్రగణ్యము. అనుభవమునకు సరిపోవుటచేత వాడుచున్నారు. ఈమతము ననుసరించి లగ్న, తృతీయ, అష్టమ స్థానాధిపతుల బలమును, అచ్చటనున్న నైసర్గిక పాపుల బలమును కేంద్రకోణములందున్న శుభుల బలమును ఆయుష్కారకుడగు శని యొక్క బలమును విచారించి అల్ప, మధ్య, పూర్ణాయువులను నిర్ణయించవలెను. జైమిని లగ్నాష్టమాధిపతులనుబట్టి ఆయుర్నిర్ణయము చేసినను చర, స్థిర, ద్విస్వభావ రాసులననుసరించి నిర్ణయించు పద్ధతికెక్కువ ప్రాముఖ్యత నిచ్చియున్నారు. అటులను అల్ప, మధ్య పూర్ణాయువులను నిర్ణయించినారు. జైమిని సూత్రములకు వ్యాఖ్యానములను వ్రాసినవారు ఆయుష్కారకుడగు శనిని తీసికొనలేదు. పీఠికపై ఎక్కువ భాగలను పూర్తిచేసిన గ్రహములను వరుసగా తీసికొని కారకత్వమును చెప్పినారు. అది అనుభవమునకు సరిపోవుట లేదు. కాని,జైమిని యభిప్రాయమిది కాదు. సాంప్రదాయమేమనగా జీవితమును 12 భాగములుగా విడదీసి ప్రతిభావమునకును ఆ భావ సంబంధమగు బలాబలములను నిర్ణయించుటకు రెండు శక్తులను తీసికొనియున్నారు. పరమాత్మశక్తియును, మనోశక్తియును, అనగా స్థానాధిపతియును కారకుడునునైన వాటి ఉపశక్తులగు స్థితి సంబంధము, దృష్టి, మొదలగు వానిచేత భావసంబంధమగు బలాబలములు నిర్ణయింపబడినవి. ఇది సర్వఋషి సమ్మతము. ఈకాలములోనివాడే యగు జైమిని ఈ సాంప్రదాయమును వదలినాడనుట సమంజసము కాదు. ఈ ఋషి ఆయుర్భావమును గురించి వ్రాయుచు "అయుః పితృదినేశాభ్యాం" అని చెప్పినాడు. అనగా ఆయుర్దాయము, లగ్నమును బట్టియును, కారకుడైన రవిని బట్టియును నిర్ణయించవలెనని చెప్పినాడు. కాని వ్యాఖ్యాతలు "దినేశ" శబ్దమునకు అక్షరసంజ్ఞ ప్రకారము అష్టమమని ముడివేయుచున్నారు. వీరి అభిప్రాయము,

అష్టమమును ఈ మహర్షి వదలియుండలేదు, కాని గురు పరంపరచే వచ్చు ఋషి సాంప్రదాయము లగ్నము చెప్పిన అష్టమము చెప్ప నక్కరలేదు.

ఈ కారణమువలన పారాశరియందు అష్టమము మాత్రమే చెప్పబడినది. అట్లే జైమిని మతమున లగ్నము మాత్రమే చెప్పబడినది. ఇంకొక పొరపాటు "స్వగ్రహాః" అని ఈ ఋషి చెప్పినప్పుడు గ్రహము పేరు చెప్పినప్పుడు అక్షరసంజ్ఞ కాదకూడదని తానే చెప్పినాడు. దినేశశబ్దముకు అక్షరసంజ్ఞప్రకారము అష్టమమని సమర్థించుట శోచనీయము. కావున ఈమతప్రకారము రవి ఆయుః కారకుడగును. ఇది అనుభవముకు కూడ సరిగా నుండును. ఈమత ప్రకారముకూడ లగ్న, అష్టమ, రవులనుబట్టి ఆయువు నిర్ణయించవలెను. ఇదికూడ అనుభవముకు సరిపోవును. ఇక మూడవదగు వరాహమిహిరాదుల మతమునందు కారకులతో సంబంధములేక ప్రతిగ్రహమునకు ఇన్నిసంవత్సరములు ఆయుర్దాయమునియ్యగలరనియును ఆయాయుఃప్రమాణము వారి స్థితిగతుల ననుసరించి బలము నిర్ణయించిన తరువాత ఏ నిష్పత్తిననుసరించి ఆబలము మిగులునో అంత ఆయువు నియ్యగలరనియును, అట్లు అన్నిగ్రహములకు నిర్ణయించుకొని మొత్తము ఆయువును నిర్ణయించవలెననియును వారి మతము. కాని ఈమతములన్నింటిలోను పారాశర్యమే అగ్రగణ్యముగా భావించబడుచున్నదని ఇదివరలో చెప్పియున్నాను.

ఇదివరలో చెప్పినప్రకారము పీఠికమీద గ్రహ బలము నిర్ణయించి ఆయుర్దాయము ఏభాగములో పడునో చూచుకొని అప్పుడు ఆభాగములో వచ్చిన దశలలో నెవ్వరు మారకము చేయుదురోఅను సంగతి నిర్ణయించవలెను. ఇక మారకులనగా నెవ్వరు? వీరియొక్క బలాబలముల నెట్లు నిర్ణయించవలెను? అను విషయములు ఆలోచించవలెను. అష్టమం ఆయుస్థానం అనియూ అష్టమం నిధనం

రంధ్రం అనియు మహర్షులచేత చెప్పబడినది. అనగా అష్టమము ఆయుష్థానమని ఎప్పుడైతే చెప్పుకొనియున్నారో అప్పుడే అష్టమము మారకస్థానమని వేరుగా చెప్పనక్కరలేదు.

ఇట్లే లగ్నమునకు వ్యయస్థానము 12, అష్టమమునకు వ్యయస్థానము 7, తృతీయమునకు వ్యయస్థానము 2. ఈ మూడుస్థానములు తిరిగి మారక స్థానములుగా నేర్పరుపబడినవి. ఇంతకంటె తక్కువ 6, 11, 10 స్థానములు. కాబట్టి 1, 8, 3 స్థానములు ప్రబలములని యును, 2, 7, 12 స్థానములంతకంటె కొంచెము తక్కువ యని యును 6, 11, 10 స్థానములు అంతకంటెను చాల తక్కువ యని యును గ్రహించవలెను. ఇట్లు మూడు రకములుగా నిర్ణయించిన మారక గ్రహముల యుపయోగమేమనగా ఒకప్పుడు ఆయుర్దాయము నిర్ణయించిన తరువాత ఏభాగములో మారకత్వము పడునో ఆభాగములో మొదటి ప్రబలమారక గ్రహదశలు రాకపోవచ్చును. అప్పుడు రెండవ రకములోని గ్రహదశలు వచ్చిన అందులో మారకమును నిర్ణయించవలెను. వానిలోగూడ లగ్నముకంటెతృతీయము తృతీయముకంటె అష్టమమును ప్రబలములు. అట్లే ద్వాదశము కంటె సప్తమము, సప్తమముకంటె ద్వితీయమును మారకవిషయమున ఉత్తరోత్తరముచే బలవంతమగును.

శ్లో॥ తత్రాప్యావ్యయస్థానా దుత్తరం బలవత్తరం।
తదీశతుస్తత్రగతాః పాపినస్తేన సంయుతాః॥

అష్టమమునకు వ్యయస్థానమగు సప్తమము పైనిచెప్పిన మారక స్థానములలోకెల్ల బలవత్తరమైనది. అనగా 7, 2 స్థానములలో ద్వితీయము సప్తమముకంటె మారక విషయమున బలవత్తరమైనది. ద్వితీయ స్థానాధిపతికంటెద్వితీయమందున్న గ్రహములును, ద్వితీయ సప్తమాధిపతులతోగూడిన గ్రహములును ఎక్కువ బలవంతులు.

శ్లో॥ తేషాం దశావిపాకేషు సంభవే న్నిధనం నృణామ్ ।
తేషా మసంభవే పాకా ద్వ్యయాధీశ దశాస్వపి॥

పైని చెప్పిన మారకులయొక్క అనగా (1, 8, 3 స్థానాధిపతులనుగూడ చూచుకొనవలెను.) 2, 7 స్థానాధిపతులయొక్కగాని, ఆ స్థానములందున్న గ్రహముల దశాంతర్దశలయందుగాని నరులకు మరణము కలుగుచున్నది. కొందరు "దశావిపాకేషు" అనుమాటకు దశాంత్యమున అని చెప్పుచున్నారు. పైని చెప్పినవారి దశాంతర్దశల యందు మారకము కలుగనియెడల లగ్నాత్తు వ్యయాధిపతి దశ యందు మారకము జరుగుచున్నది. ఇచ్చట "2, 7 స్థానాధిపతుల దశలయందు మారకము చేయకపోయినను" అను సందేహము గ్రంథకర్తకు కలుగుటకు కారణము కలదు. ఒకప్పుడు వారిదశలు వచ్చినను మారకము జరుగుటలేదు. ఇందులకు కారణము అల్ప, మధ్య, పూర్ణాది ఆయువులను నిర్ణయించకుండగనే మారకదశలు వచ్చినంతమాత్రమున మారకముచేయునని చెప్పుటయే, ఇది పొర పాటు. మరియు 1, 8, 3 స్థానాధిపతుల దశలు వచ్చినప్పుడు వారును మారకము చేయుదురు. అనగా, 2, 7, 12 స్థానాధిపతుల నతిక్రమించి మారకము చేయుదురు. ఆయుర్నిర్ణయము చేయు నప్పుడు అల్పములో అల్పమా? మధ్యములో మధ్యమా? పూర్ణ ములో పూర్ణమా? అను విషయమునుకూడ చూచుకొనవలెను.

శ్లో॥ అలాభేపునరేతేషాం సంబంధేన వ్యయేశితుః ।
క్వచి చ్ఛుభానాంచ దశా స్వష్టమేశ దశాసుచ॥

సప్తమ ద్వితీయాధిపతులయొక్క దశలు రానిపక్షమున వారితో సంబంధముకలిగిన యోగకారక వ్యతిరిక్త శుభగ్రహములయొక్క

దశా తరములందు ఒకప్పుడు మరణమును కలుగుచున్నది. వారు అట్లు మారకము చేయనియెడల అష్టమాధిపతి దశయందు మారకము కలుగుచున్నది. ఈ శ్లోకమున అష్టమాధిపతిగూడ మారకవిషయమున బలవంతుడని చెప్పబడినది.

శ్లో॥ కేవలానాం చ పాపానాం దశాసు నిధనం క్వచిత్ ।
కల్పనాయం బుధై ర్నృణాం మారకాణా మదర్శనే॥

జాతకమునందు ఒకానొకప్పుడు మారక గ్రహములు కనుపించనప్పుడు, బలవత్తరమైన ఇతర పాపగ్రహదశలలో మరణముకలుగుచున్నదని పండితులు చెప్పిరి. అనగా పీఠికమీద నిర్ణయింపబడిన ఆయుష్కాలమునకు ప్రబలమారక గ్రహముల దశలు రానిచో నితర పాపగ్రహదశలు వచ్చినప్పుడు మారకము కలుగుచున్నది. ఇచ్చట ఇతర పాపగ్రహములనగా స్థితివలన మారకలక్షణములు లేకున్నను, ఆధిపత్యముచేత మారక లక్షణములు గలవారు అని భావము. దీనినిబట్టి ఈ క్రిందివిషయము అనుభవమునకు సరిపోవుచున్నది. కేంద్రాధిపత్యముపట్టి కేంద్రములందుగాని, మారక స్థానములందుగాని యున్న గ్రహములుగాని; కోణాధిపత్యముపట్టిన నైసర్గికపాపులు తిరిగి కోణములందుగాని మారక స్థానములందుగాని యున్నప్పుడు మారకము చేయుచున్నారు.

శ్లో॥ మారకైస్సహసంబంధా న్నిహంతా పాపకృచ్ఛనిః
అతిక్రమ్యేతరాన్ సర్వాన్ భవత్యేవ నసంశయః॥

స్వతస్సిద్ధముగా అపకారియగు శని మారక గ్రహములతో, సంబంధము కలవాడైనచో ఇతర మారక గ్రహముల నతిక్రమించి నిస్సందేహముగా మరణమును కలుగచేయుచున్నాడు. ఇచ్చట గ్రంథకర్త శనికి మారకవిషయమున ప్రాముఖ్యతనిచ్చియున్నాడు. "పాపకృచ్ఛనిః" అనుటలో మారక లక్షణములు పట్టిన శని అని

తెలియవలెను. గ్రంథకర్త అభిప్రాయము ప్రకారము శనికి మారక లక్షణములు పట్టి మారకులతో కలసినప్పుడు ఇతర మారకగ్రహములనతిక్రమించి తానే స్వయముగా మారకము చేయునని, ఈవిషయమునైనను మొదట పీఠికమీాద ఆయుర్నిర్ణయము చేసిన మీాదటనే చేయవలెను. శనికివలెనే రాహువు విషయమునను చూచుకొనవలెను. ఇది సాంప్రదాయకమై యనుభవమునకు సరిపోవుచున్నది.

## గద్య

ఇది శ్రీ పార్వతీ పరమేశ్వర కరుణా కటాక్ష లబ్ధ మౌద్గల్యసగోత్ర
పవిత్ర వాడ్రేవువంశ పయఃపారావార రాకాసుధాకర శ్రీ
రామస్వామీశ్వరపౌత్ర వేంకట రాజామాత్య
వేంకటరత్నమాంబా పుత్ర సుకవిజనవిధేయ,
జ్యోతిష విద్యాప్రవీణ సూర్యనారాయణ
మూర్త్యభిధేయ ప్రణీతంబైన
జా త క నా రా య ణీ య ము
నందుఆయుర్దాయఖండమను
తృ తీ య భా గ ము
సంపూర్ణము.
ఓమ్



# జాతక నారాయణీయము

## మిశ్రమఫల ఖండము

శ్లో॥ ప్రతిలగ్నం సమాలక్ష్య పూర్వోద్దిష్టావిరోధితః ।
తత్తద్గ్రహస్వరూపాణి క్రమేణైవ వివృణ్మహే ॥

మేషాది ద్వాదశ రాసులకు వరుసగా చక్కగా నాలోచించి పూర్వము చెప్పబడిన ఫలితములకు వ్యతిరిక్తము కాకుండగా ఆయా గ్రహముల లక్షణములను అనగా యోగ్యతలను వివరించుచున్నామని భావము. అనగా నే రాసికి నెవరు యోగకారకులో నెవరు మారకులో నిర్ణయించబడినది. ఈ శ్లోకము పరాశర ప్రోక్తము కాదనుటకు "పూర్వోద్దిష్టావిరోధితః" అను పద ప్రయోగమే ఆధారము. పూర్వము చెప్పబడిన అనగా పూర్వము పరాశరునిచే చెప్పబడిన అని తెలియవలెను. ఈ మిశ్రఫలఖండము లోని శ్లోకములు వెంకటేశ్వర దైవజ్ఞునిచే చేర్చబడినవి.

### మేషలగ్నమునకు

శ్లో॥ మందసౌమ్యసితాః పాపాశ్శుభౌ గురుదివాకరౌ ।
నశుభం యోగమాత్రేణ ప్రభవేచ్ఛనిజీవయోః ॥
పరంతు తేనజీవస్య పాపత్వమపి సిధ్యతి ।
కవిస్సాక్షాన్నహంతాస్యా న్మారకత్వేన లక్షితః ॥
మందాదయో నిహంతారో భవేయుః పాపినోగ్రహాః ।
శుభాశుభ ఫలాన్యేవం జ్ఞాతవ్యాని క్రియాభువః ॥

మేషలగ్నమునకు అనగా మేషము జన్మలగ్నమైనచో శని, బుధ శుక్రులు పాపులును ; రవి, గురులు శుభులును నగుచున్నారు.

 

శని గురుల పరస్పర సంబంధమువలన యోగము కలుగుటలేదు. శని సంబంధమువలన గురుడు ఎక్కువ పాపి యగుచున్నాడు. మారక లక్షణములుకల శుక్రుడు తాను స్వయముగా చంపుట లేదు. శని మొదలయిన ఇతర పాపగ్రహములే చంపువారు అగుచున్నారు. "శుక్రుడు తాను స్వయముగా చంపుటలేదు" అని చెప్పుటలో శుక్రుడు మారక లక్షణములు పట్టిన ఇతర పాపగ్రహముల దశలయందు తనయంతరమున మారకము చేయును.

మేష లగ్నమునకు శని గురు సంబంధము యోగప్రదము కాదని చెప్పబడినది. కాని ఇది అన్నిచోట్లను వర్తించదు. వీరు పాప స్థానములందు కలసినప్పుడు మాత్రమే మంచివారు కారు. కేంద్ర కోణములందు (తుల తప్ప) మంచివారు. ధనలాభములందు ధన వినయమున శుభులు, వీరు కలిసియుండుటకంటె విడిపోయి శుభ స్థానములందుండుట మంచిది. గురునకు రవి సంబంధము ఎక్కువ అశుభప్రదమని అనుభవమువలన తెలుచున్నది. ఆలోచించినచో రవి శుక్రులు ఈ లగ్నమునకు పాపులగుచున్నారు. వీరు కలసి భాగ్యరాజ్యములందుగాని, పంచమ సప్తమములందుగాని, లగ్న వాహనములందుగాని యున్నయెడల పాపఫలము నిచ్చెదరు. మారక స్థానములగు ద్వితీయ సప్తమాధిపత్యములు పట్టినను శుక్రుడు స్వయముగా మారకము చేయడు. మారకమునకు లగ్న తృతీయాష్టమాధిపత్యములు పట్టిన కుజ బుధులు ఎక్కువ పాపులు

## వృషభ లగ్నమునకు

శ్లో॥ జీవశుక్రేందవః పాపా శ్శుభా శనిదివాకరౌ ।
రాజయోగకర స్సాక్షా దేక ఏవాంశుమత్సుతః ॥
జీవాదయో గ్రహాః పాపాః ఘ్నంతి మారక లక్షణాః ।
బుధైస్తత్తత్ఫలాన్యేవం జ్ఞేయాని వృషజన్మనః ॥

వృషభలగ్న జాతకమునకు గురు శుక్ర చంద్రులు పాపులు. రవి శనులు శుభులు. శనియొక్కడే స్వతంత్రముగా రాజయోగము నిచ్చుచున్నాడు. గురుడు మొదలగువారు మారకలక్షణములను కలిగి మరణమును కలుగచేయుచున్నారు.

ఈ లగ్నమునకు రవి శనులు చక్కని యోగకారకులని చెప్పబడినది. కుజుడుకూడ యోగప్రదుడే యగుచున్నాడు. ఇతనిని ఏల చెప్పలేదో తెలియదు. కేంద్రాధిపత్యము కుజునకుదోషప్రదము కాదు. కాబట్టి యోగము యిచ్చుచున్నాడు. శని తనకుగల కోణాధిపత్యదోషమువలన ఫలదములందు మాత్రమే యోగము నిచ్చుచున్నాడు. కోణములందు యోగప్రదుడు కాడు. రవి కుజులు కేంద్రములందేగాక కోణములందుగూడ మంచి యోగము నిచ్చుచున్నారు. ఈలగ్నమునకు రవి శనులు తప్ప యితర గ్రహములు మారక స్థానములందుండిన ప్రబల మారకులై మారకము చేయుదురు.

## మి థు న ల గ్న ము న కు

శ్లో॥ భౌమజీవారుణాః పాపా ఏక ఏవశుభః కవిః ।
శనైశ్చరేణ జీవస్య యోగో మేషభువో యథా ॥
కుజభాన్విందవః పాపా ఏకఏవశుభః కవిః ।
రాజయోగకరా శుక్ర సోమ పుత్రౌశుభాన్వితౌ ।
శని జీవసమాయోగాత్ఫలం మేషభువోయథా ।
విధు సౌమ్యౌన్న హంతాస్యా న్మారకత్వేన లక్షితః ॥
భౌమాదయో నిహంతారో భవేయుః పాపినో గ్రహాః ।
శుభాశుభ ఫలంజ్ఞేయ మిత్థంహి యుగజన్మనః ॥

ఈలగ్నమునకు కుజ గురులు పాపులు, శుక్రుడొక్కడే శుభుడై రాజయోగమునిచ్చును. మేషలగ్న విషయమున వలెనే దీనికిని

గురుశనుల సంబంధము అవయోగ ప్రదము. కుజ రవి చంద్రులు కూడ పాపులగుచున్నారు. శుక్ర బుధులు రాజయోగ కారకు లగుచున్నారు. మారక లక్షణములుకల శని ప్రత్యక్షముగా చంపువాడు కాడు. పాపులైన కుజుడు మొదలగు గ్రహములు మారకమును కలుగచేయుచున్నవి. మేషలగ్నమునకు వలెనే దీనికిని గురుశనుల సంబంధము అవయోగ ప్రదమగుచున్నది. అనగా మేషలగ్నమునకువలె దీనికిని యోగము నిర్ణయించవలెనని అభిప్రాయము. మేషలగ్నముకంటె ఈలగ్నమునకు గురు శనులు ప్రబల పాపులు. మేషలగ్న విషయమున గురునకు నవమ కోణాధిపత్య శుభత్వమును శనికి దశమ కేంద్రాధిపత్య శుభత్వ మును కలవు. మిధునలగ్నమునకు గురు శనులు ఆధిపత్యముల వలన పాపులగుచున్నారు. ఇట్టియెడ పై రెండు లగ్నములకు పోలికను సమర్థించుట పొరపాటు. యోగ విషయమున యీరెండు లగ్నములకు సమానముగా చూచుకొనగూడదు. మారక విషయ మున గూడ శని ప్రత్యక్ష మారకుడని చెప్పుటకూడ సరిగాలేదు. శని ఒక్కొక్కప్పుడు ప్రత్యక్ష మారకుడగుచున్నాడు. శుక్రునకు వ్యయాధిపత్య దోషములేదు. మరియు ఆధిపత్యముచేత శుభుడు అగుచున్నాడు.

## కర్కటకలగ్నమునకు

శ్లో॥ శుక్రమంద బుధాః పాపాశ్శుభాధిపణ భూసుతౌ ।
రాజయోగ కరస్సాక్షా దేకఏవ ధరాసుతః ॥
భవేతాం రాజయోగస్య కారకౌ గురుభూమిజౌ ।
రవి సాక్షాన్న హంతస్యా న్మారకత్వేన లక్షితః ॥
శుక్రాదయో నిహంతారో భవేయుః పాపినో గ్రహాః ।
కులీర సంభవ స్యైవం ఫలాన్యూహాని సూరిభిః ॥

ఈ లగ్నమునకు శుక్ర శని బుధులు పాపులు, గురుకుజులు శుభులు. కుజుడొక్కడే ప్రత్యేకముగా రాజయోగకారకు డగుచున్నాడు. గురుకుజులు ఇద్దరు యోగకారకులు. అనగా వారి సంబంధము రాజయోగప్రదమని భావము. మారకలక్షణములతో గూడిన రవి ప్రత్యక్షముగా చంపుటలేదు. మారకత్వమునకు పాపులగు శుక్రుడు మొదలగువారు చంపుచున్నారు. ఈ లగ్నమునకు కుజునకు దశమాధిపత్యమువలన శుభత్వమును, పంచమాధిపత్యమునలన పాపత్వమును కలుగుచున్నది. అందువలన నితడు మకరమున తప్ప ఇతర కేంద్రములలో యోగించును. కోణములందున్నచో అపయోగప్రదుడగును. స్వక్షేత్రమైనచో కొంత అపయోగము తగ్గును.

## సిం హ ల గ్న ము న కు

శ్లో॥ మందసౌమ్య సితాః పాపా కుజయేవ శుభావహాః
పరిభవే ద్యోగ మాత్రేణ నశుభం గురుశుక్రయోః ॥
గురుయుక్తో యథాభౌమః విశేష ఫలదాయకః ।
శని సాక్షా న్నహంతాస్యా న్మారకత్వేన లక్షితః ॥
ఘ్నంతి సౌమ్యాదయః పాపా మారకత్వేన లక్షితః ।
ఏవం ఫలానిజ్ఞేయాని సింహజస్య మనీషిభిః ।

ఈలగ్నమునకు శని బుధ శుక్రులు పాపులు. అంగారకుడు యోగప్రదుడు. గురు శుక్రుల కలయిక శుభప్రదము. కుజుడు గురునితో కలసినప్పుడు మంచియోగము నిచ్చువాడగుచున్నాడు. మారకలక్షణములు కల శని చంపుటలేదు. పాపులైన బుధుడు మొదలగువారు చంపుచున్నారు. కుజునికంటె రవి శనులు ఎక్కువగ యోగప్రదులు. కుజునకు ముందు కేంద్రాధిపత్యము తరువాత

కోణాధిపత్యమును పట్టుటవలన కేంద్రములందు తప్ప కోణస్థలం దెక్కడనున్నను అత్యంత అనయోగము. గురుఁడష్టమాధిపతియై నవమ కోణాధిపతియగు కుజునితో కలిసిన యోగప్రదము. అష్టమాధిపత్య సంబంధమువలన కుజునకు కోణాధిపత్యదోషముపోయి శుభుడుగా మారును.

## కన్యాలగ్నమునకు

శ్లో॥ జీవశుక్రేందవః పాపా ఏకోభృగు సుతశ్శుభః ।
రాజయోగ కరస్సౌమ్యో భృగుపుత్ర సమన్వితః ॥
నహంతి కవిరన్యేతు మారకాఖ్యాః కుజాదయః ।
ఘ్నంతి పాపాశ్శుభా న్యాహోన్యేవం కన్యాభువో బుధైః ॥

ఈలగ్నమునకు గురు శుక్ర చంద్రులు పాపులు. శుక్రుడొక్కడే శుభుడు. శుక్రునితోగూడిన బుధుడు రాజయోగ కారకుడు. శుక్రుడు మారకమును చేయడు. మారకలక్షణములు కల కుజుడు మొదలగువారు చంపెదరు. పాపులతో శుక్రునిగూడ చేర్చినాడు. అట్లు చేయరాదు. శుక్రుడు శుభుడు. భాగ్యరాజ్యాధిపతులైనను బుధశుక్రులసంబంధము మంచిదికాదు. వేరు కలియక బుధుడు పాపస్థానములందును, శుక్రుడు శుభస్థానములందును వుండుట చాలమంచిది. ఈ లగ్నమునకు శనియొక్క ఫలితమును మిథున లగ్నమునకువలెనే చూచుకొనవలెను. అనుభవమునకు సరిపోవును. ఈలగ్నమునకు యీక్రింది గ్రహములకు యీ దిగువ చెప్పినట్లు స్థానాధిపత్యములు కలుగుటవలన మిథున కన్యలకు ఫలితములను సమానముగా చూచుకొనవలెను.

| గ్రహము | మిథునమునకు | కన్యకు |
|---|---|---|
| గురుడు | 7–10 లకు | 4– 7 |
| బుధుడు | 1– 4 లకు | 1–10 |
| | (ఉభయ కేంద్రాధిపత్యములు) | |

| | | |
|---|---|---|
| శని | 8- 9 లకు | 5- 6 |
| | (ఒక కోణాధిపత్యము, ఒక పాపస్థానాధిపత్యము) | |
| చంద్రుడు | 2- లకు | 11-2 |
| | (మిశ్రమ స్థానాధిపత్యములు) | |
| రవి | 3- | 12 |
| | (రెండును పాపస్థానాధిపత్యములు) | |
| కుజుడు | 6-11 లకు | 3- 8 |
| | (రెండును పాపస్థానాధిపత్యములు) | |
| శుక్రుడు | 5-12 లకు | 2- 9 |
| | (ఒక కోణాధిపత్యము ఒక పాపాధిపత్యము) | |

## తులాలగ్నమునకు

శ్లో॥ జీవార్క మహీజాః పాపా శ్శనైశ్చర బుధౌ శుభౌ ।
రాజయోగకర స్సాక్షాదేక ఏవాంశు మత్సుతః ॥
భవేతాం రాజయోగస్య కారకావిందు తత్సుతౌ ।
కుజ స్సాక్షా న్నహంతాస్యా న్మారకత్వేన లక్షితః ॥
జీవాదయో నిహంతారో భవేయుః పాపినో గ్రహాః ।
శుభాశుభ ఫలేస్వేవం జ్ఞాతవ్యాని తులాభవః ॥

ఈ లగ్నమునకు గురు సూర్య కుజులు పాపులు. శని బుధులు శుభులు. శనియొక్కడే స్వతంత్రుడై రాజయోగమునిచ్చును. చంద్ర బుధులు రాజయోగ కారకులగుచున్నారు. మారకలక్షణములుకల అంగారకుడు ప్రత్యక్షముగా చంపుటలేదు. గురుడు మొదలగువారు పాపులై మారకము చేయుదురు. యోగవిషయమున ఈ లగ్నమునకు రవి గురు కుజులు పాపులని చెప్పుటకంటె

రవి శని గురులను పాపులని చెప్పుట సరిగానుండును. శని బుధులు కూడ శుభులు కారు. శని స్వతంత్రముగా రాజయోగము నిచ్చునని చెప్పుటకంటె కుజుడట్టి పనిచేయ సమర్థుడని చెప్పుట సరిగా నుండును. చంద్ర కుజ బుధులు శుభులగుదురు.

## వృ శ్చి క ల గ్న ము న కు

శ్లో॥ బుధః శుక్రార్క తనయాః పాపా స్సురగురుశ్శుభః ।
సూర్యచంద్రమసావేవ భవేతాం యోగకారకౌ ॥
జీవో నహంతా సౌమ్యాద్యాహంతారో మారకాహ్వయా,
తత్ఫలాని విజ్ఞేయాన్యేవం వృశ్చిక జన్మనః ॥

ఈ లగ్నమునకు బుధ శుక్ర శనులు పాపులు. గురుడు శుభుడు. సూర్యచంద్రులు రాజయోగ కారకులు. గురుడు మారకమును చేయుటలేదు. మారక లక్షణములు కల్గిన బుధుడు మొదలగువారు చంపువార లగుచున్నారు. రవి చంద్రులు కేంద్రకోణములందున్న మంచి యోగము నిచ్చుచున్నారు. ద్వితీయ స్థానాధిపత్యము పట్టిన గురుడు ప్రత్యక్ష మారకుడు కాడు.

## ధ ను ర్ల గ్న ము న కు

శ్లో॥ ఏక ఏవ కవిః పాపః శుభౌ భౌమ దివాకరౌ ।
యోగో భానూ సౌమ్యాభ్యాం స్యాన్నహంతాంశుమత్సుతః
ఘ్నంతి శుక్రాదయః పాపా హంతృలక్షణ లక్షితాః ।
జ్ఞాతవ్యాని ఫలాన్యేవం చాపజన్య మనీషిభిః ॥

ఈ లగ్నమునకు శుక్రుడొక్కడే పాపుడు. కుజ రవులు శుభులు. రవి బుధులు యోగకారకులు. శని మారకము చేయడు. మారక లక్షణములు పట్టిన శుక్రాదులు మారకమును చేయుదురు. శుక్రుడీ లగ్నమునకు యోగకారకుడు ఎందువల్లననగా నీతనికి కేంద్రాధి

పత్యదోషము లేకపోవుటచేత, శుక్రుడు కేంద్ర కోణములందున్న మంచియోగప్రదు డగును. రవికుజులు పైనచెప్పినట్లు యోగకారకులు కారు. వీరికి కోణాధిపత్యదోషము కలుగుటవలన పాపులై కోణములం దెచ్చటనున్నను అవయోగమునే చేయుచున్నారు. రవి బుధులుకూడ యోగకారకులుకారు. వీరు కేంద్రకోణములం దత్యంత పాపప్రదులు. పాపస్థానములందు యోగమునిత్తురు. వీరు కలియక విడిగానున్నచో శుభమగును. విడిగా పాపస్థానములందు మరింత మంచిది. శనికంటె అష్టమాధిపత్యము పట్టిన చంద్రుడు ప్రత్యక్షమారకుడని చెప్పుట సరిగానుండును.

## మకర లగ్నమునకు

శ్లో॥ కుజజీవేందవః పాపాశ్శుభౌతు కవిచంద్రజౌ ।
రాజయోగకర సాక్షాదేక ఏవ భృగోస్సుతః ॥
చంద్రాత్మజేన సంయుక్తో విశేష ఫలదాయకః ।
స్వయంచైవ నహంతాస్యాన్మందో భౌమాదయఃపరే ॥
నిహంతారః పాపిన స్తే మారకత్వేన లక్షితాః ।
జ్ఞాతవ్యాని బుధై రేవం ఫలాని మృగజన్మనః ॥

ఈ లగ్నమునకు కుజ గురు చంద్రులు పాపులు. శుక్ర బుధులు శుభులు. శుక్రుడు స్వతంత్రముగ రాజయోగమును చేయును. మరియు బుధునితో చేరినచో విశేషశుభము నిచ్చును. శని స్వతంత్రముగా మారకమును చేయజాలడు. పాపులైన కుజుడు మొదలగువారు చంపుచున్నారు. కుజ గురు చంద్రులచు పాపులనుటకంటె గురుచంద్రులు పాపులనినచో సరిగా నుండెడిది. లాభాధిపత్యము పట్టి మరొక యాధిపత్యమున్నప్పుడు, లాభాధిపత్యమునకుస్వతంత్రత లేకపోవుటవలన రెండవ యాధిపత్య సంబంధమగు శుభమునుగాని యశుభమునుగాని యిచ్చును. ఇచ్చట కుజునకు 4–11 స్థానముల

కాధిపత్యము కలిగినది. చతుర్థ కేంద్ర సంబంధమగు శుభమునే యిచ్చును. అందువలన కుజుడు శుభుడగుచున్నాడు. కేంద్రకోణము లందు యోగము నిచ్చుచున్నాడు. ఈ లగ్నమునకు బుధ కుజులు శుక్రునికంటెను యోగకారకులు. కేంద్రకోణములందు మంచి రాజ యోగము నిచ్చెదరు. బుధ శుక్రుల కలయిక మంచిదికాదు. వీరు విడిపోయి బుధుడు కేంద్రకోణములందును, శుక్రుడు పాపస్థానము లందుండుట మంచి రాజయోగము. శని బుధుల కలయిక దశమ కేంద్రమునతప్ప ఇతర కేంద్ర కోణములందు చాలమంచిది. శని శుక్రులు పంచమమందుతప్ప ఎక్కడ కలసినను యోగమునివ్వరు. ఈ శనిశుక్రులు పాపస్థానములందు కలసినయెడల శని యోగము నివ్వక శుక్రుడుమాత్రము యోగమునిచ్చును. ఆ కలయిక కేంద్ర కోణములందైనచో శుక్రుడు మాత్రము యోగము నివ్వక శని మాత్రము యోగమునిచ్చును. మకరమునకు కుజుడు స్వయముగా మారకము చేయునని చెప్పుట సరిపోవును.

## కుంభ లగ్నమునకు

శ్లో॥ కుజజీవేందవః పాపా ఏకోదైత్య గురుశ్శుభః ।
రాజయోగకరౌభౌమ కవీత్యేకో బృహస్పతిః ॥
నహంంతాఘ్నంతి భౌమాద్యా మారక త్వేన నిశ్చితా- ।
జ్ఞాతవ్యాని బుధైరేవం ఫలానిఘట జన్మనః ॥

ఈ లగ్నమునకు కుజ గురు చంద్రులు పాపులు. శుక్రుడొక్కడే శుభుడు. కుజ శుక్రులు యోగకారకులు. గురుడు ఒక్కడే చంపడు. మారకులగు కుజుడు మొదలైనవారు చంపెదరు. పై శ్లోకములలో మొదట కుజుడు పాపియని చెప్పి మరల శుభుడని చెప్పబడినది. కుజ శుక్రులు భాగ్యరాజ్యాధిపతులగుట వలన వీరికలయిక కేంద్రకోణము లలో నెచ్చటనైనను ప్రబల రాజయోగకరము. "కుజజీవేందవః"

అని చెప్పుటకంటె "బుధజీవేందనః" అని చెప్పిన రీతిగా నుండెడిది. ఈ లగ్నమునకు రవి శనులు అత్యంతశుభులు. వీరు కుజునికంటెను అధిక యోగము నిచ్చెదరు. రవి కుజ శనుల సంబంధము కేంద్ర కోణములందు అత్యంత రాజయోగప్రదము. వీరికి బుధసంబంధము మంచిదికాదు. వీరికి శుక్రసంబంధము మరింతమంచిది. వీరందరు కేంద్రములందు కలసి శుక్రుడు మాత్రము సామాన్యముగా నుండును. మిగిలినవారు మంచియోగము నిచ్చెదరు. ద్వితీయమునం దున్నను మంచివారు. ఈ లగ్నమునకు కుజుడు వ్యయమందున్నను యోగభంగములేదు. బుధుడు కూడిగా కేంద్రకోణములందు మంచి వాడు. గురుడు మారక విషయమున ఇతర మారకులకంటె బల హీనుడు.

## మీన లగ్నమునకు

శ్లో॥ మందశుక్రాంశు మత్జ్ఞాఖ్యాః పాపాఖ్యాను విధూశుభౌ ।
మహీసుత గురూ యోగకారిణౌ నైవ భూసుతః ॥
మారకా మారకాభిఖ్యా మందాద్యాఘ్నంతి పాపినః ।
ఇత్యూహ్యాని బుధైస్సమ్యక్ఫలాని ఝషజన్మనః ॥

ఈ లగ్నమునకు శని శుక్ర రవి బుధులు పాపులు. కుజచంద్రులు శుభులు. కుజ గురులు రాజయోగ కారకులు. కుజుడు మారకుడు గాడు. పాపులగు శని మొదలగువారు చంపుచున్నారు. ఈలగ్నము నకు చంద్రుడు తప్ప ఇతర గ్రహములన్నియు ఆధిపత్యముచేత పాపులు. కుజచంద్రులనుటకంటె శుక్ర చంద్రులు శుభులని చెప్పిన సరిగానుండెడిది. భాగ్య రాజ్యాధిపతులగు కుజ గురులు ఈలగ్నము నకు పూర్ణపాపులు. ఇట్టివారు కలసిగాని, కలియకగాని, స్వక్షే త్రములందుగాని, పరివర్తనమందుగాని, కేంద్రకోణములందు గాని యుండిన అవయోగప్రదము. చంద్ర గురులు కర్కాటక వృశ్చికము లందు కలసినచో రాజయోగము కలుగుచున్నది.

శ్లో॥ ఏవం ద్వాదశాభావానాం శుభాశుభఫలం విదుః ।
తన్వాది ద్వాదశానాంచ భావానాం యోజ యేత్ఫలం ॥

ఇదివరలో మేషాది ద్వాదశ రాసులందు గ్రహబలము నూహించి నట్లే పండితులైనవారు తన్వాది ద్వాదశ భావములకు ఫలములను ఊహించ వలయునని భావము. పారాశర్యాదిమతములను చక్కగా చదివి సంప్రదాయములనుగూడ తెలిసికొనవలయును. ఈశాస్త్రము నకు అనుభవము ముఖ్యావశ్యకమైనది. గాన అనుభవములో యోగావయోగము లెట్లు జరుగుచున్నవో తెలియవలెను.

శ్లో॥ పాపానీచగ్రహాః స్తేషా ముచ్చస్తేఽపి కింఫలం ।
యోగాశ్చ కిం కరిష్యంతి స్వదశామనాగమే ॥

ఆయాలగ్నములకు చెప్పబడిన పాపగ్రహములు పాపఫలమునే యిచ్చును. వారు ఉచ్చయందున్నను నేమి ఫలము నిత్తురు? శుభ యోగములును ఆయా దశలు రానప్పుడు ఏమి ఫలితముల నివ్వగలవు? అనగా వ్యర్థంబులగునని భావము.

పీఠికమీద యోగమున్నది. లేనిది, మొదట నిర్ణయించవలెను. యోగమున్నచో స్థానాధిప కారకుల దశలు రానక్కరలేదు. యోగము వారి అంతరములలో జరుగగలదు. ఒక భావమునకు పీఠికమీద యోగమున్న యెడల ఆయా దశలు రాకున్నను యోగము కలుగుచున్నది.

శ్లో॥ మిత్ర శత్రు సమాయోగఫలం మిశ్రితం సమందుః।
కేంద్ర త్రికోణేషూచ్చేవా మిత్రయోగే తథాధికం॥

మిత్ర శత్రువులగు గ్రహములు కలిసినచో మిశ్రమ ఫలమును; కేంద్ర కోణములందును ఉచ్చయందును నున్న గ్రహమునకు మిత్ర గ్రహముయొక్క కలయిక కలిగినచో నధిక ఫలమునిచ్చునని భావము.

యోగనిర్ణయమును చేయుటలో పైన చెప్పిన విషయము లేమాత్రమును ఉపయోగములు కావు. పీఠికమీద నిర్ణయింపబడు యోగమును ఈశత్రు మిత్రుల సంబంధము నూటికైదు పాళ్ళుగా హెచ్చించుటకుగాని, తగ్గించుటకుగాని పనికివచ్చును.

శ్లో॥ మిత్రరాసిగతే వాపి మంత్రిణాయది వీక్షితే ।
మిత్రయుక్తే బలవతె రాజతుల్యో భవేన్నరః ॥

మిత్రక్షేత్రమందు మిత్రగ్రహముతో గూడి బృహస్పతిచే చూడబడిన గ్రహముయొక్క ప్రభావమువలన మనుష్యుడు రాజతుల్యుడగునని భావము.

ఈశ్లోకమున చెప్పిన విషయము ప్రకారము గ్రహములున్నచో జాతకుడు మంచి స్వభావము గలవాడగునని చెప్పవలెను. కాని హెచ్చుయోగము చెప్పరాదు.

# ప్రతిబంధకగ్రహ ఫలితము

ఈ క్రింది విషయము చాల ప్రాముఖ్యమైనది. యోగమును నిర్ణయించునప్పుడు ప్రతిబంధక గ్రహముయొక్క బలమునుగూడ చూచుకొనవలెను. ఏగ్రహములను యోగకారకులుగ పారాశర్య మతము ననుసరించి నిర్ణయించుకొన్నామో, అట్టివానికి సప్తమమందున్న గ్రహములు పైనిచెప్పిన యోగకారక గ్రహములకు ప్రతిబంధక గ్రహములగును. లగ్నమందున్న గ్రహమునకు సప్తమమందున్నవాడును, తృతీయమందున్న వానికి భాగ్యమందున్న వాడును, చతుర్థమందున్న వానికి దశమమందున్న వాడును, పంచమమందున్నవానికి ఏకాదశమందున్నవాడును ప్రతిబంధక గ్రహములుగా నగుదురు. మిగిలిన స్థానములకుగూడ నిట్లేయగును.

ఈ ప్రతిబంధక గ్రహములయొక్క నైసర్గిక స్వభావముంతో బనిలేదు. యోగకారక గ్రహదశ వచ్చినప్పుడు వానికి సప్తమమందు గ్రహమున్నది, లేనిది, చూచుకొనవలెను. అట్లు ప్రతిబంధక గ్రహము లేనియెడల యోగకారకునిదశ మొదట నిర్ణయింపబడిన విధముగా యోగప్రదమగును.

యోగప్రదమగు గ్రహమునకు ప్రతిబంధక గ్రహమున్నచో, నది ఎన్నిభాగలు తానున్న లగ్నములో పూర్తిచేసినదో తెలిసికొనవలెను. ప్రతిబంధక గ్రహము యోగకారక గ్రహముకంటె అధిక భాగలు పూర్తిచేసియున్నచో, యోగకారక గ్రహము తానివ్వతగ్గ యోగము నివ్వజాలదు. సమముగా రెండు గ్రహములు పూర్తిచేసినచో యోగము సామాన్యముగనుండును. ప్రతిబంధకగ్రహము తక్కువ భాగలే పూర్తిచేసియున్నయెడల యోగకారకగ్రహము పూర్తియోగమును అనగా తానివ్వతగ్గ యోగమునిచ్చును.

అనగా ప్రతిబంధకగ్రహము యోగకారక గ్రహముకంటె ఎక్కువ భాగలు పూర్తిచేసియుండరాదు. అట్లున్నచో యోగకారక గ్రహము తనకుగల స్థితి, ఆధిపత్య, సంబంధములవల్ల నివ్వతగ్గ ఫలితమును యివ్వజాలదు. కాబట్టి యోగము చెప్పునప్పుడు ప్రతిబంధకగ్రహమునుగూర్చి కూడ నాలోచించి యోగమును చెప్పవలయును. అనుభవమునకు సరిపోవుచున్నది.

ఉదాహరణ :— చతుర్థమందు కుజుడుండి, వాడు యోగము చేయునని నిర్ణయించితి మనుకొందము. వానికి సప్తమము, లగ్నాత్తు దశమమగును. దానియందు గురుడున్నాడనుకొందము. అప్పుడీ గురుడే ఆకుజునకు ప్రతిబంధక గ్రహమగును. యోగకారక గ్రహమగు కుజుడు; పతిబంధకగ్రహమగు గురుడును, తాముండు

లగ్నములందెన్ని భాగలు పూర్తిచేసికో తెలిసికొనవలెను. గురుడు కుజునికంటె అధిక భాగలను పూర్తిచేసిన కుజుడు తానివ్వతగ్గ యోగము నివ్వజాలడు. కుజుడే అధిక భాగలను పూర్తిచేసిన తానివ్వతగ్గ యోగమునిచ్చును. మిగిలినవానికిగూడ నిట్లే చూచుకొనవలెను.

## జ్యోతిశ్శాస్త్ర యుత్కృష్టత

శ్లో॥ ఫలాని గ్రహచారేణ సూచయంతి మనీషిణః ।
కోవక్తా తారతమ్యస్య తమేకం వేధసంవినా ॥

పండితులు గ్రహసంచారముల ననుసరించి ఫలములనుసూచించు చున్నారు. బ్రహ్మ మినహా యోగముల హెచ్చు తగ్గులను నిర్ణయింపజాలరు. ''వేధవినా'' అని చెప్పుటవలన నీ శాస్త్రము యొక్క ఉత్కృష్టత స్పష్టమగుచున్నది.

గద్య

ఇది శ్రీ పార్వతీపరమేశ్వర కరుణాకటాక్ష లబ్ధమౌద్గల్యసగోత్ర పవిత్ర
శ్రీ వాడ్రేవు వంశపయః పారావార రాకాసుధాకర శ్రీరామ
స్వామిశాస్త్ర్యార్యపౌత్ర వేంకట రాజామాత్య వేంకట
రత్నమాంబాపుత్ర, సుకవిజనవిధేయ జ్యోతిష
విద్యాప్రవీణ సూర్యనారాయణమూర్త్య
భిధేయ ప్రణీతంబైన జాతకనారా
యణీయమునందు మిశ్ర
ఫలఖండమను
చతుర్థ భాగము
సంపూర్ణము
ఓమ్ తత్సత్